**SUNDARAYYA VIGNANA KENDRAM**
1-8-1/B/25 A, Bagh Lingampalli
Hyderabad – 500 044, Andhra Pradesh, India

---

## Bibliographic Record Target

నవశక్తి : ఆంధ్రరాష్ట్రకాంగ్రెసుసోషలిస్టుపార్టీవారపత్రిక -- Vol. 1, no. 1 [December 15, 1937] - Vol. 2, no. 38 [September 06, 1939]

రాజమండ్రి : M. Annapurnayyo, 1937-1939.

74 v. ; 36 cm.

Weekly

In Telugu.

Published in Bejavada from June 15, 1938.

Library lacks: Vol. 1, no. 13, 15-23, Vol. 2, no. 12,

Record no. 682

Navaśakti : Āṃdhrarāṣṭrakāṅgresusōṣalisṭupārṭīvārapatrika -- Vol. 1, no. 1 [December 15, 1937] - Vol. 2, no. 38 [September 06, 1939]

Rājamanḍri : M. Annapurnayya, 1937-1939.

74 v. ; 36 cm.

Weekly

In Telugu.

Published in Bejavada from June 15, 1938.

Library lacks: Vol. 1, no. 13, 15-23, Vol. 2, no. 12,

Record no. 682

---

**35mm microfilm**

**Image placement: IA (IIA) IB IIB**　　**Date filming began: 3 February, 2006**

# List of issues filmed

## Navasakti

Vol. 2, no. 20 (May 3, 1939)
Vol. 2, no. 21 (May 10, 1939)
Vol. 2, no. 22 (May 17, 1939)
Vol. 2, no. 23 (May 24, 1939)
Vol. 2, no. 24 (May 31, 1939)
Vol. 2, no. 25 (June 7, 1939)
Vol. 2, no. 26 (June 14, 1939)
Vol. 2, no. 27 (June 21, 1939)
Vol. 2, no. 28 (June 28, 1939)
Vol. 2, no. 29 (July 5, 1939)
Vol. 2, no. 30 (July 12, 1939)
Vol. 2, no. 31 (July 19, 1939)
Vol. 2, no. 32 (July 26, 1939)
Vol. 2, no. 33 (Aug. 2, 1939)
Vol. 2, no. 34 (Aug. 9, 1939)
Vol. 2, no. 35 (Aug. 16, 1939)
Vol. 2, no. 36 (Aug. 23, 1939)
Vol. 2, no. 37 (Aug. 30, 1939)
Vol. 2, no. 8 [i. e. 38] (Sep. 6, 1939)
Annual special (Nov. 11, 1939)

## Prajasakti

Vol. 1, no. 1 (June 17, 1942)
Vol. 1, no. 2 (June 24, 1942)
Vol. 1, no. 3 (July 1, 1942)
Vol. 1, no. 4 (July 8, 1942)
Vol. 1, no. 5 (July 15, 1942)

Continued...

Vol. 1, no. 6 (July 22, 1942)
Vol. 1, no. 7 (July 29, 1942)
Vol. 1, no. 8 (Aug. 5, 1942)
Vol. 1, no. 9 (Aug. 12, 1942)
Vol. 1, no. 10 (Aug. 19, 1942)
Vol. 1, no. 11 (Aug. 26, 1942)
Vol. 1, no. 12 (Sep. 2, 1942)
Vol. 1, no. 13 (Sep. 9, 1942)
Vol. 1, no. 14 (Sep. 16, 1942)
Vol. 1, no. 15 (Sep. 23, 1942)
Vol. 1, no. 16 (Sep. 30, 1942)
Vol. 1, no. 17 (Oct. 7, 1942)
Vol. 1, no. 18 (Oct. 14, 1942)
Vol. 1, no. 19 (Oct. 21, 1942)
Vol. 1, no. 20 (Oct. 28, 1942)
Vol. 1, no. 21 (Nov. 4, 1942)
Vol. 1, no. 22 (Nov. 11, 1942)
Vol. 1, no. 23 (Nov. 18, 1942)
Vol. 1, no. 24 (Nov. 25, 1942)
Vol. 1, no. 25 (Dec. 2, 1942)
Vol. 1, no. 26 (Dec. 9, 1942)
Vol. 1, no. 27 (Dec. 16, 1942)
Vol. 1, no. 28 (Dec. 23, 1942)
Vol. 1, no. 29 (Dec. 30, 1942)
Vol. 2, no. 1 (Jan. 13, 1943)
Vol. 2, no. 2 (Jan. 20, 1943)
Vol. 2, no. 3 (Jan. 27, 1943)
Vol. 2, no. 4 (Feb. 3, 1943)
Vol. 2, no. 5 (Feb. 10, 1943)
Vol. 2, no. 6 (Feb. 17, 1943)
Vol. 2, no. 7 (Feb. 24, 1943)
Vol. 2, no. 8 (Mar. 3, 1943)
Vol. 2, no. 9 (Mar. 10, 1943)

Continued...

Vol. 2, no. 10 (Mar. 17, 1943)
Vol. 2, no. 11 (Mar. 24, 1943
Vol. 2, no. 12 (Mar. 31. 1943)
Vol. 2, no. 13 (Apr. 7, 1943)
Vol. 2, no. 14 (Apr. 14, 1943)
Vol. 2, no. 15 (Apr. 21, 1943)
Vol. 2, no. 16 (Apr. 28, 1943)
Vol. 2, no. 17 (May 5, 1943)
Vol. 2, no. 18 (May 12, 1943)
Vol. 2, no. 19 (May 19, 1943)
Vol. 2, no. 20 (May 26, 1943)
Vol. 2, no. 21 (June 2, 1943)
Vol. 2, no. 22 (June 9, 1943)
Vol. 2, no. 23 (June 16, 1943)
Vol. 2, no. 24 (June 23, 1943)
Vol. 3, no. 1 (July 7, 1943)
Vol. 3, no. 2 (July 14, 1943)

మే డే సంచిక

Regd. No. M. 3284

# నవశక్తి

ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సోషలిస్టు పార్టీ వారపత్రిక

సంపుటం 2 } బుధవారం 3–5–39 బెజవాడ { సంచిక 20



# మే డే



కామ్రేడ్ పుచ్చలపల్లి సుందరయ్య

మే ఒకటి. ఆరోజు ప్రపంచమంతా కార్మికవర్గము తన శక్తిని పరిశీలించుకుంటుంది. ప్రపంచములో నూతన సమాజాన్ని, నూతన జీవితాన్ని నిర్మించడానికి పూనుకొన్న కార్మికవర్గం, ప్రజాసామాన్యాన్ని ఎంత వరకు ఆమార్గాన తాను తీసుకొని వెళ్లినదీ పరిశీలిస్తుంది. ఆ ధ్యేయం కొరకు తనశక్తిని, తన్ను బలపర్చుచున్న ఇతర పీడిత జనసామాన్యం యొక్క బలాన్ని అంచనా వేసుకుంటుంది. తన్ను వ్యతిరేకించే పెట్టుబడిదారీ, జమీందారీ వర్గాల బలాన్ని, వారియెత్తులను గమనిస్తుంది. గడచిన సంవత్సరమంతయు జరిగిన పోరాటాల ఫలితాన్ని చూస్తుంది. తన ధ్యేయం కొరకు, ఇంకను ఎక్కువగా ప్రజాసామాన్యమును తనతో తీసుక పోవడానికి, శత్రువుతో ఢీకోడానికి మార్గాలు, ఉపాయాలు ఆలోచిస్తుంట. ఈ విధంగా 1886 లో న్యూయార్కు కార్మికులపై తుపాకులు ప్రేల్చినది మొదలు నేటివరకు మే ఒకటి కార్మిక దినోత్సవముగా పరిగణింపబడి, జరుపబడుచున్నది.

గత మేడే నాటికి స్పెయిను యుద్ధం ఇంకను తీవ్రముగా సాగుతూనే ఉండినది. చైనాలో జపాను హాంకోనగరానికి చాల దూరాన యుద్ధము చేస్తూ ఉండినది. ఆస్ట్రియాను జర్మనీ మ్రింగి వేసింది. ఇటలీ జర్మనీలు కలసి స్పెయిను యుద్ధము సాగిస్తూ ఉండినయి. ఇంగ్లండులోని ఛాంబర్లేను ప్రభుత్వము ఇటలీ జర్మనీ ఫాసిస్టు నియంతలను బలపరుస్తూ ఉండినది. అయినా యూరపు ఖండములో ఇటలీ జెర్మనీ ప్రాబల్యము రాలేదు. "యుద్ధము యుద్ధము" అని కలవరిస్తూఉన్న ఈదేశాలను అరికట్టడానికి, యుద్ధము ప్రపంచమంతా వ్యాపించకుండ జేయడానికి, ప్రజాతంత్ర రాజ్యాలకు· శాంతి శక్తులకు అవకాశముండినది. ఫ్రాంసులో రెండవసారి బ్లూం ప్రభుత్వం పోయి, దలదీరు ప్రభుత్వము వచ్చినా· ఫ్రెంచి కార్మికుల బలము క్షీణించలేదు. ఫ్రెంచి రాజకీయాలను, ప్రపంచ రాజకీయాలను, డైరెక్టుగా, (తిన్నగా) మార్పుచేయడానికి గావలసిన శక్తి ఫ్రెంచి కార్మికసంఘం చేతులలో ఉండినది. ఆర్థికక్షోభ గత మేడే నాటికి కొన్ని నెలలు ముందే ఆరంభమయినను, పైఘటనలన్నీ జరిగాయి.

కాని నేడు, మేడే నాటికి, ప్రపంచ ఆర్థిక క్షోభ ప్రపంచాన్నంతా ఆవరించుకుంది. ఆయుధాలను అమితముగా తయారు చేయడమువల్ల, ఈ ఆర్థిక మాంద్యం, పూర్తిగా కనపడుటలేదు. అయినా ఈ ఆర్థిక మాంద్యమునుండి తప్పించుకోడానికి వివిధ సామ్రాజ్యవాద దేశాలు, ముఖ్యంగా, జర్మనీ, ఇటలీ, జపానులు యుద్ధాన్ని తీవ్రతరము గావించడము, ఒక దేశము పిదప మరియొక దేశాన్ని ఆక్రమించడము జరుగుతూ ఉంది.

జర్మనీ జెకోస్లోవేకియాను, ఆస్ట్రియాను ఆక్రమించినట్లే. ఆక్రమించాలని ప్రయత్నించింది. దానికి బ్రిటను తోడ్పడింది. మ్యూనిక్ ఒడంబడిక ప్రకారము, జెకోస్లోవేకియా యొక్క సురక్షిత సరిహద్దులను, చాల ప్రదేశాన్ని జర్మనీకి వశమంది, ఆ రోజునుండి జెకోస్లోవేకియా జర్మనీ చేతులలో ఉండ సాగింది. జెకోస్లోవేకియా ఏ రోజు తన అధీన దేశమయిందో ఆ రోజు నుండి యూరపులో జర్మనీ స్థానము ప్రధానమైంది· ఆ రోజునుండి జర్మనీ ఇటలీలు. ఈవరకువలె బెదరింపులతోనే తమ కార్యాలను నిర్వహించుకొనక అవసరమయినచో ఫ్రాంసు, బ్రిటనులతో యుద్ధము చేయడానికికూడ శక్తి కలిగినవయ్యాయి.

మ్యూనికు ఒడంబడికతో బ్రిటను ఫ్రాంసులు, తమ సామ్రాజ్యాలకు కొంత హాని కలిగినా, ఫాసిస్టు దేశాలను అరికట్టుటకు పూనుకొనవు: పైగా వానికి కొంత వరకు సాయపడతాయి అని జపాను ఊహించింది. కాంటను నగరాన్ని ఆక్రమించింది. చైనాకు ఆయుధాలను పోయే ఒక మార్గాన్ని అరికట్టివేసింది. హాంకో నగరాన్ని స్వాధీన పర్చుకుంది. తీవ్ర ప్రదేశమంతా జపాను చేతులలో ఉండినా, పశ్చిమ చైనాను ప్రభుత్వ కేంద్ర మొనర్చాడు చాంగ్-కే-షేకు; చైనా ప్రజా సామాన్యమంతా కుమింగ్‌టాంగ్‌తో సహా కమ్యూనిస్టులు సూచించిన ఐక్య విధానముతో, గొరిల్లా విధానముతో యుద్ధము సాగిస్తున్నారు.

మూనిక్· ఒడంబడికతో, బ్రిటను ఫ్రాసులలో పౌరసత్వ హక్కులను తగ్గించడానికి ఆరంభించారు. ఫ్రాంసులో డిక్రీలపాలన ఆరంభమయింది. ఫ్రెంచి కార్మికులనుభవిస్తూ ఉండిన 40 గంటల వారము పోయి యుద్ధ పరిశ్రమలలో 60 గంటల వారము, తతిమ్మా పరిశ్రమలలో 44 గంటల వారము వచ్చింది. దీనిని వ్యతిరేకిస్తూ 30 లక్షల మంది ఫ్రెంచి కార్మికులు జనరల్ స్ట్రియిక్ చేశారు. కాని దానికి దలదీరు ప్రభుత్వాన్ని లేకుండ చేయలేకపోయారు. ఆ రోజునుండి ఫ్రాంసు పూర్తిగ విదేశాంగ నీతియందు బ్రిటనును అనుసరించ సాగింది.

దీనిఫలితము స్పెయినుకు ఆయుధములు పోకుండా పూర్తిగా ఆపుచేసింది. ఇటలీ జర్మనీలు మరింత సైన్యాన్ని, ఆయుధాలను ఫ్రాంకో విద్రోహికి పంపి బార్సిలోనాను, కాటలోనియాను ఆక్రమించుకో గలిగినాయి. మాడ్రిడులో స్పైను ప్రభుత్వ మింకను బలిష్టముగా ఉన్నప్పుడే ఫ్రాంకోను స్పెయిను ప్రభుత్వంగా ఫ్రాంసు బ్రిటనులు గుర్తించాయి, నెగ్రిన్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా జనరల్ కసాడోచే తిరుగుబాటు చేయించింది. మాడ్రిడును కసాడో ఫ్రాంకో చేతులలో పెట్టాడు. 1871 లో పారిస్ కమ్యూన్ పతనము పిమ్మట, 1919 లో యూరపులో వివిధ దేశాలలో కార్మిక తిరుగుబాటులను అణచినప్పుడు. 1927 లో చైనాలో కమ్యూనిస్టులను చంపినప్పుడు, జరిగిన హత్యాకాండ స్పెయినులో నేడు తిరిగి జరుగుతూ ఉంది.

స్పెయిన్ లో కూడ ఫాసిస్టు ప్రభుత్వము ఏర్పడి ఇటలీ జర్మనీలతో కలసి కమ్యూనిస్టు వ్యతిరేకపు టొడంబడికలో చేరగనే ఇటలీ జర్మనుల యుద్ధవ్యూహములకు మరింత బలము చేకూరింది, నామమాత్రముగనున్న జెకోస్లోవేకియాను, మెమిలును జర్మనీ కబళించినది. ఆల్బేనియాను ఇటలీ ఆక్రమించింది· హంగరీ ఇదివరకే కమ్యూనిస్టు వ్యతిరేకపు టొడంబడికలో చేరిపోయింది· యుగోస్లోవేయానుకూడ చేరమని ఇటలీ జర్మనీలు ఒత్తిడితెస్తూ ఉన్నాయి. త్వరలోనే చేరిపోతుంది. పోలండు, రుమేనియాలపై కూడ ఒత్తిడి తెస్తూ ఉన్నాయి.

ఫాసిస్టు దేశాల ఈ చర్యలకు ప్రపంచ ప్రజాసామాన్యము అసహ్యించుకుంది. రూజ్‌వెల్టు పదేండ్లవరకు మిగిలిన స్వతంత్ర దేశాలను ఆక్రమించు కొనమని హామీ ఇస్తారా అని హిట్లరు ముసోలినీలకు కబురంపించాడు. ప్రజాభిప్రాయాన్ని త్రోసివేసుకోలేక, రుమేనియా, గ్రీసు, పోలండులకు, తమ స్వాతంత్ర్యము కోసం అవి పోరాడేపక్షాన. సహాయము చేస్తామని బ్రిటను ఫ్రాంసులు వాగ్దాన మొనర్చాయి. కాని ఏప్రజాభిప్రాయము, తన ఫాసిస్టు సానుభూతి ధోరణిని కప్పిపెట్టించిందో, ఆ ప్రజాభిప్రాయాన్నే అణచడానికి ఛాంబర్లేను మంత్రివర్గము ప్రయత్నిస్తూ ఉంది. దీనికి మొదటిమెట్టు బ్రిటనులో కూడ నిర్బంధ సైనికశిక్షణను ప్రవేశ పెట్టడము.

గ్రీసు, రుమేనియా పోలండులకు హామీ ఇచ్చింది. ఆహామీని జయప్రదంగా ఆచరణలో పెట్టాలంటే రష్యాతో సైనికపు టొడంబడికను, ఆ దేశాలన్నీ, బ్రిటను ఫ్రాంసులు చేసుకోవాలి. దానికి బ్రిటను ఆ దేశాలు, తయారు కావడములేదు. కమ్యూనిస్టు వ్యతిరేకపు టొడంబడిక. సోవియటు యూనియనుకే

గాక బ్రిటను ఫ్రాంసులకుకూడ వ్యతిరేకమే. వారికీ ముప్పే. దానిని భగ్నముచేయడానికి బ్రిటను ఫ్రాంసులు రష్యాతో (సోవియటు యూనియనుతో) కలువకపోతే. వారికి మిగిలిన మార్గం తాముకూడా ఆ ఒడంబడికలో చేరి రష్యాపై దాడికి పూనుకోవడమే!

కాని సోవియటు యూనియను తన బలాన్ని ప్రజా సామాన్యముయొక్క సంపదలను, విజ్ఞానాన్ని పెంపొందించడానికి తన మూడవ పంచవర్ష ప్రణాళికను అవలంబించి కొనసాగిస్తూ ఉంది. తన్ను పెట్టుబడిదారీ దేశాలన్నీ చుట్టుముట్టుచున్నా, ప్రతి దేశములోని కష్టజీవులయందు భారమువేసి నూతన సమాజాన్ని, నూతన జీవితాన్ని నిర్మించడములో మరియొక దశకు, ముందుకు పోతూ ఉంది.

నేడు ప్రపంచమంతా యుద్ధము వ్యాపించే పరిస్థితులు కలిగాయి. అలాంటి యుద్ధాన్ని ఆపుచేయలేము. కాని సోవియటు యూనియనుతో కలసి బ్రిటను ఫ్రాంసులు జర్మనీ ఇటలీలను ఎదుర్కొంటే, ఆ యుద్ధాన్ని త్వరలో, జర్మనీ ఇటలీలతో ఫాసిస్టుల నణచివేసి ముగించవచ్చును. కాని అలా చేయాలంటే ఫ్రాంసు, బ్రిటనులలోని ప్రస్తుతమున్న ప్రభుత్వాలను కష్టజీవులు కూలద్రోయాలి.

బ్రిటిషు ప్రభుత్వమును కూలద్రోయడానికి భారతీయ ప్రజాసామాన్యము తమ స్వాతంత్ర్యము సంపాదించడము పరమావశ్యకము. గత సంవత్సరము భారతీయ స్వాతంత్ర్య పోరాటము ఎలా పెంపొందినదీ చూస్తాము.

మైసూరులో ఆరంభమయిన స్వదేశసంస్థాన ప్రజా ఉద్యమము. దానితో ఆగలేదు. మన్నా, లాకెట్ సంస్థాలలో రైతు ఉద్యమరూపమున ఆరంభమయి ప్రజాతంత్ర ప్రభుత్వస్థాపన పోరాటముగా పరిణమించినది. తిరువాన్కూరులో దివాను సి.పి రామస్వామిఅయ్యరు దుష్పరిపాలనకు వ్యతిరేకంగా ఆరంభమయిన పోరాటము. ప్రజాతంత్ర ప్రభుత్వము కోసం ముందుకు నడచింది. అనేక కాల్పులు, లాఠీచార్జీలు, అరెస్టులు జరిగాయి. మైసూరు దురంతాలను మరిపించాయి. తిరువాన్కూరుదురంతాలు. వాటినిమించిన దురంతాలు ఒరిస్సా సంస్థానాలలో బయటపడ్డాయి. ఢెంకనాల్, టాల్చేరు ప్రజల పైకుపాకులు కాల్చడము. ఏనుగులచేత త్రొక్కించడము, గ్రామాలను దోచుకోవడము మామూలయి పోయాయి ఈ బాధలను సహించక 20 వేలమంది టాల్చేరు సంస్థాన ప్రజలు కాంగ్రెసు మంత్రివర్గము క్రిందనున్న ఒరిస్సారాష్ట్రములోకి వచ్చి నివాసము ఏర్పరచుకొన్నారు. రాజపుటానా సంస్థానాలను కాఠియవాడ్ సంస్థానాలకు ఈ ప్రజా చైతన్యము ప్రాకింది. పంజాబు బెంగాలు సంస్థానాలలో కూడ కదలిక కల్గింది. కడకు హైదరాబాదులో కూడ కాంగ్రెసు సంఘము ఏర్పడి 300 మంది జెయిళ్లకు వెళ్లారు. నేడు మామూలు పౌరహక్కులు సంపాదించుకోడానికి ఆర్యసమాజీయులు వందలకొలదిగా హైదరాబాదులో సత్యాగ్రహముచేసి అరెస్టు అగుచున్నారు.

రాజకోటలో ప్రజాపోరాటము ఫలితముగా సర్దార్ వల్లభాయికి రాజకోట సంస్థానాధీశునికి ఒడంబడిక కుదిరింది రాజకోట ప్రజా పరిషత్ తరఫున వల్లభాయిచే ఏడుగురు, మొత్తం 10 మందిగల ఒకకమిటీని నియమించబడుతాడు. వీరు తయారుచేసిన ఒడంబడికను రాజకోట సంస్థానాధీశుడు అమలు జరపాలి. స్వదేశ సంస్థానాలలో ప్రజాప్రభుత్వము ఏర్పడే సమయము వచ్చిందనీ దేశీయులందరూ సంతోషపడ్డారు. కాని బ్రిటిషు ప్రభుత్వము, తనకు కావలసిన సైనికులను చేర్చుకోడానికి కేంద్రాలయిన స్వదేశ సంస్థానాలతో ప్రజాప్రభుత్వాలకు రానిచ్చుటకు తయారు కాలేదు. ఆ ఒడంబడికను ధిక్కరించమన్నది. ఆ ఒడంబడికకోసం గాంధీజీ ఉపవాసం చేశాడు. మంత్రివర్గాలు రాజీనామా ఇస్తామని హెచ్చరించాయి. ఆ ఒడంబడికను తిరిగి అమలులో పెట్టవలసినట్లు చీఫ్ జడ్జీ నిర్ణయం వచ్చింది. కాని గాంధీజీ స్వదేశ సంస్థానా లన్నింటిలోను విజృంభిస్తూ ఉన్న ప్రజా పోరాటాన్ని ఆపు చేశాడు. నూతన పంథా త్రొక్కిచూస్తానన్నాడు, ప్రజా పోరాటము ఆపుచేయగనే రాజకోట సంస్థానాధీశుడు మహమ్మదీయులనూ, బయ్యరులనూ రెచ్చగొట్టాడు. గాంధీజీ చేసిన సూచనలన్నింటిని నిరాకరించాడు. బ్రిటిషు ప్రభుత్వము తిరిగి స్వదేశ సంస్థానములలో తన ఆటను ఆరంభించింది. రాన్పూరులో బజెల్ గెటీ అను బ్రిటిషు ఏజంటును ప్రజలు చంపారని, రామదుర్గలో జైయిలును తగలబెట్టి 8 మంది వార్డరులను చంపారని ఇతర సంస్థానాలలో కూడ హింసాయుత చర్యలు సాగాయని ప్రజా పోరాటాన్ని ఆపడము. ప్రజలు తమపై చేయబడే దురంతాలు, కాల్పులు, లాఠీచార్జీలను సహించుటకు ఒక హద్దు వుందని గ్రహించకపోవడమే. ప్రజాపోరాటాన్ని ఆపుచేయుడము బ్రిటిషు ప్రభుత్వపు దాడిని హెచ్చుచేయుడమే.

బీహారులో బక్సర్ పొలాలకొరకు రైతులు సత్యాగ్రహము గావిస్తూ ఉన్నారు. ఆంధ్రరాష్ట్రములో కాశీ పట్టణములో రైతులు తమకు న్యాయముగా రావలసిన పొలాలకోసం లాఠీచార్జీలకు, అరెస్టులకు స్త్రీలతో సహా గురి అయ్యారు. మునగాల జలంత్రా తలమంచి ఎస్టేటులలో జమీందారీ అక్రమాలను రైతులు పన్నులు నిరాకరణతో ఎదుర్కొంటూ ఉన్నారు. మలబారులో కూడ రైతులు రిమిషనులకోసం పోరాటము సాగిస్తున్నారు. అరెస్టులకు లోనవుతున్నారు. గుజరాతులో వెట్టి చాకిరీకి, దానిసత్వానికి వ్యతిరేకంగా వ్యవసాయకూలీలు, పోరాటము సాగిస్తున్నారు. వీరు రైతులు బొంబాయి చట్టము తమ కిచ్చిన హక్కు ప్రకారము అప్పులు చెల్లించవలసిన లేదు.

బెంగాలులో బద్వాను డివిజనులో నీటిపన్ను తగ్గించమని రైతులు సత్యాగ్రహము సాగిస్తున్నారు. పంజాబులో అమృతసరు లాహోరులలో పన్నులు తగ్గించమని సత్యాగ్రహముచేసి రైతులు లాఠీచార్జీలకు అరెస్టులకు గురి అవుతూ ఉన్నారు.

ఈ వివిధ రైతు పోరాటాలను అఖిలభారత కిసాను సంఘము నడపుతూ ఉంది. నేడు 7 లక్షల సభ్యులతో పనిచేస్తూ ఉంది.

విద్యార్థి సంఘముకూడ 40 వేల మంది సభ్యులలో ఆంధ్ర, అన్నామలై, బెనారిస్, సంయుక్త రాష్ట్రము, లాహోరులలో అనేక సమ్మెలు గావించి విద్యార్థుల హక్కులకోసం పనిచేస్తూ ఉంది.

ఈ వివిధ ప్రజాపోరాటాలలో కార్మికవర్గము, కార్మికవర్గము, కార్మికవర్గపార్టీలు అగ్రస్థానము వహించియే యున్నాయి. రాజకోట, రాజనందగాన్ సంస్థానాలలో కార్మిక సమ్మెలే సంస్థాన ప్రజాపోరాటాన్ని ప్రారంభమయ్యేటట్లు చేసాయి. తిరువాన్కూరు సంస్థాన ప్రజా పోరాటాన్ని బలపర్చింది. రాజకీయఖైదీలను విడుదల చేయుటకు సాయపడింది. 40 వేల రైల్వే కార్మికుల సమ్మె తిరువాన్కూరు సంస్థాన మందలి పడవకూలీల అందరి జనరలు స్ట్రయికు.

దేశమంతటా కార్మిక పోరాటాలు విజృంభించాయి. బీహారులో బొగ్గు, రాగిగనులలోను, తాతానగరుఉక్కు యంత్రాగారాలలో, బెంగాలులో నుడ్డి హౌరాపూడు ఇనుము పరిశ్రమలలో మద్రాసు రాష్ట్రము మధుర, కోయంబత్తూరు మద్రాసులలో బట్టల మిల్లులలోను, మద్రాసు అచ్చుయంత్రాలయాలలోను, ఆంధ్రరాష్ట్రమున కాకినాడ. చిట్టివలసలలోను, కార్మికులు సమ్మెలు సాగించారు. వానిలో దాదాపు అన్నిటియందు లాఠీచార్జీలు జరిగాయి. చిట్టివలసలో కాల్పులుగూడ జరిగాయి. ఒకడు మరణించాడు. 20 మందికి పైగా తుపాకి గుండుదెబ్బలు తగిలాయి.

50 వేల మంది కార్మికులు కాన్పూరులో కాంగ్రెసు ప్రభుత్వంచే నియమించబడిన విచారణ కమిటీ నిర్ణయాలను అమలు జరపడానికి మిల్లు యజమానులు నిరాకరించుటచే సమ్మె చేశారు. కాన్పూరు కాంగ్రెసు సంఘము పూర్తిగ సహాయము చేసింది. కాంగ్రెసు వాలంటీర్లను పంపి పికెటింగు చేయించినది. యు. పి. ప్రభుత్వము పోలీసులచే మామూలుగ జరుపబడు కార్మికుల ఊరేగింపులు జరుగనివ్వకుండడము, ఇట్టిచర్యలు కొనసాగ నివ్వలేదు. కాంగ్రెసు సంఘాలు, కాంగ్రెసు మంత్రివర్గాలు, కార్మిక పోరాటాలను ఏవిధంగా బలపర్చవలసినదీ ప్రజాపోరాటాలను ఏవిధంగా పెంపొందించవలసినదీ కాన్పూరు సమ్మె దేశానికంతా తెలియజేసింది. కార్మిక ప్రపంచానికంతా ఏవిధంగా కాంగ్రెసును తమ పోరాటాలను బలపర్చునట్లుచేసి కాంగ్రెసును జాతీయైక్య సంఘటనగా మార్చవలసినదీ కాన్పూరుసమ్మె తెలియజేసినది. కాంగ్రెసు- కార్మిక సంబంధాలకు ఆదర్శమార్గాన్ని ప్రదర్శించిందని దేశమంతా సంతోషించింది.

కాని బొంబాయి కాంగ్రెసు మంత్రివర్గము కార్మికుల సమ్మె హక్కుకు వారి స్వతంత్ర సంఘనిర్మాణానికి భంగము కలిగించేటట్టి కంపెనీ యూనియనులను ప్రోత్సాహపరిచేటట్టి కార్మికశాసనాన్ని చట్టము చేసింది. దానికి వ్యతిరేకముగా నవంబరు 7 తేదీన బొంబాయి రాష్ట్రమంతా కార్మికులు జనరలు స్ట్రయిక్కు చేశారు. 2 లక్షలమంది ఒక్క బొంబాయిలోను, మరియొక 50 వేలమంది ఇతర పట్టణాలలోను సమ్మెలో పాల్గొన్నారు. భారతదేశమంతటా, ఆరోజు ఆసమ్మెను బలపరుస్తూ సభలు జరిగాయి.

ఈ రకంగా ప్రజాపోరాటాలు ఒకవైపు చెలరేగుచూ ఉండే వీటినన్నిటిని కేంద్రీకరించి బ్రిటిషు ప్రభుత్వానికి వ్యతిరేకముగా నడుపవలసిన కాంగ్రెసు, మునుపంజ వేయక, లేచి చూడసాగింది. ఫలితము ముందుకు వెళ్లుతూ ఉన్న ప్రజాపోరాటాన్ని ప్రభుత్వోద్యోగులు అణచి వేయడానికి లాఠీచార్జీలు, కాల్పులు సాగిస్తూ ఉన్ననూ, వానిని సమర్థించడము జరిగింది. బొంబాయిలో కార్మిక చట్టము లాంటివి, బీహారులో కాంగ్రెసు జమీందారీ ఒడంబడికలాంటివి కార్మికులలోను రైతులలోను తీవ్ర అసంతృప్తిని కల్గించాయి. స్వదేశసంస్థాన ప్రజా ఉద్యమాన్ని బలపరుస్తూ బ్రిటిషు ఇండియానుండి ఎట్టి ఆందోళన, సహాయము లేకుండజేయడానికి సంస్థానాధీశుల రక్షణ చట్టాన్ని కాంగ్రెసు మంత్రివర్గాలు అమలు జరుపకపోయినా, అట్టి ఆందోళన, సహాయము కలుగడానికి కావలసిన ప్రయత్నాలేమీ చేయలేదు. రైతులకు కొద్దిగా సౌకర్యము కలిగించు ఒరిస్సా టెనెన్సీ చట్టములాంటివానికి వైస్రాయి అనుమతి ఇవ్వకపోయిననూ, నిర్బంధచట్టముల రద్దుచేస్తూ, సరిహద్దురాష్ట్రములో ప్యాసుచేసిన చట్టాన్ని గవర్నరు అంగీకరించక పోయినను, కాంగ్రెసు మంత్రివర్గాలు మొదలకుండా ఊరుకొన్నాయి. కాంగ్రెసు మంత్రివర్గాలు మొదటసంవత్సరమూ పౌరసత్వహక్కులను వివరిజేసినరీతి రెండవసంవత్సరము చేయజాలకపోయాయి. మంత్రివర్గాలు ముందుకు పోవడం లేదనే అసంతృప్తియే వెంటనే మంత్రివర్గాలు ప్రజోపకరములగు పనులు చేయడానికి అడ్డువస్తూ ఉన్న బ్రిటిషు ప్రభుత్వంతో పోరాటాన్ని ఆరంభించే కార్యక్రమము కావాలని సుభాసుబోసును అధ్యక్షునిగా ఎన్నుకొనేటట్లు చేసింది.

అధ్యక్షుని ఎన్నిక కలత కల్గించింది. ఒకే రకపు వారు వర్కింగు కమిటీలో ఉండాలని మితవాదులన్నారు. త్రిపురిలో మహాత్ముని అభీష్టం అనుసరించి, వర్కింగుకమిటీ వేయాలన్న పంతు తీర్మానం ప్యాసయింది. దానివలన, అనారోగ్యమువలన, బోసు వర్కింగు కమిటీని నిర్ణయించలేక పోయాడు.

ఈ సమయంలో బ్రిటిషు ప్రభుత్వము ఇండో- బ్రిటిషు ఒడంబడిక, యుద్ధ సమయంలో అణచడానికి ఇండియా ఆక్టు సవరణలు చేసింది. రాష్ట్ర ప్రభుత్వ పెత్తనాన్ని తగ్గించింది. సంస్థానాలలో చక్రవర్తులకు చేయూత నిచ్చియూ, మతకలహాల రేపియూ, చీలికలు గల్గించుతున్నది. రాజకోటలో హృదయపరివర్తనకై మహాత్ముడుచేసిన పరిశోధన విఫలమై ఓడిపోయి వచ్చాడు. సామ్రాజ్యవాదపు దాడిని ఎదుర్కొనడానికి దేశంలో ఐకమత్యం కావాలి. పోరాట కార్యక్రమం ప్రజలకు, కార్మికులకుకావాలి. మే దే నినాదం ఇదియే.



# అఖండ విజయంతో ముందుకు సాగుతున్న సోవియట్ పంచవర్ష ప్రణాళికలు

1939 వ సంవత్సరం, మార్చి 10 వ తేదీని జరిగిన సోవియట్ యూనియన్ యొక్క 18 వ కమ్యూనిస్టుపార్టీ సమావేశంలో కామ్రేడ్ వి ఎం. మోలటోవ్ చదివిన థీసిస్ ఈ క్రింది ప్రధానాంశములతో కూడియున్నది.

[ఈ క్రింది లెక్కలు వ్యాసంలో గమనించండి
రూబుల్: రు. 1-8-0
మిలియన్: 10 లక్షలు
మిలియార్డు: 100 కోట్లు —సం]

కామ్రేడ్ మాలొటొవ్

## రెండవ పంచవర్షప్రణాళిక

1933 లో ప్రారంభమయి 1937 లో ముగింపుకు వచ్చిన రెండవ పంచవర్ష ప్రణాళిక సంపూర్ణ విజయాన్ని పొందింది. దోచుకునే వర్గాలన్నీ పూర్తిగా మాయమయ్యాయి. ఒక మానవుని మరొక మానవుడు దోచుకొనడానికీ; మానవ సమాజం, దోపిడీ చేసేవారు-దోపిడీ చేయబడేవారు అని రెండు భాగాలుగా చీలిపోవడానికి అవకాశం యిచ్చే కారణాలూ యిప్పుడు లేవు. సోషలిస్టు విప్లవంలో ప్రధాన సమస్య అయిన సమిష్టి వ్యవసాయపద్ధతి అతిచక్కగా పరిష్కరించబడింది. కమ్యూనిస్టు సమాజానికి మొదటిదశ అయిన సోషలిజం మన దేశంలో సుస్థిరంగా స్థాపించబడింది.

రెండవ పంచవర్ష ప్రణాళిక పూర్తి అయేసరికి, ఉత్పత్తికి కావలసిన సంపద-ఉత్పత్తి సాధనాలు-ఉత్పత్తికి సంబంధించిన సంస్థలు-వీటిపై యాజమాన్యం 100 కి 98. 7 వంతులు సోషలిస్టు స్వభావాన్ని కలిగియున్నది.

దేశంయొక్క ఆర్థిక విధానంలో సోషలిస్టు పద్ధతి ప్రకారం జరిగే ఉత్పత్తే ఉన్నతస్థానాన్ని అలంకరించింది: పరిశ్రమల విషయములో 100 కి 99. 8 వంతులును; వ్యవసాయం విషయములో 100 కి 98.6 వంతులును: సోషలిస్టు పద్ధతి ప్రకారమే ఉత్పత్తి జరుగుతోంది. సరకుల రవానా అంతా 100 కి 100 వంతులు సోషలిస్టు పద్ధతి ప్రకారమే జరుగుతోంది.

### వివిధ వర్గాలు.

ఆర్థిక విధానాన్నిబట్టి వివిధవర్గాలు కూడా మారుతూ వచ్చాయి. 1937 వ సంవత్సరంలో సోవియట్ యూనియన్ యొక్క మొత్తము జనసంఖ్యలో 100 కి 34.7 మంది సోషలిస్టు ఉత్పత్తి విధానంలో పాల్గొంటూన్న కార్మికులు, నెల జీతగాళ్ళు (employees), సమిష్టి వ్యవసాయంలో పాల్గొంటూన్న రైతులు, కోఆపరేటివ్ చేతి పరిశ్రమలకు పనిచేసే చిన్నచిన్న ఉత్పత్తిదారులు, కోఆపరేటివ్ వ్యాపార సంస్థలలో పాల్గొనేవారు—వీరంతా కలసి మొత్తం జనాభాలో 100 కి 55.5 మంది చొప్పున ఉన్నారు. సైనికులు, విద్యార్థులు, పింఛనుదార్లు, యితరులు, కలసి 100 కి 4.2 వంతులు. కనుక 1937 నాటికే జనసంఖ్యలో 100 కి 94.4 వంతులు సోషలిస్టు ఉత్పత్తిలోను, దానితో దగ్గర సంబంధం గలిగిన సంస్థలలోను, పని చేసేవారే. 100 కి 5.6 వంతులు మాత్రమే సొంత వ్యవసాయంలోగాని, గృహ పరిశ్రమలలోగాని, కోఆపరేటివ్ సంస్థలకు చెందని వ్యాపార సంస్థలలోగాని, పనిచేసేవారు. కాని, నేడు వీరిసంఖ్య చాలావరకు తగ్గిపోయింది.

సోవియట్ యూనియన్‌లో ఏర్పడిన సోషలిస్టు సమాజంలో నేడు రెండువర్గాలు మిక్కిలి స్నేహభావంతో పనిచేస్తున్నాయి. అవి, కార్మికులు—కర్షకులు. వీరికీ, విద్యాధికులకూ మధ్య గల తారతమ్యం క్రమక్రమంగా నశిస్తున్నట్లే, వీరి ఉభయులలోగల తారతమ్యంకూడా క్రమక్రమంగా నశిస్తోంది. సోవియట్ యూనియన్‌లో స్థాపించబడిన సోషలిస్టు సమాజం ద్వారా ప్రజలలో నైతికంగాను, రాజకీయంగాను, ఒక విధమైన ఆంతరంగిక ఐక్యత ఏర్పడింది. ఇంతవరకు యెక్కడా ఇట్టి ఐక్యత ఏర్పడలేదు. కమ్యూనిస్టు పార్టీయొక్క నాయకత్వం క్రిందనే యిది సాధ్యమయింది. ఈ ఐక్యత ద్వారా, దేశంలో మిగిలిపోయిన శత్రువర్గాలను నిర్మూలన గావించడానికి; విదేశ శత్రురాజ్యాల దోపిడీలను అరికట్టడానికి; మన దేశాన్ని ఇంకా యెక్కువగా అభివృద్ధి పరచడానికి; కమ్యూనిస్టు సమాజాన్ని ఏర్పరచడానికి—సాధ్యమవుతుంది.

### యంత్రశక్తి.

ఆర్థికంగా, రెండవ పంచవర్ష ప్రణాళికలో సోవియట్ యూనియన్‌యొక్క యంత్రశక్తి విపరీతంగా వృద్ధిచెందింది. 1937 నాటికి మొత్తం పారిశ్రామిక సంపదలో 100 కి 80 వంతులు మొదటి రెండు పంచవర్ష ప్రణాళికల కాలంలో నిర్మింపబడిన ఫ్యాక్టరీలు — కర్మాగారాలే సప్లయిచేశాయి. మన వ్యవసాయంలో వినియోగించబడుతూన్న ట్రాక్టర్లు, కోత యంత్రాలు, 100 కి 90 వంతులు రెండవ పంచవర్ష ప్రణాళిక కాలంలో తయారైనవే. పరిశ్రమల విషయంలో రెండవ పంచవర్ష ప్రణాళిక 1937 ఏప్రిల్ 1 వ తేదీనాటికే, అనగా 4 సంవత్సరాల 3 నెలలలో, పూర్తి అయింది. యంత్రాలను ఉత్పత్తిచేసే పరిశ్రమలు ఈ 5 సంవత్సరాలలో మిగిలిన వాటికంటె ఎక్కువ వేగంగా అభివృద్ధి చెందాయి. ఇక రైల్వేల విషయం: రెండవ పంచవర్ష ప్రణాళిక యొక్క అంచనాలు 4 సంవత్సరాలలో పూర్తిచేయబడ్డాయి. కాయధాన్యాల ఉత్పత్తి, పత్తిపంట, కూడా యిదేవిధంగా ప్రణాళికయొక్క అంచనాలను మించిపోయాయి.

పారిశ్రామికోత్పత్తి 1932 లో కంటే 1937 లో 100 కి 120 చొప్పున హెచ్చింది. అంచనా ప్రకారం యిది 114 చొప్పున హెచ్చితే చాలు. ఈఅభివృద్ధి యొక్క సగటు రేటు 100 కి 17.1 వంతున హెచ్చింది. అంచనా ప్రకారం 16.5 వంతున హెచ్చితే చాలు.

ఈ పారిశ్రామికాభివృద్ధికి "స్టాఖనోవ్ ఉద్యమం" చాలావరకు తోడ్పడింది. ఒకరికంటె మరొకరు ఎక్కువ ఉత్పత్తి చేయడానికిపోటీలు వేసుకొని పనిచేయుటంద్వారా ఒక్కొక్కవ్యక్తియొక్క ఉత్పాదక శక్తి ఎక్కువ అయింది. రెండవ పంచవర్ష ప్రణాళికలో 100 కి 63 వంతుల చొప్పున పెద్ద పరిశ్రమలలో ఉత్పాదకశక్తి హెచ్చుకావాలని అంచనా వేయబడితే, ప్రణాళిక పూర్తి అయేసరికి 100 కి 82 వంతుల చొప్పున ఉత్పాదకశక్తి ఎక్కువయింది.

రెండవ పంచవర్ష ప్రణాళిక జయప్రదం కావడానికి ఆర్థిక, వైజ్ఞానిక, రాజకీయ, రంగాలలో శత్రువర్గాల ప్రాబల్యాన్ని, పలుకుబడిని, నిర్మూలించడానికి పోరాటం సాగించవలసి వచ్చింది. సోవియట్ యూనియన్ యొక్క సోషలిస్టు ఉత్పత్తిని, సమిష్టి సంపదను, రక్షించడానికి ట్రాట్స్కీ అనుచరులతోను, జాతీయ బూర్జువా గూఢచారులతోను, ఇతర విధ్వంసకారులతోను, పోరాటం సాగింపవలసివచ్చింది. వీరు విదేశగూఢచారుల ఆజ్ఞానువర్తులై, ఫేసిస్టు రాజ్యాలకు సహాయం చేసి, సోవియట్ యూనియన్ యెడల ద్రోహబుద్ధితో ప్రవర్తించిన అధమాధములు వీరి చేతలవల్ల అనేక ఉత్పత్తిసంస్థలకు విశేష నష్టం వాటిల్లింది. ఇట్టి శత్రువు లందరినీ యికముందుకూడా పూర్వం వలెనే అణచి వేయడంవల్ల సోషలిస్టు ఆర్థిక విధానం పూర్వకంటె జయప్రదంగా అభివృద్ధి చెందగలదు.

### ప్రజలకు గలిగిన ప్రయోజనాలు

సోవియట్ యూనియన్ యొక్క ఆర్థిక జీవనంలో పాల్గొనే వారిసంఖ్య రెండవ పంచవర్ష ప్రణాళిక పూర్తిఆయేసరికి 100 కి 17. 6 వంతుచొప్పున వృద్ధిచెందింది. కార్మికుల యొక్క, నెల జీతగాళ్ళయొక్క, వేతనాలు సగటున 100 కి 113. 5 చొప్పున, అనగా రెట్టింపుకు, హెచ్చాయి. కార్మికులకు, నెలజీతగాళ్ళకు, ప్రత్యేకించబడిన ధనం రెండవ పంచవర్ష ప్రణాళిక అంచనాప్రకారం 100 కి 55 వంతులచొప్పున హెచ్చవలసి యుండగా, ప్రణాళిక పూర్తి అయేసరికి 100 కి 150 చొప్పున హెచ్చింది. కార్మికుల విద్య, ఆరోగ్యం, మొదలైన సౌకర్యాలకు ప్రభుత్వం చే ఖర్చు పెట్టబడిన ధనం 1932 లో కంటె 1937 లో 3 రెట్లు హెచ్చింది. 4.4 మిలియార్డు రూబుల్సు నుండి 14 మిలియార్డు రూబుల్సుకు హెచ్చింది. నాలుగు సంవత్సరాలలో (1933—38) సమిష్టి వ్యవసాయదారుల మొత్తపు ఆదాయం 2.7 రెట్లు అధికం అయింది. ఒక్కొక్క వ్యవసాయదారుకు లభించిన భాగం 4.5 రెట్లకు హెచ్చింది.

ఎలిమెంటరీ పాఠశాలలలోను, సెకండరీ పాఠశాలలలోను,చదువుకొనే విద్యార్థులసంఖ్య 2 కోట్ల 13 లక్షలనుంచి 2 కోట్ల 94 లక్షలకు పెరిగింది. కాలేజి విద్యార్థుల సంఖ్య 5,50,000 లకు పెరిగింది. ఇతర శాఖలలోకూడా యిదేవిధంగా వైజ్ఞానికాభివృద్ధి హెచ్చుతోంది.

### సోషలిజం నుండి కమ్యూనిజం వైపుకి

రెండవ పంచవర్ష ప్రణాళిక జయప్రదము కావడం మూలంగా, సోషలిస్టు సమాజస్థాపన మూలంగా, సోవియట్ యూనియన్‌లో నేడొక కొత్తదశ ప్రారంభమయింది. సోషలిస్టు సమాజాన్ని ఇంకా పూర్తిగా వర్గరహిత మొనర్చవలసి యుంది. సోషలిజంనుండి కమ్యూనిజం వైపుకు పరిణామ మొందవలసియున్నది. నేటి

యీ నూతనదశలో ప్రజాసామాన్యానికి కమ్యూనిస్టు విద్య యివ్వవలసియుంది. మానవుని స్వభావంలో నేటికీ మిగిలియున్న కొన్ని పెట్టుబడిదారీచిహ్నాలనురూపుమాపవలసియుంది. ఈకర్తవ్యాన్ని నెరవేర్చడంలో మనకెన్నో చిక్కులు ఉన్నాయి. మన చుట్టూఉన్న పెట్టుబడిదారీ దేశాలు మనయెడల శతృత్వం వహించి యున్నాయి. మొదటి రెండు పంచవర్ష ప్రణాళికలు జయప్రదంగా నెరవేరినప్పటికీ, మన పరిశ్రమలు విపరీత వేగంతో వృద్ధిచెందుతూన్నప్పటికీ, యంత్రశక్తి విషయంలో ప్రపంచానికి అగ్రస్థానం వహించిన పెట్టుబడిదారీ దేశాలను సహితం మనం మించియున్నప్పటికీ, కొన్ని ఆర్థిక విషయాలలో మనం ఇతర పెట్టుబడిదారీ దేశాలకంటె వెనుకబడి ఉన్నాం.

## సోవియట్ యూనియను — పెట్టుబడిదారీ ప్రపంచం.

ఆర్థికాభివృద్ధియొక్క వేగం విషయంలో సోవియట్ యూనియన్ ప్రపంచమంతటికీ అగ్రస్థానం వహిస్తూంది. 1929 లో సంభవించిన ప్రపంచ ఆర్థిక క్షోభఫలితంగా 1937 లో పెట్టుబడిదారీ దేశాల పరిశ్రమలు 100 కి 103.5 చొప్పున మాత్రమే అభివృద్ధి పొందినవి. సోవియట్ యూనియన్‌లో మాత్రం పెద్దపరిశ్రమలు చిన్న పరిశ్రమలు కలసి 100 కి 371 చొప్పునను, ప్రత్యేకంగా పెద్ద పరిశ్రమలు 100 కి 428 చొప్పునను, అభివృద్ధి చెందినవి. 1937లో కంటె 1938 లో తిరిగి 100 కి 11 చొప్పున పారిశ్రామికోత్పత్తి వృద్ధి చెందినది. అనగా 1929 తో పోల్చిచూస్తే, మొత్తం పారిశ్రామికోత్పత్తి 100 కి 412 చొప్పున, పెద్ద పరిశ్రమల ఉత్పత్తి 100 కి 477 చొప్పున, వృద్ధి చెందినవి. పెట్టుబడిదారీ దేశాలలోనో? 1938లో తొలి సంవత్సరం కంటె పారిశ్రామికోత్పత్తి 100 కి 13.5 చొప్పున క్షీణించింది. 1929 తో పోల్చిచూస్తే, 100 కి 91 చొప్పున తగ్గిపోయింది.

కాని,విప్లవానికి పూర్వం ఆర్థికంగామనదేశం ఇతర దేశాలకంటె వెనుకబడి యుండడంవల్ల, మనజనసంఖ్యలో ఒక్కొక్కవ్యక్తి అనుభవించే సరకు యితర దేశాలకంటె తక్కువ అని చెప్పవలసివస్తుంది. అమెరికా, ఇంగ్లండు, జర్మనీ, ఫ్రాంసువంటి దేశాలకంటె మనదేశములో ఒక్కొక్క వ్యక్తి అనుభవించే పారిశ్రామిక సరకులు తక్కువగా ఉంటాయను విషయం జగద్విదితము. ఉదాహరణ: రెండవ పంచవర్ష ప్రణాళిక పూర్తి అయిన సంవత్సరములో, ఒక్కొక్క సోవియటు వ్యక్తికి లభించిన విద్యుచ్ఛక్తి ఫ్రాన్సు దేశంలో కంటె సగం తక్కువ. ఇంగ్లండులోకంటె 3 రెట్లు తక్కువ జర్మనీలో కంటె $3\frac{1}{2}$ రెట్లు తక్కువ. అమెరికాలో కంటె $5\frac{1}{2}$ రెట్లు తక్కువ. ఇనుము విషయంలో కూడా ఇంతే. ఇంగ్లండు-ఫ్రాన్సు దేశాలలో కంటె సగమును జర్మనీలో కంటె $2\frac{1}{2}$ రెట్లును, అమెరికాలో కంటె 3 రెట్లును, తక్కువ వినియోగించబడుతోంది. ఉక్కు విషయంలో ఫ్రాంసుకంటె 2 రెట్లును, ఇంగ్లండు జర్మనీలలో కంటె 3 రెట్లును, అమెరికాలో కంటె 4 రెట్లును, తక్కువ వాడుకవుతోఉంది. రాక్షసిబొగ్గు కూడా ఫ్రాన్సు — అమెరికా — ఇంగ్లండు— జర్మనీలలో కంటె ఒక్కొక్క వ్యక్తి తక్కువగా వాడుచున్నారు. బట్టలు, సబ్బులు, కాగితం మొదలైన పరిశ్రమల విషయంలోకూడా సోవియట్ యూనియన్ వెనుకబడి యుంది.

నేడు సోవియట్‌యూనియన్‌లో సోషలిస్టు ప్రభుత్వం ఉండడంవల్ల యంత్రోత్పత్తి విషయంలో పరిపూర్ణత్వమునుపొందియున్నాము. పరిశ్రమలలోను—వ్యవసాయంలోను, ఉత్పత్తికి అవసరమైన యంత్రశక్తి వగైరాలలో పెట్టుబడిదారీ దేశాలను తలదన్నుతోంది. ఇప్పుడు మనల నెదుర్కొంటూన్న సమస్య ఒక్కటే. ఆర్థికంగా కూడా మనం అభివృద్ధిపొందిన పెట్టుబడిదారీ దేశాలను మించిపోవాలి. దీనికి తక్షణం పూనుకొనవలసి యుంది.

దీని అర్థం, మన ఆర్థిక నిర్మాణంలోని ప్రతి శాఖయొక్క యంత్రశక్తిని చాలావరకు యెక్కువ చేయాలన్న మాట. యంత్రాల ఉత్పత్తి, పరిశ్రమలు యెక్కువ కావాలన్న మాట. ఉత్పత్తియొక్క నిర్మాణం పూర్వం కంటె అభివృద్ధి కావాలన్నమాట. శాస్త్ర పరిశోధనలు, క్రొత్త సాధనాలు, విరివిగా ఉపయోగించాలన్నమాట. ప్రతి కార్మికునియొక్క ఉత్పాదకశక్తి అన్ని శాఖలలోను అభివృద్ధి అయ్యేలాగ సోషలిస్టు పోటీపై ఆధారపడిన స్టాఖనోవ్ ఉద్యమాన్ని ప్రోత్సాహ పరచాలన్న మాట.

ఇది సాధ్యం కావాలంటె జాతీయ సంపద వృద్ధి పొందాలి. ప్రజల వినిమయశక్తి రెట్టింపు యెక్కువకావాలి. దీనికి పెద్ద పరిశ్రమలలో తయారయేసరకులే కాకుండా, ప్రజాసామాన్యానికి కావలసిన వస్తు సముదాయాన్ని ఉత్పత్తి చేసే చిన్న పరిశ్రమలు కూడా వృద్ధి చెందాలి. దీనితోబాటు కార్మికులయొక్క, నెల జీతగాళ్ళ యొక్క జీతాలు యెక్కువ కావాలి. సమిష్టి వ్యవసాయదారుల ఆదాయం వృద్ధిపొందాలి.

మూడవ పంచవర్ష ప్రణాళికలో నెరవేర్చవలసిన పై విధుల కనుగుణ్యంగా, పట్టణాలలోను, పల్లెలలోనూ నివసించే ప్రజల విజ్ఞానంకూడ వృద్ధిచెందాలి. కార్మికవర్గంయొక్క విజ్ఞానం, నైపుణ్యం పెద్దపెద్ద ఇంజనీర్లతో సరిసమానమైన దశకు రావాలి.

సోవియట్ యూనియన్ చుట్టూ ఉన్న సామ్రాజ్యవాద దేశాల దాడినుండి రక్షించుకోడానికి, మన ఆర్థికవిధానానికి ఎట్టి ఆటంకమూ కలుగకుండా అభివృద్ధి పొందడానికి, మన ఉత్పత్తి శక్తుల్ని ప్రభుత్వం రిజర్వు చేయవలసి యుంటుంది. బొగ్గు పరిశ్రమ, విద్యుచ్ఛక్తి, ఆయుధ పరిశ్రమలో కొన్ని శాఖలు, రాకపోక మార్గాలు మొదలైన వాటిలో ఇట్టి పద్ధతి చాలా అవసరం.

సోవియట్ యూనియన్‌యొక్క ఆర్థికాభివృద్ధికి మూడవ పంచవర్ష ప్రణాళికలో చేయబడిన ఈక్రింది సిఫార్సులు కమ్యూనిస్టు పార్టీయొక్క కేంద్రకమిటీ చేతను, సోవియట్ యూనియన్‌యొక్క కవున్సిల్ ఆఫ్ పీపుల్సు కమిస్సార్స్‌చేతను, అంగీకరించబడి, కమ్యూనిస్టు పార్టీయొక్క ఈ 18 వ సమావేశంలో ఆమోదించబడెను.

## మూడవ పంచవర్ష ప్రణాళిక.

1942 వ సంవత్సరంనాటికి అనగా మూడవ పంచవర్ష ప్రణాళిక పూర్తి అయ్యేసరికి సోవియట్ యూనియన్ పరిశ్రమలలో తయారైన సరకుల విలువ 180 మిలియార్డు రూబుల్సు వుండాలి. 1937 లో 95.5 మిలియార్డు రూబుల్సుమాత్రమే. అంటే, 100 కి 88 చొప్పున హెచ్చు కావాలన్నమాట. మొత్తం పారిశ్రామికోత్పత్తి సంవత్సరానికి సగటున 100 కి 13.5 రేటుచొప్పున వృద్ధికావాలి.

ఈక్రింది ప్రధాన పరిశ్రమలలో ఎంతెంత అభివృద్ధికావాలో మూడవ పంచవర్ష ప్రణాళిక నియమిస్తోంది.

| | 1942 | 1937 కంటె 100 కి ఎంత అభివృద్ధి? |
|---|---|---|
| పరిశ్రమలన్నీ (మిలియార్డు రూబుల్సు) | 180 | 188 |
| వీటిలో ఉత్పత్తిసాధనాలు | 112 | 203 |
| వినిమయ పదార్థాలు | 68 | 169 |
| యంత్రోత్పత్తి పరిశ్రమ, ఇంజనీరింగు | 62 | 225 |
| మెయిన్‌లైన్ రైలింజన్‌లు (సంఖ్య) | 2090 | 132 |
| గుడ్సు ట్రక్కులు (వేల సంఖ్యలో) | 90 | 183 |
| మోటారుకార్లు (వేల సంఖ్యలో) | 400 | 200 |
| విద్యుచ్ఛక్తి (మిలియార్డ్ల కిలోవాట్లు) | 75 | 206 |
| బొగ్గు (మిలియన్ల టన్నులు) | 230 | 181 |
| పెట్రోలు మొదలైననూనెలు (మిలియన్ల టన్నులు) | 54 | 177 |
| పీట్.... | 49 | 206 |
| పిగ్ ఆయిరన్ లేక ఇనుము | 22 | 152 |
| ఉక్కు.... | $27\frac{1}{2}$ | 156 |
| మిల్లు పరికరములు.... | 21 | 162 |
| రసాయన పరిశ్రమ (మిలియార్డు రూబుల్సు) | 13 | 227 |
| సిమెంటు (మిలియన్ల టన్నులు) | 10 | 183 |
| కలపరవాణా (మిలియన్ల క్యూబిక్ మీటర్లు) | 200 | 180 |
| కాగితము (వేల టన్నులు) | 1300 | 156 |
| నూలుబట్టలు (మిలియన్ల మీటర్లు) | 4900 | 142 |
| ఉన్నిబట్టలు | 175 | 167 |
| తోలుచెప్పులు (మిలియన్ల జతలు) | 235 | 143 |
| సన్నని పంచదార (వేల టన్నులు) | 3500 | 144 |
| డబ్బాలలో ఎగుమతిచేసే పదార్థాలు (మిలియన్ల డబ్బాలు) | 1800 | 206 |

### ఉత్పత్తి సాధనాలు.

యంత్రాలు మొదలైన ఉత్పత్తి సాధనాలు ఎక్కువగా ఉపయోగించబడితే, ప్రభుత్వానికి కావలసిన అవసరాల కనుగుణ్యంగా అన్ని శాఖలలోను ఆధునిక యంత్రశక్తిని ప్రవేశపెట్టి దేశ రక్షణకు తోడ్పడవచ్చును. కనుకనే మూడవ పంచవర్ష ప్రణాళికప్రకారం, యంత్రాల ఉత్పత్తి 1937 కంటె $2\frac{1}{4}$ రెట్లు అధికం చేయబడుతుంది. ఒక్కొక్క యంత్రానికి సాధనాలు, ముఖ్యంగా ఆటోమేటిక్ సాధనాలు, సప్లయి కావాలి. ఆవిరిశక్తితో నడిచే స్టీంటర్బెయిన్‌లు 4.8 రెట్లు అధికంగా తయారు కావాలి. స్టీంబాయిలర్లు 4.6 రెట్లు అధికంగా తయారవాలి.

రైల్వే ఇంజన్లు, ఓడలను నడిపే డీసెల్ ఇంజన్లు, గ్యాస్ మోటార్లు, వీటి ఉత్పత్తి కూడా విశేషంగా అభివృద్ధిచెందాలి. రసాయన పరిశ్రమకు కావలసిన యంత్ర సామగ్రి యావత్తూ అధికంగా తయారు కావాలి. నూలు బట్టల పరిశ్రమకు, ఉన్ని బట్టల పరిశ్రమకు కావలసిన ఆధునిక యంత్రసామగ్రికూడా నిశేషంగా తయారుచేయాలి. నదులలోను, సముద్రంలోను ప్రయాణ సౌకర్యాలకుగాను క్రొత్తరకపు ఓడలు, ఆ ఓడల్ని తయారుచేసే కర్మాగారాలుకూడా వృద్ధి చెందాలి.

### బొగ్గు - పెట్రోలు.

దేశం యొక్క ఆర్థిక జీవనానికి ఆయువుపట్టయిన బొగ్గు పరిశ్రమను, పెట్రోలు పరిశ్రమను అన్ని విషయాలలో వృద్ధి చేయాలి. బొగ్గు మనదేశంయొక్క అవసారలను తీర్చడానికి మాత్రమే కాకుండా, ప్రభుత్వంచే నిలువ చేయబడటానికి కూడా విరివిగా ఉత్పత్తికావాలి. బొగ్గు గనులకు ప్రధాన స్థానాలయిన ఊరల్ పర్వతాలలో 2.8 రెట్లు, మాస్కో సమీపంలో 2.4 రెట్లు తూర్పు దిశను 2.5 రెట్లు, మధ్య ఆసియాలో 4.4 రెట్లు చొప్పున బొగ్గు ఉత్పత్తి చేయబడాలి. స్థానిక ఫ్యాక్టరీలకు, కార్మాగాలకు కావలసిన బొగ్గు సప్లయి దూరప్రదేశాలనుంచి కాకుండా చుట్టు ప్రక్క ప్రదేశాలనుంచి సప్లయి కావడానికి ప్రతీ చిన్న బొగ్గుగనినీ యెక్కువగా అభివృద్ధిపరచడానికి క్రొత్త యంత్రాలు, క్రొత్త పరికరాలు స్థాపించాలి.

"రెండవ బాకూ" అన తగిన ఒక క్రొత్త పెట్రోలు ప్రదేశాన్ని వోల్గానదికి ఊరల్ పర్వతాలకు మధ్య తవ్వవలసియున్నది. పెట్రోలు ఉత్పత్తి విరివిగా సాగాలంటే, భూ గర్భశాస్త్రంలో ఎన్నో పరిశోధనలు చేయాలి. రోటరీ బోరింగు పద్ధతి, వత్తిడితో నూతులు త్రవ్వే పద్ధతి కంప్రెసర్లయొక్క గొట్టాలయొక్క సహాయంతో నూనెను సంపాదించే పద్ధతి, గ్యాస్ నుండి పెట్రోలు తయారుచేయుపద్ధతి, ఇవన్నీ విరివిగా ఆచరణలో పెట్టవలసి యుంటుంది.

బొగ్గుతో గ్యాస్ తయారుచేసే పద్ధతులు కనిపెట్టాలి. గనులలో బొగ్గును గ్యాసుగా మార్చి ఉపయోగించాలి మూడవ పంచవర్ష ప్రణాళిక ప్రకారం, పెట్రోలుతో గ్యాస్ తయారుచేసే పరిశ్రమని 3.5 రెట్లు యెక్కువ చేయవలసియున్నది. ఈ విధముగా ఉత్పత్తిఅయ్యే గ్యాస్ యంత్రాలను నడపడానికి, రసాయన పరిశ్రమకు ఉపయోగపడుతుంది. డోనెట్జు పరిసరాలలోను, మాస్కో చుట్టు ప్రక్కలను, తూర్పు దిశను కర్మాగారాలను నిర్మించి గ్యాస్ తయారుచేయడానికి అంచనా వేయబడింది.

### విద్యుచ్ఛక్తి

నేడు మన పరిశ్రమల అభివృద్ధితోబాటు ఆ పరిశ్రమలకు సప్లయి అయే విద్యుచ్ఛక్తి చాలకపోవడం సంభవిస్తోంది. ఇకముందు పవర్ స్టేషనులలో వుత్పత్తిఅయ్యే విద్యుచ్ఛక్తి పరిశ్రమల కన్నింటికీ సరిపోవడమే కాకుండా నిలువ చేయడానికి కూడా ప్రభుత్వం పూనుకుంటుంది. 1942 నాటికి దేశంయొక్క విద్యుచ్ఛక్తి రెండు రెట్లు వృద్ధికావాలి. పెద్ద పెద్ద పవర్ స్టేషన్‌లకే ప్రాధాన్యత నిచ్చి చిన్న స్టేషన్‌లను మధ్యరకపు స్టేషన్లను నిర్లక్ష్యంతో చూడే విధానం పోవాలి. ఇట్టి వైఖరి దేశంయొక్క ఆర్థిక జీవనానికి భంగకరం.

### రసాయన పరిశ్రమ.

మన రసాయన పరిశ్రమను ఒక ప్రధాన పరిశ్రమగా మార్చవలసియుంది. దేశంయొక్క



అవసరాలన్నింటినీ, దేశ రక్షణనూ, ఇది పూర్తిగా సంతృప్తి పరచేటట్లుఉండాలి. మూడవ పంచవర్ష ప్రణాళిక రసాయనశాస్త్రం యొక్క పంచవర్ష ప్రణాళికఅని చెప్పవచ్చు. ఈపరిశ్రమ ద్వారా ఉత్పత్తి అయ్యేసరకు 2.3 రెట్లు ఎక్కువ కావాలని అంచనా వేయబడింది. అంటే, మొత్తం పరిశ్రమలన్నింటి అభివృద్ధి కంటె దీని అభివృద్ధి యెక్కువప్రధానంగా పరిగణించబడింది. నైట్రోసల్ఫోనిక్ ద్రావకం, సింథెటిక్ ఎమోనియా, ఆర్టిఫిషల్‌నార, వీటి ఉత్పత్తి చాలా యెక్కువకావాలి. రసాయన పరిశ్రమయొక్క అన్ని శాఖలలోను యంత్రశక్తిని, కొత్త పరిశోధనలనూ, విరివిగా ఉపయోగించాలి. ఆటోమేటిక్ ద్ధతులతో ఉత్పత్తి చేయడాన్ని అభివృద్ధి పరచాలి.

### ఉక్కు పరిశ్రమ.

ఇతర పరిశ్రమలు ఉక్కు పరిశ్రమ యొక్క అభివృద్ధిపైననే ఆధారపడి ఉంటాయి. దేశంయొక్క ఆర్థిక జీవనం చాలావరకు దీనిపైననే అధారపడి ఉంటుంది. కనుక దీనికి ప్రత్యేకశ్రద్ధ ఇవ్వవలసి యుంటుంది. ఉత్పత్తి చేసే శక్తిని, ఉత్పత్తిని, హెచ్చుచేయాలి. ఉన్నత తరగతికి చెందిన రోలింగ్ మిల్లు సామాను రెట్టింపుకు హెచ్చుచేయాలి. హైగ్రేడ్ ఉక్కు సామానులను కూడ పూర్వం కంటె హెచ్చుగా తయారు చేయాలి. ఏ పరిశ్రమకు కావలసిన యంత్రసామగ్రి అక్కడే, సమీపములో ఉత్పత్తిచేయబడాలి. తూర్పు ప్రాంతాలలో కొత్త ఉక్కు సరిశ్రమ కేంద్రాన్ని స్థాపించవలసి యుంది.

### ప్రజలచే ప్రత్యక్షంగా అనుభవించబడు సరకుల ఉత్పత్తి.

ఇట్టి సరకుల ఉత్పత్తి 1937 లో కంటె 1942 లో 1.7 రెట్లు వృద్ధికావాలని ఈ సమావేశం తీర్మానించుచున్నది. చిన్న పరిశ్రమలలో ముడిసరకులు సాధ్యమైనంత హెచ్చుగా ఉపయోగించబడాలి. అప్పుడే సరకుల ఉత్పత్తి హెచ్చుతుంది. రకరకముల సరకులు, నాణ్యమైనవి, అప్పుడే ఉత్పత్తికాగలవు. ముడిసరకులు కూడ విరివిగా సప్లయి చేయబడేటట్లు జాగ్రత్తపడాలి. ప్రిపరేటరీ డిపార్టుమెంట్లకు స్పిన్నింగ్ డిపార్టుమెంట్లకు మధ్యగల అంతర్యాన్ని, నేత మిల్లులకు వెనుకబడియున్న స్పిన్నింగ్ మిల్లులకు మధ్యగల అంతర్యాన్ని, నిర్మూలించాలి. నూలు పరిశ్రమలో యంత్రశక్తిని పూర్తిగా వినియోగించాలి. వేగంగా పనిచేయు సింగిల్ ప్రోసెస్ యంత్రాలు, ఆటోమేటిక్ మరమగ్గాలు, మొదలైనవి ఉపయోగంలోనికి తీసుకురావలి.

### కార్మికుని ఉత్పాదక శక్తి

పైవిధంగా పారిశ్రామికోత్పత్తి యొక్క అభివృద్ధి నిర్ణీత ప్రణాళిక ప్రకారం నెరవేరాలంటే, కొత్తయంత్రాలు — కొత్త పరిశోధనలు ఉపయోగంలోకి తీసుకురావాలంటే, కార్మికుని ఉత్పాదకశక్తి (Productivity of labour) వృద్ధికావాలి. ఉత్పత్తి ఖర్చులు తగ్గాలి. ఇవి నెరవేరడానికి యీ సమావేశము యీక్రింది కార్యక్రమాన్ని ఆచరణలో పెట్టాలని తీర్మానించుచున్నది. మూడవ పంచవర్ష ప్రణాళికలో, అనగా 1942 వ సంవత్సరం పూర్తి అయేసరికి, కార్మికుని ఉత్పాదకశక్తి 100 కి 65 చొప్పున పరిశ్రమలలో వృద్ధికావాలి, అప్పుడు 6.2 మిలియార్డు రూబుల్సు విలువగల పారిశ్రామిక సరకులు ఉత్పత్తి కాగలవు. 100 కి 11 చొప్పున ఉత్పత్తి ఖర్చులను తగ్గించాలి. అప్పుడు అనగా 5 సంవత్సరాల అనంతరం, 1937 లో కంటె 21 మిలియార్డు రూబుల్సు ఖర్చు తగ్గుతుంది. ఇంతేగాక యీ 5 సంవత్సరాలలో ప్రతి సరకుయొక్క నాణ్యము హెచ్చేటట్లు తీవ్రకృషి చేయాలి. ముడిసరకులు, నూనె, విద్యుచ్ఛక్తి వీటిని సాధ్యమైనంత తక్కువగా ఉపయోగించాలి.

### వ్యవసాయం.

సోవియట్ యూనియన్ యొక్క వ్యవసాయ పరిశ్రమ యీ క్రింది విధంగా అభివృద్ధి పొందాలని 18 వ పార్టీ కాంగ్రెసు తీర్మానించుచున్నది. వ్యవసాయోత్పత్తియొక్క విలువ 19.8 మిలియార్డు రూబుల్సు (1937) నుండి 30.2 మిలియార్డు రూబుల్సు (1942) కు హెచ్చుచేయబడాలి. అనగా 100 కి 53 చొ॥న వృద్ధిపొందాలి.

రెండవ పంచవర్ష ప్రణాళికలో, సంవత్సరానికి సగటున $5\frac{1}{2}$ మిలియార్డు పూడ్‌ల చొప్పున కాయధాన్యాలు పండేవి క్రొత్త ప్రణాళిక ప్రకారం 7 మిలియార్డు పూడ్‌లు పండాలి. అనగా 100 కి 27 చొప్పున అభివృద్ధి. బీట్ పంచదార, హెక్టేరు 1కి 250 హండ్రడ్ వెయిట్లు చొప్పున 300 మిలియన్ల హండ్రడ్ వెయిట్లును; ముడిపత్తి హెక్టేరు 1కి 19 హండ్రడ్ వెయిట్ల చొప్పున 32.9 మిలియన్ల హండ్రడ్ వెయిట్లును; ఉత్పత్తి కావలసియుంది. పశుసంపదకూడా మూడవ పంచవర్ష ప్రణాళికలో ఎక్కువగా అభివృద్ధి చెందాలి. సోవియట్ యూనియన్‌యొక్క పశుసంపద సమస్య పూర్తిగా పరిష్కరించబడాలి. గుఱ్ఱముల సంఖ్య 100 కి 35 చొప్పున; ఆవులు, ఎద్దులు, బఱ్ఱెలు, వీటి సంఖ్య 100 కి 44 చొ॥న పందుల సంఖ్య 100 కి 100 చొప్పున; మేకలు,గొఱ్ఱెలు 100 కి 110 చొప్పున; హెచ్చు కావాలి.

ఎక్కువ పరిశ్రమలు గల మాస్కో, లెనిన్‌గ్రాడ్, బాకూ, ఖార్‌ఖోవ్, నగరాలకు చుట్టూను; కూస్ నెజ్, గోర్కీ మొదలైన పెద్దపెద్ద పట్టణాల చుట్టూను; బంగాళా దుంపలు కాయ కూరలు, పశు సంపద, యివి సమృద్ధిగా ఉండేటట్టు చూడాలి. అప్పుడే కార్మికుల కవసరమైన పాలు, వెన్న, మాంసం, కూరలు విరివిగా దొరుకుతాయి.

కాయ ధాన్యాలకు శ్రేష్ఠమైన విత్తనాలు యేరి పరీక్షించి, ఉపయోగించాలి. సమిష్టి వ్యవసాయ క్షేత్రాలలోను, ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాలలోను, శాస్త్రీయ పద్ధతుల ప్రకారం వేర్వేరుపంటలు, మార్పులు చేస్తూ, పండించేటట్లు చూడాలి. అప్పుడప్పుడు గడ్డిని పండించడమో, లేక ఏమీ పండించకుండా విడిచివేయడమో చేయాలి. అప్పుడే భూమి ఫలవంతమై యుంటుంది; ఎక్కువ పంట పండుతుంది పశువులకు ఆహారం విరివిగా సప్లయి అవుతుంది.

వ్యవసాయం యొక్క అన్ని శాఖలలోను యంత్రాలను ఎంత ఎక్కువగా ఉపయోగించడానికి వీలుంటుందో అంత ఎక్కువగా యీ 5 సంవత్సరాలలో ప్రవేశపెట్టాలి.

### సరకుల రవానా.

1942 లో దేశంయొక్క సరకుల రవానా రైల్వేల ద్వారా 355 మిలియార్డు టన్నుల (1937) నుండి 510 మిలియార్డు టన్నులకు హెచ్చుతుందని అంచనా వేయబడినది. నదులలో ప్రయాణంచేసే ఓడల ద్వారా 33 మిలియార్డుల టన్నుల నుండి 58 మిలియార్డుల టన్నులకు; సముద్రంమీద ప్రయాణం చేసే ఓడలద్వారా 37 మిలియార్డు టన్నుల నుండి 51 మిలియార్డు టన్నులకు హెచ్చుతుంది కనుక, యీ క్రింది విధంగా రవానా సౌకర్యాలు వృద్ధి చేయాలి:

6,640 క్రొత్త రైలు ఇంజన్లు, 1,78,000 గుడ్సు వేగన్లు, 12,000 ప్యాసింజరు పెట్టెలు, ఈ 5 సంవత్సరాలలో తయారుకావాలి. ఇప్పుడు ఉపయోగంలో ఉన్న 3,00,000 గుడ్సు వేగన్లకూ 4000 ప్యాసింజరు పెట్టెలకూ, ఆటోమేటిక్ కప్లింగులు పెట్టాలి. 2,00,000 గుడ్సు వేగన్లకు ఆటోమేటిక్ బ్రేక్‌లు పెట్టాలి. ఈ ఇంజన్లు, ఈ పెట్టెలు, రిపెయిర్ చేయబడటానికి అనేక క్రొత్త వర్కుషాపులు, ముఖ్యంగా ఊరల్ పర్వతాలలోను, మధ్య ఏషియాలోను, సైబీరియాలోను, తూర్పు రాష్ట్రాలలోను నిర్మించవలెను.

7 వేల మైళ్ళ పొడవుగల రైలుమార్గం, 5 వేలమైళ్ళు పొడవుగల డబుల్‌లైను మార్గం, అదనంగా వేయవలసి యుంటుంది. 1100 మైళ్లు పొడవుగల రైలుమార్గంమీద విద్యుచ్ఛక్తి సహాయంతో రైళ్ళను నడిపించాలి. ముఖ్యంగా పర్వతప్రాంతాలలోను, సరకులు విరివిగా ఎగుమతీ-దిగుమతి అయే ప్రాంతాలలోను, ఈవిద్యుచ్ఛక్తి రైళ్ళు ఎక్కువగా అవసరం.

ఎక్కువ విరివిగా ఎగుమతి చేయబడు కలప, కాయధాన్యాలు, రాక్షసిబొగ్గు, పెట్రోలు కిరసనాయిలు, మొదలైన సరకులు సాధ్యమైనంతవరకూ ఓడలమీద పంపడం సుళువు. కాబట్టిసముద్రంమీద,నదులమీద,ప్రయాణంచేసే ఓడలలో యంత్రశక్తిని ఇప్పటికంటె అధికంగా ఉపయోగించవలసి యుంటుంది. ఓడల మరమ్మతులకు ప్రత్యేక సౌకర్యాలు, సముద్రతీరాన్ని కొత్త హార్బర్లు, నిర్మించవలసి యుంటుంది. దేశంయొక్క మొత్తపు నీటి రహదారీలు 63 వేల మైళ్ళనుండి 72 వేలమైళ్ల పొడవుకు పెంచవలసి యున్నది.

దేశం అంతటా మోటారు రహదారీని కూడా వృద్ధిచేయాలి. ఈ 5 సంవత్సరాలలో మోటారు లారీలమీద తీసుకొనిపోబడే సరకు 4.6 రెట్లు యెక్కువకావాలి. 1,30,000 మైళ్ళ పొడవు గల కొత్త రోడ్లు నిర్మించాలి.

### విద్యావంతులైన కార్మికులు, టెక్నీషియన్లు, ఇంజనీర్లు.

మూడవ పంచవర్ష ప్రణాళిక ప్రకారం వస్తూత్పత్తి విరివిగా జరగాలంటే, విద్యావంతులైన కార్మికుల్నీ, టెక్నీషియన్లనీ, ఇంజనీర్లనీ, ఎక్కు తరిఫీదు చేయవలసి యుంటుంది. కార్మికుల్ని విద్యావంతులుగా చేయడానికీ, వారికి పారిశ్రామిక తరిఫీదు యివ్వడానికీ, దేశం అంతటా కొత్త విద్యాలయాలెన్నో యేర్పరచాలి. మొత్తం అన్ని శాఖలలోను $1\frac{1}{2}$ మిలియన్ల టెక్నీషియన్లకు ట్రెయినింగు యివ్వాలి. 6,00,000 మంది నిపుణులకు కాలేజి విద్య యివ్వాలి.

### నూతన నిర్మాణం.

ఉత్పత్తి అభివృద్ధికి ప్రణాళికతో సూచించబడ్డ అంచనాల కనుగుణ్యంగా, మన జాతీయ ఆర్థిక నిర్మాణానికి యీ క్రింది పెట్టుబడులు అవసర మవుతాయి. పరిశ్రమలకు, రాకపోక సౌకర్యాలకు, వ్యవసాయానికీ, ఇతరవాటికీ మొత్తం 180 మిలియార్డు రూబుల్సు ఖర్చుచేయాలి. రెండవ పంచవర్ష ప్రణాళికలో 115 మిలియార్డు రూబుల్సు మాత్రమే ఖర్చుచేయబడింది. పరిశ్రమలకు ప్రత్యేకంగా 103.9 మిలియార్డు రూబుల్సు ఖర్చుచేయాలి. రెండవ ప్రణాళిక ప్రకారం 58.6 మిలియార్డు రూబుల్సుమాత్రమే ఖర్చు పెట్టబడింది.

రాకపోక సౌకర్యాలకు రెండవ పంచవర్ష ప్రణాళికలో 20.7 మిలియార్డు రూబుల్సు ఖర్చు పెట్టబడగా మూడవ ప్రణాళికలో 35.8 మిలియార్డు రూబుల్సు (అనగా 100 కి 73 చొప్పున హెచ్చింది) ఖర్చు పెట్టబడాలి.

వ్యవసాయానికి మూడవ పంచవర్ష ప్రణాళికలో 10.6 మిలియార్డు రూబుల్సు ఖర్చు పెట్టబడాలి.

దేశంయొక్క పరిశ్రమలు సాధ్యమైనంతవరకు ముడిసరకులకూ, కొనుక్కొనే ప్రదేశాలకూ, సమీపంగా ఉండేటట్టుచూడాలి. ఎందువల్లనంటే, అప్పుడే వ్యర్థమైన రవానాలు లేకుండా పోతాయి. దేశంయొక్క వెనుకబడియున్న ప్రదేశాలకుకూడా లాభం ఉంటుంది. ఈ ప్రధాన సూత్రాన్ని ఆచరణలో పెట్టాలంటే, దేశం మొత్తంమీద ఆర్థికంగా ప్రాధాన్యత వహించిన ప్రదేశాలలో పూర్తియైన అభివృద్ధికి అవకాశం యివ్వాలి. పెట్రోలు, సిమెంటు, ప్లాస్టరు ఆఫ్ ప్యారిస్, ఎరువులు, గాజు, ప్రజల జీవితావసరాలు, యివి ఆ యా ప్రదేశాలకెంతెంత అవసరమో అంతా పూర్తిగా సప్లయి అయేటట్లు చూడాలి. పరిశ్రమలు ఎక్కువగా వ్యాపించిన జిల్లాలలో బొగ్గు వగైరాలను దూరప్రదేశాలనుండి తెప్పించుకోకుండా సమీపంలోనే దొరికేటట్లు చుట్టుప్రక్కల ఏర్పాట్లు గావించుకోవాలి. ఇదే విధంగా, ప్రజలందరికీ అవసరమైన బంగాళాదుంపలు, కూరగాయలు, నెయ్యి వెన్న, మాంసం, పిండి, మొదలైన ఆహార పదార్థాలు; బట్టలు, షర్టులు, కోట్లు, జోళ్లు వగైరా సామానులు స్థానికంగానే, ఏ జిల్లాకు ఆ జిల్లా, ఏ రాష్ట్రానికి ఆరాష్ట్రం, తయారు చేసుకోవాలి.

మాస్కో, లెనిన్‌గ్రాడ్, కీవ్, ఖర్‌ఖోవ్, రోస్టోవ్, గోర్కీ, స్వెర్‌డ్లోవ్‌స్క్, నగరాలలో క్రొత్త ఫ్యాక్టరీ లేవీ నిర్మించకూడదు. ఊరల్ పర్వత ప్రాంతాలలోను, వోల్గానదీతీరాన్ని యంత్రోత్పత్తి పరిశ్రమ, రసాయన పరిశ్రమ, పెట్రోలు పరిశ్రమ, ఎక్కువగా వృద్ధిచేయబడాలి. అందుకై ఒక్కొక్క శాఖలో అనేక ఫ్యాక్టరీలను నిర్మించాలి.

సోవియట్ యూనియన్‌యొక్క తూర్పుదిశను ఇనుము పరిశ్రమకు, ఉక్కు పరిశ్రమకు, ఎక్కువ ప్రాధాన్యత నివ్వాలి. నూతన పంచవర్ష ప్రణాళిక ప్రకారం స్థాపించబడే ఇనుము—ఉక్కు పరిశ్రమాలయాలలో ముప్పాతికవంతు తూర్పు దిశలోనే నిర్మించబడాలి. మధ్య ఆసియాలో సమృద్ధిగా దొరుకు పత్తిని వినియోగపరచుకోడానికి ఆప్రదేశంలో బట్టల మిల్లులు విరివిగా స్థాపించబడాలి.

మూడవ పంచవర్ష ప్రణాళికలో యీక్రింది వాటిపై ప్రభుత్వదృష్టి కేంద్రీకరించబడాలి అని యీ సమావేశం తీర్మానించుచున్నది. యంత్రాలను తయారు చేయడానికి కొత్త ఫ్యాక్టరీలు, ముఖ్యంగా ఇంజనీరింగ్ ఫ్యాక్టరీలు — విద్యుచ్ఛక్తిని తయారుచేసే యంత్రసామగ్రి కార్ఖానాలు, దేశంలో వృద్ధిచేయాలి. గోర్కీ, కీవ్, పట్టణాలలో స్థాపించబడిన ఇంజనీరింగ్ వర్కు

షాపుల్ని పూర్తిచేయాలి. గ్రైండింగ్ మెషీన్లు-కాగ్‌వీల్ కటింగ్ మెషీన్లు- లేత్‌సామాన్లు-రివాల్వర్ లేత్‌సామాన్లు-డ్రిల్లింగ్ మెషీన్లు-ఆటోమేటిక్ మెషీన్లు-ఫోర్జింగ్ ప్రెస్‌లు. వీటిని తయారుచేసే యంత్రాగారాలు నచ్చే 5 సంవత్సరాలలో ఎక్కువచేయాలి. గోర్కీ, మాస్కో, నగరాలలో కొత్తగా నిర్మించబడ్డ మోటార్ వర్కుసు పూర్తిచేయాలి. సైబీరియాలోను, తూర్పు ప్రాంతంలోను, మోటార్ లారీలను ఉత్పత్తి చేసే కార్ఖానాలు నిర్మించబడాలి. కర్నుకు ప్రాంతాలలో యంత్రపు కదుష్లు, పశ్చిమ సైబీరియాలో యంత్రపు మగ్గాలు, ఉత్పత్తి చేయటానికి కొత్త కార్ఖానాలు నిర్మించాలి.

క్యూబిషేవ్‌లో ఉన్న నీటిశక్తి యంత్రాగారాలు రెండింటినీ పూర్వం కంటె వృద్ధి చేయాలి. ఇంత పెద్ద యంత్రాగారాలు ప్రపంచములో ఎక్కడా లేవు. ట్రాన్సువోల్గా ప్రాంతములో ఉన్న బంజరు భూమికంతటికీ యివి నీటిని సప్లయి చేసి, సారవంతంగా చేస్తున్నాయి. ఓకా నదీ తీరాన్ని కలూగా ప్రాంతంలో క్రొత్త వాటర్ పవర్ స్టేషన్ ఒకటి నిర్మించబడాలి. అప్పర్ కామా నదీతీరాన్ని, ముంగేఖార్‌లోను కామెనో గోర్స్కు నదీ ముఖాన్ని కూడా క్రొత్త వాటర్ పవర్ వర్కుసు స్థాపించాలి.

ఇదేవిధంగా, ఊరల్ పర్వతాలలోను, బష్కేరియా, మధ్య ఏషియా, పశ్చిమ సైబీరియా, ట్రాన్సు బైకేలియా, ఖబరోవ్‌స్కు, ఉక్రెయిన్ కిరిఘిజ్, ప్రాంతాలలోను, క్రొత్త బొగ్గుగనుల త్రవ్వడం ప్రారంభించాలి.

15 మిలియన్ టన్నుల పెట్రోలు ఉత్పత్తి కావడానికి వోల్గానదికి, ఊరల్ పర్వతాలమధ్య ప్రదేశంలో బ్రహ్మాండమైన ఆయిల్ బేస్ ఒకదానిని నిర్మించవలసి యుంది. ఇవిగాక, వోల్గా-ఊరల్ మధ్య ప్రదేశంలోను, సైబీరియాలోను, తూర్పు రాష్ట్రాలలోను, ఉక్రెయిన్‌లోను, మధ్య ఆసియాలోను, ఎక్కడెక్కడ పెట్రోలు దొరుకుతుందో శాస్త్రీయ పరిశోధనలు గావించాలి.

ఇదే విధంగా ఉక్కు పరిశ్రమ, రాగి-అల్యూమినమ్-జింక్-టిన్ పరిశ్రమలు, సిమెంటు పరిశ్రమ, కలప పరిశ్రమ వృద్ధి కావడానికి సమస్తమైన ఏర్పాట్లు చేయవలసి యుంది.

రసాయన పరిశ్రమలో ఎరువుల ఉత్పత్తి స్థానాలు, సోడాఫ్యాక్టరీలు, సల్ఫ్యూరిక్ ఆసిడ్ ఫ్యాక్టరీలు, కొత్తవి నిర్మించాలి. కొత్త సింథెటిక్ రబ్బరు ఫ్యాక్టరీలు 13, కార్డ్ ఫ్యాక్టరీలు 7, మోటార్ టైర్ ఫ్యాక్టరీలు 14, దేశం అంతటా వ్యాపించి యుండేలాగు స్థాపించాలి. ఆర్టిఫిషల్ లిక్విడ్ ఫ్యూయల్ ఫ్యాక్టరీలు 2, న్యాచురల్ రబ్బర్ ఫ్యాక్టరీలు 6, పనికిరాని రబ్బరు ముక్కలను ఉపయోగించే ఫ్యాక్టరీలు కూడా కొత్తగా స్థాపించవలసి యుంటుంది.

ఆహారపదార్థాల విషయం: ఆర్‌సుక్, పంగిల్సు, ఇర్‌కుట్‌స్కు, ఖబరోవ్‌స్కు, స్వెర్డ్లొవ్‌స్కు, ఖసనోవ్, నార్ఓక్, కూయిబిషేవ్, వొరోషిలోవ్ గ్రాడ్, అస్ట్రాఖాన్, స్టాలినాబాద్, పట్టణాలలో స్థాపించబడిన మాంసపు ఫ్యాక్టరీలను; యులాన్‌ఉడే, పెట్రోకా, సోవియట్ స్కాయ, ఆల్మా అటా, నోవోట్రాయి ట్స్కో ఉన్న పంచదార ఫ్యాక్టరీలను యింకా వృద్ధి చేయాలి. కొత్తగా నూనెమిల్లులు, పాలడబ్బాలు తయారుచేసే యంత్రాలు, బిస్కట్లు-టీ-వగైరా పదార్థాలు సప్లయిచేసే పరిశ్రమాలయాలు కూడా ఏర్పాటుకావాలి. కోమోసోమోల్‌స్కు, ఖబరోవ్‌స్కు, మాస్కో ప్రాంతాలలోను, అమ్మా మొదలైన నదులలోను చేపల పరిశ్రమను ఎక్కువగా వృద్ధిచేయాలి.

వ్యవసాయానికి అవసరమైన ట్రాక్టర్లు వగైరా యంత్రసామగ్రిని తయారు చేయడానికి 1500 కొత్త ట్రాక్టర్ స్టేషన్లు నిర్మించాలి. బంజరుభూముల్ని సారవంతంగా చేయడానికి వాష్, కోల్‌ఖిస్, నెవినోమిస్కీ, ముర్గాబ్ ఒయేసిస్ ప్రదేశాలలో కొత్త ప్రాజెక్టులు కట్టడానికి, పాతవాటిని అభివృద్ధి పరచడానికి పూనుకోవలసి యుంది.

భౌతిక, వైజ్ఞానిక, సంపద.

నేడు మనం నెదుర్కొంటున్న సమస్య, ప్రజల నిరుద్యోగాన్ని పేదరికాన్ని నిర్మూలించడం కాదు. ఈ సమస్యలను మనం పూర్తిగా యిదివరకే పరిష్కరించగలిగాము. ఇప్పుడు మనం నెరవేర్చవలసినపని, సోవియటు ప్రజల క్రొత్త అవసరాలకు అనుగుణ్యంగా వారి భౌతిక - వైజ్ఞానిక సంపదను ఎక్కువచేయాలి, ప్రపంచంలో ఎక్కువ భాగ్యవంతమైన పెట్టుబడిదారీ దేశాలలో సాధ్యం కాని భౌతిక-వైజ్ఞానికాభివృద్ధి మనదేశంలో నేడు సాధ్యం అవుతూంది. జయప్రదంగా మనచే నిర్మించబడిన సోషలిస్టు సమాజమే ఇందుకు కారణం. కాబట్టి మూడవ పంచవర్ష ప్రణాళికలో యీ క్రింది కార్యక్రమాన్ని నెరవేర్చవలసినదిగా యీ సమావేశం తీర్మానించుచున్నది.

(1) కార్మికులు, కర్షకులు, ఆఫీసు ఉద్యోగస్థులు వీరి వినిమయ శక్తి $1\frac{1}{2}$ రెట్లు హెచ్చు కావడానికి జీతాలు ఎక్కువ చేయాలి.

(2) మన ఆర్థిక జీవనంయొక్క ప్రతిశాఖలోను కార్మికులయొక్క, ఆఫీసు ఉద్యోగులయొక్క సంఖ్య 1942 నాటికి 100 కి 17 పా॥ హెచ్చు కావాలి. వారి సగటు జీతాలు 100 కి 35 పా॥, మొత్తం జీతాల నిధి 100 కి 62 పా॥ వృద్ధిపొందాలి.

(3) పట్టణాలలోను, పల్లెలలోను, నివసించే కార్మిక ప్రజల వైజ్ఞానికాభివృద్ధికి, అనగా వారి సోషల్ ఇన్సూరెన్సుకు-విద్యకు-ఆరోగ్యానికి-తల్లుల, శిశువుల, రక్షణకు 30,800 మిలియన్ రూబుల్సు నుండి 58,000 మిలియన్ రూబుల్సు ఎక్కువ ఖర్చు పెట్టాలి.

(4) సమిష్టి వ్యవసాయ క్షేత్రాలలో పని చేసే ఉత్పాదక శక్తిని వృద్ధిచేయుట ద్వారా వారి ఆదాయాన్ని ఎక్కువ చేయాలి.

(5) సాధారణ కార్మికులు టెక్నీషియన్లుగా తయారవడానికి చక్కని తరిఫీదు యివ్వాలి.

(5) పట్టణాలలో ఎలిమెంటరీ విద్యార్థుల సంఖ్య, సెకండరీ విద్యార్థులసంఖ్య 86,00000 నుండి 1,24,00,000 కును; పల్లెటూళ్ళలో సెకండరీ విద్యార్థుల సంఖ్య 2,08,00,000 నుండి 2,77,00,000 కును; వృద్ధికావడానికి, అనగా పిల్లలందరికీ సర్వవ్యాపిత విద్య యివ్వడానికి ఆయా ప్రదేశ విద్యాలయాలను ఎక్కువ చేయాలి.

(6) విశ్వవిద్యాలయాలలోను, టెక్నికల్ కాలేజీలలోను, విద్య నభ్యసించువారి సంఖ్య 6,50,000 కు వృద్ధిచెందాలి.

(7) సినిమాలు, క్లబ్బులు, గ్రంథాలయాలు, పఠనమందిరాలు, విజ్ఞాన కేంద్రాలు, వీటి సంఖ్య యిప్పటికంటె ఎక్కువకావాలి. పెర్మనెంటు సినిమాల సంఖ్య 6 రెట్లు వృద్ధి పొందాలి.

(8) ప్రజాసామాన్యంయొక్క ఆరోగ్య రక్షణకు, చికిత్సాలయాలకు, శిశువుల చికిత్సాలయాలకు, గర్భిణీ స్త్రీల రక్షణకు, కార్మికుల విశ్రాంతి-ఆటపాటలకు, సదుపాయాలు ఇప్పటి కంటె ఎక్కువ చేయాలి. ప్రజల ఆరోగ్య రక్షణకు ఖర్చు 10,300 రూబుల్సు నుండి 16,500 రూబుల్సు హెచ్చుకావాలి. నర్సరీలలోను, కిండర్ గార్డెన్‌లలోను, ఉండే మంచాల సంఖ్య 18,00,000 నుండి 42,00,000 కు వృద్ధిచెందాలి.

(9) 35 మిలియన్ స్క్వేర్‌మీటర్ల కొత్త నివేశన స్థలాలలో కార్మికులకు, పారిశ్రామికోద్యోగులకు, కొత్త యిండ్లు నిర్మించబడాలి.

ముగింపు.

మూడవ పంచవర్ష ప్రణాళికలో పైన పేర్కొనబడిన కార్యక్రమమంతా నెరవేర్చడం అంటే అర్థం కార్మికులయొక్క — కర్షకుల యొక్క — సోవియట్ విద్యాధికుల యొక్క హక్కులు కాపాడటం అన్నమాట. ఈ కార్య నిర్వహణ కమ్యూనిస్టు పార్టీకి చెందిన మన పైనను, పార్టీలో సభ్యులుకాని బోల్షివిక్ నాయకులపైనను ప్రధానంగా ఆధారపడి యుంటుంది. ముఖ్యంగా కార్మికులలో సంఘటన శక్తి కమ్యూనిస్టువిద్య ఎక్కువగా పెంపొందడానికి మనపార్టీ సభ్యులు తీవ్రమైన కృషి చేయవలసి యుంటుంది. నాయకులు మొదలు సాధారణ కార్మికులవరకు, ఆఫీసు ఉద్యోగులు, సమిష్టి వ్యవసాయదారులు, అందరూ తమ తమ కర్తవ్యాలను మనస్ఫూర్తిగా నెరవేర్చవలసియుంది; కష్టపడి పనిచేయవలసి యుంది; వెనుకబడ్డ వారికి సహాయపడవలసి యుంది. అప్పుడే మన మూడవ పంచవర్ష ప్రణాళిక దిగ్విజయంగా నెరవేరుతుంది. అప్పుడే సోవియట్ యూనియన్ సోషలిజం నుండి కమ్యూనిజంను చేరగలుగుతుంది. నేడు సోవియట్ యూనియన్‌లో సోషలిస్టు సమాజ నిర్మాణం పూర్తిఅయింది. అన్ని శాఖలలోను ఆర్థికంగాను, రాజకీయంగాను, అధికారం మన స్వాధీనంలోనే ఉంది. ఉత్పత్తి విధానంయొక్క మర్మాలు తెలుసుకొన్నవారే ప్రతి విషయాన్ని నిర్ణయిస్తున్నారు. విజ్ఞాన సంపదను వృద్ధిచేయ పూనుకొన్నవారే మన సమాజంలో అన్ని సమస్యలనూ పరిష్కరించగలుగు తున్నారు. వీరే ప్రజలందరికీ నాయకత్వం వహించి, కమ్యూనిస్టు సమాజ నిర్మాణానికి దారితీస్తున్నారు.

పెట్టుబడిదారీ దేశాలలో సమాజం అంతకంతకు ఆర్థిక క్షోభవల్ల చిందరవందర అయిపోతోంది. నిరుద్యోగుల సంఖ్య నానాటికీ హెచ్చుతోంది. ప్రజాసామాన్యంలో బీదతనం, నిరాశ ఎక్కువౌతున్నాయి కారణం :_కార్మికులంతా పెట్టుబడిదార్ల బానిసలే. ఫేసిస్టు ప్రభుత్వాలు రక్తపుటేరులు ప్రవహింపజేసి, తమ సరిహద్దుల బయట, ఇతర దేశాల స్వాతంత్ర్యాన్ని అపహరిస్తున్నాయి. ఈ అన్య దేశాక్రమణ యిదివరకే రెండవ సామ్రాజ్యవాద యుద్ధానికి దారి తీసింది. (మొదటిది : 1914-18). ఐరోపా - ఆసియాఖండాలలో ఎన్నో దేశాలు యీ సామ్రాజ్యవాద యుద్ధంలో బలి కావలసి వచ్చింది. ఈ చిహ్నాలన్నీ ప్రపంచ ఆర్థిక క్షోభ ఏ విధంగా విపరీత రూపాన్ని దాల్చుతుందో తెలియజేస్తాయి. పెట్టుబడిదారీ విధానం ఏ విధంగా క్రుళ్లిపోతున్నదో చూపెట్టురాయి. దాని అంతిమ దశ దగ్గరకు వచ్చిందని స్పష్టం చేస్తాయి ఈ పరిస్థితులలో మొట్టమొదటి సోషలిస్టు సమాజ నిర్మాతలమైన మన కర్తవ్యాలు ఎక్కువ బాధ్యతతో కూడుకొని ఉన్నాయి. ఇదివరకే మన సమాజం ఆర్థికంగాను, రాజకీయంగాను, తన కాళ్ళపై తాను నిలబడగలిగి యుంది; జయంతోబాటు ఆత్మ విశ్వాసం, శక్తి బాగా ఎక్కువయాయి. ప్రపంచంయొక్క అన్నిదేశాల శ్రామికులు తమ విముక్తి సమీపించుచున్నదను ఆశతో ఉద్విగ్నులు తున్నారు. వారిలో ఆత్మ విశ్వాసం ఉప్పొంగుతూంది. మూడవ పంచవర్ష ప్రణాళిక జయప్రదంగా నెరవేరితే, కమ్యూనిజంయొక్క శక్తి, ప్రభావం ఎంత ఎక్కువో ప్రపంచానికి నిరూపించ గల్గుతాం.

బోల్షివిక్కులందరూ, కమ్యూనిస్టు సమాజ నిర్మాణానికి పూనుకొన్నవారందరూ, కార్మికుల్ని సమిష్టి వ్యవసాయపు రైతుల్ని విద్యాధికుల్ని కమ్యూనిస్టుపార్టీ నాయకత్వం క్రిందికి తీసుకువచ్చి-మూడవ పంచవర్ష ప్రణాళిక జయప్రదమయ్యేటట్లు చూడాలి.

పంచవర్ష ప్రణాళికను జయప్రదముగా నెరవేర్చిన కార్మికులు.



# మరో సామ్రాజ్యవాద యుద్ధం ప్రారంభమయింది!

## ప్రపంచాన్ని మరొక నూతన ఆర్థికక్షోభ చుట్టి వేస్తోంది

## సోవియట్ శాంతిని కోరుతుంది: దాని జోలికివస్తే ఖబడ్దార్

[సోవియట్ కమ్యూనిస్టు పార్టీ 18 వ కాంగ్రెస్ సమావేశంలో కామ్రేడ్ స్టాలిన్ గావించిన పూర్తి ఉపన్యాసం ఇది.]

కామ్రేడ్స్,

పార్టీ 17 వ కాంగ్రెసు జరిగి ఐదేండ్లయింది. ఇది కొద్ది కాలం కాదని మీకే తెలుసు ఈ కాలంలో ప్రపంచం అనేక మార్పులకు గురి అయింది. ప్రభుత్వాలూ, రాజ్యాలూ, వాటి పరస్పర సంబంధాలూ పూర్తిగా మారాయి.

ఈ కాలంలో అంతర్జాతీయ పరిస్థితులలో వాస్తవంగా ఎట్టి మార్పులు జరిగాయి? ఏ విధముగా మన దేశములో ఆంతరంగిక, బాహ్య పరిస్థితులు మారాయి?

కేపిటలిస్టు దేశాలు ఈ కాలంలో ఆర్థికంగాను, రాజకీయంగాను చాలా గందరగోళాలతో నిండి ఉన్నాయి. ఆర్థికవిషయం చూద్దాం, ఇవి ఆర్థిక పతన(డిప్రెషన్) దినాలు. 1937 వ సంవత్సర తుది అర్ధభాగ ప్రారంభం నుండి ఆర్థిక క్షోభ (క్రైసిస్) ప్రారంభమయింది. అమెరికా, ఫ్రాంసు, ఇంగ్లండు పరిశ్రమలలో క్రొత్తగా పతనం కన్పింతుంది. కాబట్టి ఈ కాలమంతా ఆర్థిక చిక్కులతో నిండి ఉందని చెప్పాలి. రాజకీయంగా చూద్దాం ఈ కాలంలో తీవ్రమైన రాజకీయ స్పర్ధలూ, అల్లర్లూ జరిగాయి. ఒక క్రొత్త సామ్రాజ్యయుద్ధం ప్రారంభమయి రెండవ ఏడు కూడా కావచ్చింది. ఈ యుద్ధం షాంగే నుండి జిబ్రాల్టరువరకు వ్యాపించిన ఒక విశాల భూ భాగంపై – 5000 లక్షల ప్రజలు గల భూ భాగంపై ప్రకటించబడింది. యూరప్, ఆఫ్రికా, ఆసియాల భూగోళ పటాలు తిరిగి వ్రాయబడుతున్నాయి దౌర్జన్యం వల్ల. ప్రపంచయుద్ధానంతర విధానం-శాంతియుత ప్రభుత్వం అని పిలువబడే ఆ ప్రభుత్వం-పునాదులతో సహా కదిలించబడింది.

కాని దానికి విరుద్ధంగా, సోవియట్ యూనియన్‌లో ఈ సంవత్సరాలలో ఆర్థిక వైజ్ఞానిక అభివృద్ధి, సంపత్తూ, హెచ్చయింది; ప్రపంచ మందంతటా శాంతిని కాపాడేందుకు పోరాటం వృద్ధి అయింది.

ఇది మామూలుగా మనకు కన్పడే చిత్రం.

ఇక మనం అంతర్జాతీయ పరిస్థితులలోని మార్పులను సంపూర్ణంగా పరిశీలించుదాం.

### కేపిటలిస్టు దేశాలలో నూతన ఆర్థిక క్షోభ

మార్కెట్లకోసం, ముడి వస్తువులకోసం ప్రపంచాన్ని మళ్లా పంచుకోడానికి తీవ్రమైన ఘర్షణ.

1929 సంవత్సర తుదిభాగంలో కేపిటలిస్టు దేశాలలో ప్రారంభమయిన ఆర్థిక క్షోభ 1933 చివరిదాకా ఉంది. దాని తర్వాత ఆర్థికక్షోభ, పరిశ్రమలు క్షీణించడంలోనికి మారింది. తర్వాత మళ్ళా కొంత కోలుకోవడం ప్రారంభమయింది. అప్పుడు పరిశ్రమలు కొంత తలయెత్తుకోడం పునర్నిర్మాణమూ జరిగింది. కాని ఈ తలయెత్తుకొనే ధోరణి ఆర్థిక వికాసానికి (బూమ్) దారి తీయలేదు — సాధారణంగా పునర్నిర్మాణంలో జరుగవలసినట్లు. పైగా దానికి విరుద్ధముగా 1937 సంవత్సర తుది అర్ధభాగంలో నూతన ఆర్థికక్షోభ ఉదయించి మొట్టమొదట అమెరికాను, తర్వాత ఇంగ్లండు ఫ్రాంసులను, ఇంకా అనేక ఇతర దేశాలను పట్టుకొన్నది.

కేపిటలిస్టుదేశాలు, పూర్వపు ఆర్థికక్షోభ. పతనాన్నుండి కోలుకోకముందే మరొక నూతన ఆర్థిక క్షోభను ఎదుర్కోవలసి వచ్చింది.

ఈ పరిస్థితి నిరుద్యోగం వృద్ధికాడానికి దారి తీసింది. కేపిటలిస్టు దేశాలలో 1933 లో 300 లక్షల మంది నిరుద్యోగులున్నారు. 1937 లో 140 లక్షల మంది నిరుద్యోగులున్నారు. మళ్ళా నూతనఆర్థిక క్షోభవలన 180 లక్షల మంది నిరుద్యోగులయారు.

నూతన ఆర్థికక్షోభలోని విశేషం ఏమిటంటే అది పూర్వందానితో అనేకవిధాల విభేదించుతుంది. కాని మరింత అధ్వాన్నంగా ఉంటుందే కాని మంచిదేమీకాదు. ఇదే విభేదం.

మొదటివిషయం ఈ నూతన ఆర్థిక క్షోభ 1929 లోవలె పారిశ్రామిక వికాసానంతరం కలిగే ఆర్థికక్షోభ కాదు. కాని కొంత పతనమూ (డిప్రెషన్) కొంత కోలుకోడమూ (అదైనా ఆర్థిక వికాసంగా మారలేదు) జరిగాక ఇది వచ్చింది.

ఇంతేగాదు. ఈఆర్థికక్షోభ శాంతి సమయములో ప్రారంభంకాలేదు. రెండవ సామ్రాజ్య యుద్ధము ప్రారంభమయాక: జపాన్ తాను చైనాతో రెండు సంవత్సరాలుగా యుద్ధము ప్రారంభించి చైనా మార్కెటును కల్లోలపరచి ఇతరదేశాల వస్తువులకు చైనా మార్కెటులో స్థానం లేకుండా సర్వప్రయత్నాలు చేస్తున్న సమయంలో:—ఇటలీ జర్మనీలు తమ జాతీయ సంపదనంతా అపుడే యుద్ధానికి ఉపయోగించి, ముడివస్తువుల నిల్వనూ, విదేశీ కరెన్సీనీ యుద్ధంకోసం ఖర్చుపెడుతున్న సమయంలో— ఇతర పెద్ద కేపిటలిస్టు దేశాలన్నీ యుద్ధానికి తయారవుతున్న సమయంలో; ఈ నూతన ఆర్థిక క్షోభ ప్రారంభించింది దీనిఅర్థం, గత ఆర్థికక్షోభ కంటె, ప్రస్తుత క్షోభనుండి తప్పించుకొనడానికి, కేపిటలిజానికి తగిన మార్గాలు లేవన్నమాట.

తుది విషయం ఏమిటంటే పూర్వపు క్షోభ వలె ఇది సర్వవ్యాపితమైనదికాదు. కాని ఇంకా యుద్ధ ప్రయత్నాలలో కాలుబెట్టక, ఆర్థికంగా బలంగా ఉన్న దేశాలలోగూడ ముఖ్యంగా వ్యాపించింది. ఇక జపాన్, జర్మనీ, ఇటలీ మొదలగు దాడి సలిపే దేశాలవారు ఇదివరకే యుద్ధ ప్రాతిపదికపైననే తమ ఆర్థిక విధానాన్ని సంఘటన పరచారు. వారు సృష్టి చేసేది ఎక్కువ యుద్ధసామగ్రియే కాబట్టి, ఇంకా ఆ దేశాలలో అధికోత్పత్తి అనే సమస్య రాలేదు, కాని ఆ సమస్య సమీపంలోనే ఉన్నది. అధికంగా బలంగా ఉంది. ఇతరదేశాలపై దాడి సల్పని దేశాలలో ఇపుడిపుడే ఆర్థిక క్షోభనుండి ఒకప్రక్క తలయెత్తుకొంటుంటే మరొకప్రక్క ఇతరులపై దాడిసల్పు దేశాలు తమ బంగారు నిధులనూ, ముడి వస్తువులనూ, యుద్ధభయ పీడిత కాలంలోనే ఖర్చు పెట్టివేసినవంటే మరొక క్లిష్టమైన ఆర్థిక క్షోభ రాక తప్పదని మనం గ్రహించాలి.

ఉదాహరణకు కేపిటలిస్టుదేశాల బంగారు నిధుల (గోల్డు రిజర్వులు) లెక్కలనుబట్టి ఈ విషయం తేట తెల్లమౌతుంది.

కేపిటలిస్టు దేశాల బంగారు నిధులు (గోల్డు రిజర్వు)

[ఈ లెక్క మిలియన్ల (పది లక్షల) లో ఈయబడినవి. ఇవి బంగారు (పూర్వపు) డాలర్లు.]

| దేశం | 1936 చివరకు | 1938 సెప్టెంబరు |
|---|---|---|
| మొత్తం | 12,980 | 14,301 |
| అమెరికా | 6,649 | 8,126 |
| బ్రిటన్ | 2,029 | 2,396 |
| ఫ్రాంసు | 1,769 | 1,435 |
| హాలండ్ | 289 | 595 |
| బెల్జియం | 373 | 318 |
| స్విడ్జర్లండ్ | 387 | 407 |
| జర్మనీ | 16 | 17 |
| ఇటలీ | 123 | 124 |
| జపాను | 273 | 97 |

ఈ లెక్కలవలన జర్మనీ, జపాను, ఇటలీలు కలసినా స్విడ్జర్లండ్ బంగారు నిధులకు తక్కువ అని తేలుతుంది.

ఇక్కడ మరికొన్ని లెక్కలున్నాయి. ఇవి గత 5 సంవత్సరాలలో కేపిటలిస్టు దేశాలలో పారిశ్రామిక పతనమూ, సోవియట్ యూనియన్‌లో పారిశ్రామికోన్నతీ తెలియజేస్తాయి.

పారిశ్రామిక ఉత్పత్తి (1929 = 100 అనుకొంటే)

| | 1934 | 1935 | 1796 | 1937 | 1938 |
|---|---|---|---|---|---|
| అమెరికా | 66.4 | 75.6 | 88.1 | 92.2 | 72 |
| బ్రిటన్ | 98.8 | 105.8 | 115.9 | 123.7 | 112 |
| ఫ్రాన్సు | 71 | 67.4 | 79.3 | 82.8 | 70 |
| ఇటలీ | 80 | 93.8 | 87.5 | 99.6 | 96 |
| జర్మనీ | 79.8 | 94 | 106.3 | 117.2 | 125 |
| జపాను | 128.7 | 141.8 | 151.1 | 170.8 | 165 |
| సోవియట్ యూనియన్ | 238.7 | 293.4 | 382.3 | 424 | 477 |

స్టాలిన్

ఈ లెక్కలను బట్టి, పారిశ్రామిక పతనమంటే ఏమిటో తెలియనిదీ పరిశ్రమలు ఎపుడూ వృద్ధి చెందుతూ పోయేదీ, ఒక్క సోవియట్ యూనియనే అని తెల్పుతుంది.

ఈ లెక్కలు అమెరికా, ఇంగ్లండు ఫ్రాంసులలో తీవ్ర ఆర్థిక క్షోభ అపుడే ప్రారంభమై వృద్ధి పొందుతున్నదని తెలియజేస్తాయి.

ఇంతేకాదు. ఇటలీ, జపానులలో (జర్మనీ కంటె ముందు ఇవి యుద్ధ ప్రాతిపదికపై తమ జాతీయ ఆర్థిక విధానాన్ని ఉంచాయి.) 1938లోనే పారిశ్రామిక పతనం అపుడే ప్రారంభమయినదని ఈలెక్కలు తెలియజేస్తున్నాయి.

జపాను, ఇటలీల తర్వాత యుద్ధ ప్రాతిపదికపై జాతీయ ఆర్థిక విధానాన్ని సంఘటన పరచిన జర్మనీలో – పరిశ్రమ అభివృద్ధిలో (కొద్దిగానన్నమాట నిజమే) నే ఉంది. అయితే జపాను ఇటలీలుకూడ మొన్నమొన్నటి వరకూ ఇలాగే ఉన్నాయి.

ఏదైనా హఠాత్ ఘటన సంభవిల్లితే తప్ప జపాన్, ఇటలీల పరిశ్రమ అధోముఖానికి పోయినట్లే. జర్మనీకూడ అదే అధోముఖ మార్గాన నడవక తప్పదని చెప్పుటలో సందేహము ఏమీలేదు యుద్ధ ప్రాతిపదికపై దేశీయ ఆర్థిక విధానాన్ని పెట్టడంఅంటే అర్థమేమిటి? అంటే పరిశ్రమలలో ఒకభాగమే – ప్రజలకు గావలసిన వస్తువులుగాక – ఎంతవరకు వీలవుతుందో అంతవరకు యుద్ధవస్తువులను-తయారుజేయడం అన్నమాట; మామూలుగా ప్రజలు వినియోగించే వస్తువులపై నిర్బంధముంచి, ఉత్పత్తిని తక్కువచేయుట-దాని మూలకంగా ప్రజల వినిమయశక్తిని తగ్గించుట, దేశాన్ని ఆర్థికక్షోభతో ముంచుట అన్నమాట.

కేపిటలిస్టు దేశాలలోని నూతన ఆర్థికక్షోభను గురించి కన్పడే స్పష్టమైన చిత్రమదే.

ఆర్థిక పరిస్థితులావిధంగా అననుకూలంగా తిరగడంవల్ల, సామ్రాజ్యాల పరస్పర సంబంధాలు ఇలా మరింత చెడిపోవడం సహజం.

వేగంగావస్తున్న ఆర్థికక్షోభ అపుడే మార్కెట్టు కోసము, ముడివస్తువులకోసమూ జరిగే పోరాటాన్ని తీవ్రపరచింది. మంచూరియా, ఉత్తర చైనాలను జపాను ఆక్రమించడం; ఇటలీ అబిసీనియాను ఆక్రమించడం, ఇదంతా సామ్రాజ్యాల మధ్యగల పోరాటాన్ని వాస్తవంగా ప్రతిబింబంపచేసింది. నూతన ఆర్థికక్షోభ సామ్రాజ్యాలమధ్య పోరాటాన్ని తీవ్రపరచడానికి దారితీయాలి. దారి తీస్తూఉంది. ఇప్పటి ప్రశ్న ఇది వరకులాగా మార్కెట్లలో పోటీకాదు. వర్తక యుద్ధముకాదు. వస్తువులను "డంప్" చేయడమూకాదు. ఈ పద్ధతులన్నీ సరిపోవడంలేదని చాలరోజుల క్రిందటే గ్రహింపబడింది. ఇప్పటి ప్రశ్న ప్రపంచాన్ని క్రొత్తగా విభజించుకోడం, సైనిక దౌర్జన్యంతో కాలనీలను, పలుకుబడి వృద్ధికాగల ప్రదేశాలను ఆక్రమించుకోడం.

జపాను తన దౌర్జన్యాక్రమణ కృత్యాలను సమర్థించుకొంటూ ఇలా చెబుతుంది. "నైన్ పవర్ పాక్టువలన తాను మోసగింప బడిందట: చైనాకు నష్టంతో తన సామ్రాజ్యాన్ని విస్తీర్ణ మొనర్చుకోనీయలేదట. కాని ప్రాంసు ఇంగ్లండులకు కావలసినన్ని కాలనీలు ఉన్నవట."

ఇటలీ ఏమని సమర్థించు కొంటున్నదో చూడండి. ప్రపంచ యుద్ధానంతరం దోపిడీని విభజించుటలో తనకు మోసంకల్గినదట: అందుకు ప్రతిఫలితంగా ఫ్రాంసు, ఇంగ్లండులకు నష్టంతో, పలుకుబడిగలప్రదేశాలు తనకు పుష్కలంగా ముట్టాలట: సామ్రాజవాద యుద్ధఫలితంగా, వర్సైల్సు సంధివలననూ, తీవ్రంగా నష్టపడిన జర్మనీ—జపాను ఇటలీలతో కలిసింది. తనసామ్రాజ్యాన్ని యూరప్‌లో పెంపొందించుకో నీయమని, మొదటి సామ్రాజ్యవాద యుద్ధంలో గెల్చినవారు తననుండి లాక్కొన్న కాలనీలను తిరిగి యిమ్మనీ, కోరింది.

ఈవిధంగా దౌర్జన్యాక్రమణ చేసే సామ్రాజ్యాలకూటమి ఏర్పడినది.

ప్రపంచాన్ని నూతనంగా యుద్ధంద్వారా విభజించడం తప్పనసరి అయింది.

## అంతర్జాతీయ రాజకీయ స్థితి అధ్వాన్నమయింది

**యుద్ధానంతర శాంతి యొడంబడికలు రద్దగుట : నూతన సామ్రాజ్యవాద యుద్ధ ప్రారంభం.**

ఈ 5 ఏండ్లలో జరిగిన అనేక ప్రాముఖ్య ఘటనలు—సింహావలోకన మొనరింపదగినవి ఉన్నవి. నూతన సామ్రాజ్యవాద యుద్ధంతో ప్రారంభమవుతాయి ఆఘటనలు. 1935 లో ఇటలీ అబిసీనియాపై దాడిసలిపి పట్టుకొంది. 1936 వేసవిలో ఇటలీ జర్మనీలు స్పెయినులో సైనికుల్ని పంపి తిరుగుబాటును సంఘటపరచినవి. జర్మనీ ఉత్తర స్పెయినులో, స్పానిష్ మొరాకోలోనూ; ఇటలీ దక్షిణ స్పెయిన్‌లోనూ, బలియారిక్ దీవులలోనూ, కోటలు గట్టసాగినవి. మంచూరియాను ఆక్రమించిన జపాను, 1937 లో ఉత్తర, మధ్య చైనాలపై దాడిసలిపి పీకింగ్, టీన్‌స్టిన్, షాంగైలను స్వాధీన పరచుకొంది. ఆక్రమించుకొన్న స్థలాలనుండి విదేశీ పోటీదార్లను నెట్టివేయ ప్రారంభించింది. 1938 ప్రారంభంలో జర్మనీ ఆస్ట్రియాను ఆక్రమించింది. 1938 అక్టోబర్ లో జకోస్లోవేకియా సుడెటెన్ రాజ్యాన్ని ఆక్రమించింది. 1938 సంవత్సరాంతాన జపాన్ కాంటన్ను, 1939 సంవత్సర ప్రారంభంలో హైనాన్ దీవులను ఆక్రమించింది.

ఆ విధంగానే తెలియకుండానే వివిధ జాతులలో చొచ్చుకు పోయిన యుద్ధం 5000 లక్షల ప్రజానీకంలో టిన్‌స్టిన్, షాంగే, కాంటన్‌ల నుండి అబిస్సీనియాగుండా జిబ్రాల్టరు వరకు ప్రాకింది.

మొదటి సామ్రాజ్య యుద్ధం ముగిసాక జయించిన రాజ్యాలు—ముఖ్యంగా ఇంగ్లండు, ఫ్రాంసు, అమెరికాలు—వివిధ దేశాల మధ్య నూతన పరస్పర సంబంధాలను నెలకొల్పాయి, అదే యుద్ధానంతర 'శాంతి ప్రభుత్వం'. ఈ ప్రభుత్వ ఫలితాలు ఏమంటే 'నైన్ పవర్‌పాక్టు' ప్రాచ్య దేశాలలోనూ; 'వర్సైల్సు సంధి' మరి కొన్ని ఒడంబడికలూ యూరప్‌లోనూ, ఏర్పరుచుట. నానాజాతి సమితి అంటూ ఒకటి ఏర్పడింది వివిధ దేశాలమధ్య నుండే సంబంధాలను సరి చూడడానికి. ఈ ప్రభుత్వ పరిమితిలోనే వివిధ రాజ్యాల సంయుక్త ప్రతిఘటనతో, ఆయా రాజ్యాలను పతనం గాకుండా నిలుపుకొనేందుకు నిశ్చయించుకున్నారు. అయినప్పటికీ దాడిసల్పే మూడు రాజ్యాలూ, ఈ యుద్ధానంతరం శాంతి ప్రభుత్వాన్ని తల్లక్రిందులు చేసినయి. జపాన్ 'నైన్ పవర్‌పాక్టు'ను చించివేసింది. ఇటలీ జర్మనీలు వర్సైల్సు సంధిని కాలిక్రింద రాచినయి. తమ పనిని నిరాఘాటంగా సాగించుకొనేందుకు ఈ మూడుదేశాలు నానాజాతి సమితి నుండి విరమించుకొన్నాయి.

మరో నూతన సామ్రాజ్యయుద్ధం తప్పదన్న విషయం స్పష్టపడింది.

ఒడంబడికలను ఏ మాత్రం లక్ష్యం చేయకుండా, ప్రజాభిప్రాయాన్ని ఏమాత్రం చెవిపెట్టకుండా, ఒక్కసారి యుద్ధంలోకి దూకడం నేడు అంత సులభమైన పనికాదు బూర్జువా రాజకీయవేత్తలకు ఇది బాగా తెలుసు. ఫేసిస్టు పరిపాలకులకు గూడ ఇది అవగతమే. అందుకనే ఫేసిస్టు పరిపాలకులు యుద్ధంలోకి దూకేముందు ప్రజాభిప్రాయాన్ని తమ కనుకూలంగా సృష్టించేదుకు, ప్రజాభిప్రాయాన్ని వక్రమార్గాన త్రిప్పేటందుకు, ప్రజలను మోసపుచ్చేందుకు నిశ్చయించుకొన్నారు.

ఇంగ్లండు ఫ్రాంసుహక్కులకు విరుద్ధంగా యూరప్‌లో జర్మనీ ఇటలీల మిలటరీ బ్లాక్ నిర్మాణమా? దేవుడు రక్షించుగాక: దాన్ని మీరు బ్లాక్ అంటారా: "మాకు" మిలటరీ బ్లాక్ అలాంటిది. ఏమీలేదు. "మాకు" ఉన్నదల్లా, అపాయంలేని "బెర్లిన్ – రోమ్ యాక్సిస్" అంటే just a geometrical equation for an axis (నవ్వు)

అమెరికా, ఇంగ్లండు, ఫ్రాంసు హక్కులకు వ్యతిరేకంగా ప్రాచ్యదేశాలలో ఇటలీ, జర్మనీ, జపానుల మిలటరీ బ్లాక్ నిర్మాణమా? ఎబ్బేలేదు: "మాకు" మిలటరీ బ్లాక్‌లాంటిదేమీ లేనేలేదు. "మాకు" ఉన్నదల్లా అపాయకరంగాని "బెర్లిన్-రోం-టోకియో త్రికోణం" అంటే a slight Penchant for geometry (అంతటా నవ్వు)

ఇంగ్లండు, ఫ్రాంసు, అమెరికాలపై యుద్ధమా? నాన్సెన్స్ "మేము" అంతర్జాతీయ కమ్యూనిస్టుపార్టీ (కొమింటరన్) పై గాని, ఈ దేశాలపై యుద్ధం ప్రకటించడం లేదు, మీరు నమ్మకపోతే ఇటలీ, జర్మనీ, జపానులు చేసికొన్న కమ్యూనిస్టుపార్టీ వ్యతిరేకపు టొడంబడిక (యాంటీ-కొమింటరన్-పాక్టు)ను చదవండి.

ఈ విధంగా దాడి సలిపే పెద్ద మనుష్యులు ప్రజాభిప్రాయాన్ని నిర్మించదామనుకున్నారు. కాని ఈ గడబిడ నాటకమంతా అర్థ విహీనమైనదని, తెలివితక్కువదని తెలుసుకోవడం కష్టమైన పనికాదు. ఎందుకంటే, మంగోలియా ఎడారులలోను, అబిస్సీనియా పర్వత ప్రదేశాలలోను, స్పానిష్ మొరాకో వర భూములలోను కమ్యూనిస్టు పెనుభూతమే కనపడటం హాస్యాస్పదం (నవ్వు)

కాని యుద్ధం తప్పదు అది ఏ ముసుగు క్రిందా దాచడానికి వీల్లేనిది. యాక్సెస్‌గానీ, ట్రయాంగిల్స్ గాని, కొమింటరన్ వ్యతిరేక ఒడంబడికలుగానీ, జపాను చైనాలో విశాల భాగాన్ని ఆక్రమించుకున్నదన్న విషయాన్ని, జర్మనీ ఆస్ట్రియా జకోస్లోవేకియాల కాజేసిన దన్నమాటను; జర్మనీ, ఇటలీలు స్పెయిన్‌ను దిగమ్రింగిన సంగతిని; ఇవన్నీ దాడి సల్పని ఇతరదేశ హక్కులను ఉల్లంఘించుతూ చేసిన వనేయను విషయాన్ని; కప్పిపుచ్చలేవు. యుద్ధం యుద్ధంగానే ఉంది; దాడి సల్పేవారి మిలటరీ బ్లాక్ మిలటరీ బ్లాక్‌గానే ఉంది; దాడి సల్పేవారు దాడిసల్పువారుగానే ఉన్నారు.

నూతన సామ్రాజ్య యుద్ధంలో గుర్తింపదగిన విషయమేమంటే, అది సర్వత్రా వ్యాపించలేదు. ప్రపంచ యుద్ధం కాలేదు. దాడిసలుపు రాజ్యాలవారు యుద్ధాన్ని ప్రకటించి, దాడిసల్పని ఇంగ్లండు, ఫ్రాంసు అమెరికా దేశాల హక్కులను అన్నివిధాల భంగపరచుతున్నాయి. ఇక ఈ అమెరికా, ఇంగ్లండు, ఫ్రాంసులు వెనకడుగిడి, ఒకదాని తర్వాత ఇంకొకటి కన్సెషన్లను ఈయసాగాయి.

ఆ విధంగా ప్రపంచాన్ని, పలుకుబడి గల ప్రదేశాలను తిరిగిపంచుకోడం చూస్తున్నాం. ఇది దాడి సల్పని దేశాలకు నష్టమే. కాని దౌర్జన్యాక్రమణను నిరోధించు ప్రయత్నమే లేదు. పైగా కొన్నికొన్ని చోట్ల, కొంత పరస్పర అంగీకారం (లోలోన) కూడా ఉంది. నమ్మటానికి వీలులేని విషయమే. కాని వాస్తవం.

ఈ నూతన సామ్రాజ్య యుద్ధం యొక్క విచిత్ర వైఖరికి మనమేం ఆపాదించుదాం?

విశాలమైన ప్రదేశాలు గల దాడి సల్పని దేశాలు, అంత తేలికగా, ఏ మాత్రమూ నిరోధం లేకుండానే, దాడి సల్పువారిని సంతోష పఱచడానికి తమ హక్కులను ఎందుకు వదలుకొన్నాయి? తమ వాగ్దానాలు ఎందుకు మరచి పోయాయి?

దాడి సల్పని దేశాల బలహీనతయని భావించాలా? కానేకాదు. దాడిసల్పని దేశాలు, ప్రజాస్వామ్యదేశాలు కలసి ఉంటే, ఆర్థికంగా గాని, సైనికంగాగాని ఫేసిస్టు దేశాలకంటే నిస్సందేహంగా బలవంతమయినవి.

అయితే, దాడి సల్పువారికి, ఈ దేశాలు వరుసవరుసగా కన్సెషన్సు ఇవ్వడాన్ని గురించి ఏమని అభిప్రాయ పడాలి?

దీనికి ఒక కారణం చెప్పవచ్చు. ఉదాహరణకు, దాడిసల్పని దేశాలు యుద్ధంలో తగుల్కొంటే, లేక యుద్ధం ప్రపంచయుద్ధంగా మారితే, విప్లవం వస్తుందని భయపడవచ్చు. బూర్జువా రాజకీయ వేత్తలకు మొదటి సామ్రాజ్యవాద యుద్ధంవలన పెద్ద దేశాలలో ఒక దానిలో విప్లవం వచ్చిందని తెలుసు. మరొక రెండవ సామ్రాజ్యయుద్ధం మరొక దేశంలో గాని, అనేక దేశాలలో గాని, విప్లవానికి దారి తీయవచ్చు.

కాని ప్రస్తుతంలో ఇదిఒక్కటే-లేక ప్రధాన కారణం కాదు. ప్రధాన కారణం దాడి సల్పని దేశాలు ముఖ్యంగా ఇంగ్లండు, ఫ్రాంసులు శాంతి (కలెక్టివ్ సెక్యూరిటీ) నీతిని తిరస్కరించాయి; దాడి సల్పేవారిని కలిసి నిరోధించడానికి ఒప్పుకోలేదు. తాము కలుగజేసికోరాదను నీతితో "తటస్థత" నవలంబించినాయి.

తటస్థ విధానంయొక్క నీతి మొదట ఇలా ఉంది. "ప్రతి దేశమూ, దౌర్జన్యాక్రమణ మొనర్చేవారినుండి దాని ఇష్టం వచ్చినట్లు, దానికి చేతనయినట్లు రక్షించుకోనీయండి. అది మా పని కాదు. మేము దాడిసల్పే వారితోనూ, దాడికి గురియయిన వారితోనూ, మేము బేరాలాడుతాము." కాని ఈ తటస్థవిధానం యొక్క నిజమైన అర్థం ఏమిటంటే, దాడికి తలవూపడం, యుద్ధం చేయడానికి సంపూర్ణ స్వేచ్ఛనీయడం, దానిఫలితంగా ఈ యుద్ధం ప్రపంచ యుద్ధంగా మార్చడమూ.

దాడిసలిపేవారి క్రూరకృత్యాలను ఆపకుండేందుకు; అంటే జపాను చైనాతో (ఇంకా బాగా చెప్పాలంటే) రష్యాతో యుద్ధంలో తగుల్కొనడాన్ని ఆపకుండేదుకు; జర్మనీ యూరోపియన్ పరిస్థితులలో చిక్కుకొనడాన్ని లేక సోవియట్ యూనియన్‌తో యుద్ధంలో తగుల్కొనడాన్ని ఆపకుండేందుకు; తటస్థవిధానం ఆతురత చూపుతున్నది. ఇరుపక్షాల వారు యుద్ధపు బురదలో కూరుకుపోతే, వారిని కృత్రిమంగా ప్రోత్సహిస్తూ, వారొకరి నొకరు బలహీనపఱచుకొని, తాము (యుద్ధాలు చేసేవాడు) పూర్తిగా బలహీనపడ్డాక, "శాంతి రక్షణ కోసం" మళ్ళా తెరమీద తటస్థ విధానంవారు కనపడటం, కనపడి బలహీనమైన పక్షాలకు కొన్ని షరతులను నెత్తిన రుద్దటం,— ఇదీ తటస్థవిధానం కోరుతున్నది.

సులభం. చౌకకూడా.

జపానును ఉదాహరణకు తీసుకొండి. జపాను ఉత్తరచైనాకు ఆక్రమించక పూర్వం, పలుకుబడిగల ఫ్రెంచి, బ్రిటిషు పత్రికలు, చైనా బలహీనతను గురించి, నిరోధించలేని అశక్తతగురించీ బిగ్గరగా అఱవసాగాయి. జపాను తన సైన్యాలతో రెండు మూడు నెలలో చైనాను జయించుతుందని వ్రాయసాగాయి. అప్పుడు, యూరోపియన్, అమెరికన్ రాజకీయ వేత్తలు వేచిచూడటం సాగించారు. జపాన్ యుద్ధం ప్రారంభించి చైనాలో విదేశీ పెట్టుబడికి కేంద్రస్థానమైన షాంగేను కాజేస్తే చూస్తూ పోనిచ్చారు; దక్షిణ చైనాలో ఇంగ్లండు వర్తకం నిరాఘాటంగా (మొనాపలీ) సాగే కాంటన్‌ను పోనిచ్చారు; తర్వాత హైనాన్ పోనిచ్చి, హాంగ్‌కాంగ్‌ను చుట్టు ముట్టనిచ్చారు. ఇదంతా దాడిసల్పు వారిని ప్రోత్సహించుతున్నట్లు కన్పడటంలేదా? ఇదంతా ఎలా కన్పడుతుందంటే "మీరు యుద్ధంలో లోతుగాదిగి కొట్టుకులాడండి; తర్వాత మేం చూస్తాం" అన్నట్లుగా ఉంది.

ఇక జర్మనీని విషయంలో చూడండి, ఆస్ట్రియాను రక్షిస్తామని వాగ్దానం చేసినా, దానిని జర్మనీకి అప్పగించారు; జకోస్లోవియా గతి దాన్నే చూసుకోమని వదలివేసి, తమ ప్రతి వాగ్దానాన్ని ఉల్లంఘించారు. తర్వాత "రష్యా సైన్యం బలహీనంగా ఉన్నదనీ", "రష్యా విమాన బలంలో అవినీతి హెచ్చిందనీ" "సోవియట్ యూనియన్‌లో కొట్లాటలు ప్రారంభమయినవనీ" పత్రికలలో దుష్ప్రచారంసాగించారు. ప్రాచ్య ప్రదేశాలలో ముందుకు పొమ్మని జర్మనీని ప్రోత్సహించారు, త్వరగా ఏరుకొనేందుకు కొన్ని ప్రదేశాలను వాగ్దానం చేశారు. "బోల్షివిక్కులపై యుద్ధం సాగించండి, అంతా సరియవుతుంది" అని తాళం వేయసాగారు.



ఇదికూడా దాడి సల్పేవారిని ప్రోత్సహిస్తూ, ఉత్సాహ పరుస్తుందని ఒప్పుకు తీరాలి.

సోవియట్ యుక్రెయిన్‌ను గురించి బ్రిటిష్, ఫ్రెంచి, అమెరికన్ పత్రికలు లేవనెత్తిన ఆక్రందన గమనించ దగినది. సోవియట్ యుక్రెయిన్‌పై జర్మనీ దాడి వెడలుతుందనీ; ఇపుడు జర్మనీకి 700,000 ప్రజలు గల్గిన కార్పాతియన్ యుక్రెయిన్ అని పిలువబడే ఒకటి ఉన్నదనీ; వసంత ఋతువు లోగా 300 లక్షలు ప్రజలుగల సోవియట్ యుక్రెయిన్‌పై జర్మనీ దాడి సల్పి, దానిలో కల్పుకొంటుందనీ; ఆ పత్రికల పెద్దమనుష్యులు తమ గొంతులు బొంగురు పోయేదాకా అరిచారు. ఈ అనుమానపు ఆక్రందన లేవదీయటంలో వారి ఉద్దేశ్యం జర్మనీకి వ్యతిరేకంగా సోవియట్‌యూనియన్‌ను రెచ్చగొట్టడానికి. వాతావరణాన్ని విషపూరితం చేయడానికి, కనపడే కారణాలేమీ లేకుండానె జర్మనీతో విరోధాన్ని రెచ్చగొట్టడానికి లాగా ఉంది.

దోమ (కార్పాతియన్ యుక్రైన్) తో ఏనుగు (సోవియట్ యుక్రైన్)ను కల్పుకోవాలని కలలుగనే పిచ్చముండాకొడుకులు జర్మనీలో ఉండటం సంభవంకావచ్చు. నిజంగా జర్మనీలో అలాంటి పిచ్చవాళ్లే ఉంటే, వారి కోసం మన దేశంలో బంధించడానికి కావలసినన్ని గొలుసులున్నవి. (హర్షధ్వానాలు మిన్నుముట్టినాయి.) ఆ పిచ్చమనుష్యులను వదలివేసి సాధారణ మనుష్యుల సంగతి ఆలోచిద్దాం. కార్పాతియన్ యుక్రైన్ అనబడే దానికోసం సోవియట్ యుక్రైన్‌ను దాడి సల్పడాన్ని గురించి తీవ్రంగా మాట్లాడడం బుద్ధిహీనతా. అసంభవమూ కాదా? ఊహించండి. దోమ ఏనుగు వద్దకువచ్చి, ఉల్లాసంగా ఇలా అంటుంది. "సోదరా, నాకు చాలా విచారంగా ఉంది.... ఇక్కడ నీకు ఎవరూ భూస్వాములు లేరు, కేపిటలిస్టులు లేరు, జాతిని మరొకజాతి అణచడంలేదు. ఫేసిస్టు "బాస్"లు లేరు. వీళ్ళందరూ లేకుండా జీవించేమార్గం ఇదా? .... నీవంక చూస్తుంటే, నీయంతకు నీవు నాలో కలిస్తే తప్ప మరోఆశ నీకులేదని నాబుద్ధికి తట్టుతున్నది.... (అంతటా నవ్వు) మంచిది, అలాకానీయ్, నీ చిన్నరాజ్యాన్ని నా విశాలప్రదేశంలో కల్పుకొనేందుకు నీకు అనుమతి నిస్తున్నాను...." (అంతటా నవ్వు. చప్పట్లు)

ఇంకా గమనింపదగ్గ విషయం ఇంకోటున్నది. కొంతమంది యూరోపియన్, అమెరికన్ రాజకీయవేత్తలూ, పత్రికాధిపతులూ, "సోవియట్ యూనియన్‌పై దండెత్తుట" కోసం వేచివేచి విసిగిపోయి, "నాన్ ఇంటర్వెన్షన్" విధానంయొక్క తెర వెనుక నాటకమేమిటో బయటపెట్టసాగారు. వాళ్ళు బహిరంగంగా చెబుతున్నారు, తెల్లటి కాగితముమీద నల్లటి అక్షరాలతో స్పష్టంగా వ్రాస్తున్నారు. ఏమని? జర్మనీవాళ్ళను అతిక్రూరంగా నిరాశ చెందేటట్లు (డిసపాయంట్) చేసిందట. ప్రాచ్య యూరప్‌లో దాడిని కొనసాగించి సోవియట్ యూనియన్‌పై బడకుండా పశ్చిమభాగానికి తిరిగి "కాలనీలు" ఇవ్వమని జర్మనీ అడుగుతున్నదట. జర్మనీకి జకోస్లోవేకియాలోని కొన్ని జిల్లాలను అప్పజెప్పటం, సోవియట్ యూనియన్‌పై దాడి సల్పాలనే ఒడంబడికతోనని ఇపుడూహించవచ్చు. కాని జర్మనులు ఇపుడు దానిని తిరస్కరించి వారిని పితృలోకానికి ప్రయాణం గట్టిస్తున్నారు.

"నాన్ ఇంటర్వెన్షన్" విధానంమీద నీతులు గరపటం, ద్రోహం, మోసం, అని ఇంకా యేమేమో నీతులు దూరంగా ఉండి నేను చెప్పడం లాభం లేదు. మానవ నీతినే గుర్తించని వారికి నీతులు బోధించడం నిష్ప్రయోజనం. రాటుదేరిన ముసల బూర్జువా రాచకీయ వేత్తలు చెప్పినట్లు రాజకీయాలు రాజకీయాలే. 'నాన్ ఇంటర్వెన్షన్' విధానాన్ని ప్రోత్సహించేవారు ప్రారంభించిన అపాయకరమైన రాజకీయపు కుట్ర (ఆట) తీరని అపజయంతో అంతమొందవచ్చు.

నేటి 'నాన్ ఇంటర్వెన్షన్' విధానంయొక్క వాస్తవిక స్వరూపం అది.

కేపిటలిస్టు దేశాలలో నేడున్న రాజకీయ పరిస్థితి అది.

## సోవియట్ యూనియన్ : కేపిటలిస్టు దేశాలు

యుద్ధం, వివిధ దేశాలలోని పరస్పర సంబంధాలలో నూతన పరిస్థితులను కలుగజేసింది. భయమూ, అస్థిరత్వమూ హెచ్చయింది. యుద్ధానంతరం శాంతి ప్రభుత్వాన్ని కాలదన్ని, సాధారణ అంతర్జాతీయ నీతి సూత్రాలను దిగత్రొక్కడంవలన, అంతర్జాతీయ ఒడంబడికలన్నా, వాగ్దానాలన్నా అనుమానాలు రేకెత్తినాయి. అహింస (ఫేసిజం) ఆయుధ విసర్జన ప్రణాళికలూ చచ్చిపోయినాయి, పూడ్చిపెట్టబడినాయి. ఎటిస్థానే యుద్ధ జ్వరం హెచ్చింది. చిన్న రాజ్యాలూ-పెద్ద రాజ్యాలు-అన్నీ-ముఖ్యంగా 'నాన్ ఇంటర్వెన్షన్' విధానం ప్రబోధించిన రాజ్యాలు కూడా-ఆయుధాలు వృద్ధిచేస్తున్నయి. దాడి సల్పువారికి ఇచ్చి మ్యూనిక్ కన్సెషన్లు, మ్యూనిక్ సంధీ, నూతన శాంతి' యుగాన్ని ప్రారంభించినదని చెప్పే జిడ్డు ఉపన్యాసాలలో ఎవడికీ నమ్మకం లేదిపుడు. మ్యూనిక్ సంధిపై దస్కతు చేసిన ఇంగ్లండు, ఫ్రాంసులకే నమ్మకం లేదు అవి ఇతర దేశాలకు తీసిపోకుండా, ఆయుధాలను వృద్ధి చేస్తున్నాయి.

ఈ అశుభసూచక పరిస్థితులను సహజంగా రష్యా గుర్తించకుండ ఉండలేదు. ప్రపంచంలో ఏ మూలమూలనైనా దాడిసల్పేవారు యుద్ధాన్ని ప్రారంభించితే, శాంతియుతదేశాలకు అది అపాయాన్ని కలుగజేస్తుందనుటలో సందేహంలేదు. అప్పుడే ఆఫ్రికా, ఆసియా, యూరప్‌లలోకి ప్రాకి 5000 లక్షల ప్రజలలో వ్యాప్తంచెందిన నూతన సామ్రాజ్యవాద యుద్ధభయం మరొకటి తీవ్రమైనది ఉంది. ఇదంతా గమనించి-నిస్సందేహంగా శాంతి సంరక్షణ విధానాన్ని ఖచ్చితంగా అవలంబించుతూన్న మనదేశం మన రెడ్‌ఆర్మీని, రెడ్ నేవీయొక్క తయారీని వృద్ధి పఱచడానికి కావలసినంత చేస్తూవుంది.

ఇదేసమయాన, సోవియట్ యూనియన్ తన అంతర్జాతీయపు టునికిని బలపరచుకొనేందుకు, మరికొన్ని విధానాలు అవలంబింప నిశ్చయించింది. నానాజాతి సమితి బలహీనత గుర్తించికూడా, దాడిసలిపేవారి గుట్టు బయట పెట్టడానికి అదనైనది నానాజాతి సమితియని గుర్తించి; ఎంత బలహీనంగాఉన్నా, అది యుద్ధం రాకుండాఆపడానికి కొంతవరకు శాంతిసాధనం కావచ్చునని యెంచి, మనదేశం 1934 సంవత్సరాంతాన నానాజాతి సమితిలో చేరింది. భయపీడితమైన ఈకాలంలో కూడా, అంతర్జాతీయ సంస్థగా అంత బలహీనమైన నానాజాతి సమితినికూడ నిర్లక్ష్యపరచరాదని సోవియట్ యూనియన తలచుతుంది. 1935 మే లో, దాడిసలిపే వారి నుండి రక్షించుకొనేందుకు, ఫ్రాంసు, రష్యాలమధ్య ఒక పరస్పర సహాయ సంధి జరిగింది. అలాంటి ఒడంబడికయే జకోస్లోవేకియాతోకూడ జరిగింది. 1936 మార్చిలో మంగోలియన్ పీపుల్సు రిపబ్లిక్‌తో, పరస్పర సహాయపు టొడంబడిక జరిగింది. 1937 ఆగస్టులో ఒకరిపై ఒకరు దాడిసల్పరాదను ఒడంబడిక చైనా రిపబ్లిక్‌తో సోవియటు యూనియన్ చేసికొంది.

ఇలాంటి అంతర్జాతీయ క్లిష్ట పరిస్థితులలో శాంతిని కాపాడటానికి, తన విదేశ రాజ్యాంగ నీతిని ఈవిధంగా సోవియట్ యూనియన్ అవలంబించింది.

సోవియట్ యూనియన్‌యొక్క విదేశ రాజనీతి తేటతెల్లమైనది.

1. మనం శాంతిని కాపాడుతాం అన్ని దేశాలతోనూ వర్తక సంబంధాలను బలపఱచుతాం, అది మన పరిస్థితి; ఈ పరిస్థితికి సోవియట్ యూనియన్‌తో ఇతరదేశాలు తమ సంబంధాన్ని ఇలా ఉంచినన్నాళ్లు వాళ్ల మన దేశపు హక్కులను ఉల్లంఘించ నంతకాలం ఈ పరిస్థితికి మనం అంటిపెట్టుకు కూర్చుంటాం.

2. సోవియట్ యూనియన్‌తో సరిహద్దులు గల అన్ని పొరుగు దేశాలతోనూ, మేము శాంతియుతంగా, స్నేహంగా, దగ్గరగా ఉంటాం అదీ మన పరిస్థితి; ఈదేశాలు సోవియట్ యూనియనుతో తమ సంబంధాలను ఇలాగే ఉంచినన్నాళ్లు; ప్రత్యక్షంగా గాని, పరోక్షంగా గాని సోవియట్ రాజ్యంయొక్క సరిహద్దులను దాటి నీతిని ఉల్లంఘించుటకు ప్రయత్నం చేయనంతకాలమూ, ఈపరిస్థితికి మనం అంటి పెట్టుకుంటాం.

3. దాడికి గురియైన, దేశాలకూ, తమతమ దేశస్వాతంత్ర్యానికి పోరాడే జాతులకూ మనం సహాయం చేస్తూ నిలబడతాం.

4. దాడిసల్పే వారి బెదరింపులకు మనం లొంగం. యుద్ధాన్ని ప్రేరేపించం, సోవియట్ సరిహద్దులను దాటదలిచే వారిని దెబ్బలు కొడతాం.

ఇదే మన విదేశ రాజ్యాంగనీతి. (తుపానులాగా చాలాసేపు చప్పట్లు)

తన విదేశాంగ రాజనీతిలో సోవియట్ యూనియన్ ఈ క్రిందివాటిపై ఆధారపడి ఉంటుంది.

1. సోవియట్‌లో పెరుగుచున్న ఆర్థిక, రాజకీయ, వైజ్ఞానిక బలంమీద

2. సోవియట్ సంఘం యొక్క నైతిక, రాజకీయ, ఐకమత్యంమీద

3. మన దేశంలోని వివిధజాతుల పరస్పర స్నేహంమీద

4. రెడ్ ఆర్మీ, రెడ్ నేవీమీద

5. మన దేశపు శాంతి విధానం మీద

6. శాంతిని కాపాడడంలో, ముఖ్యావసరమైన అన్ని దేశాల కార్మిక వర్గం మీద

దాడి సలిపి యుద్ధాన్ని ప్రేరేపించే

(జర్మనీ) హిట్లరు

(జపాన్) చక్రవర్తి హిరోటా



(ఇటలీ) ముస్సోలినీ.

7. శాంతిని భంగపరచుదామని ఏ కారణం చేతనైతేనేం-ఉద్దేశ్యంలేని దేశాల మంచితనం మీద

విదేశనీతిలో మనపార్టీ చేయవలసిన కర్తవ్యాలు.

1. శాంతనీతిని కొనసాగిస్తూ, అన్నిదేశాలతో వర్తక సంబంధాలను బలపరచుట

2. తమకోసం ఇతర్లను నిప్పులలోకి దూకించుటలో అలవాటుపడ్డ యుద్ధ ప్రేరేపకులవల్ల తగాదాలలో చిక్కుకొకుండా మనదేశం జాగ్రత వహించి ఉండుట

3. సాధ్యమైనంతదాకా, రెడ్‌ఆర్మీని, రెడ్ నేవీని, బలపరచుట

4. శాంతిలోను, వివిధజాతుల సఖ్యతలోను ఆసక్తిగల, అన్నిదేశాల కార్మిక వర్గంతో అంతర్జాతీయ స్నేహపు టొడంబడికలను బలపరచుట.

# మన పార్టీని ఏవిధంగా బలపఱచాలి?

కామ్రేడ్ స్టాలిన్

[18 వ పార్టీ కాంగ్రెసులో స్టాలిన్ గానించిన ఉపన్యాసం 3 భాగాలు. మొదటిది ప్రపంచ రాజకీయాల గురించి. రెండవది సోవియట్‌లో జరిగిన అభివృద్ధిని గురించి. మూడవది పార్టీని గురించి. మొదటిది పూర్తిగా ప్రకటించాం. మూడవ భాగం క్రింద ఇస్తున్నాం. స్థలాభావం వలన. ఈ మూడవ భాగంలో ఒకటి రెండు పేరాలు మాత్రం వదలి వేశాం.—సం.]

రాజకీయ విధానం ననుసరించిడదైనందిన ఆచరణాకార్యము ననుసరించి ఈ అయిదేండ్ల లోనూమన పార్టీపోకడకు సంపూర్ణ విజయం కలిగింది (చాలాసేపు చప్పట్ల తుపాను)

మన పార్టీ విధానం నడచిన పంధా సరియైనదనీ, పార్టీనాయకత్వం సరియైనదనీ, తెలియజేసే ముఖ్యమైన విషయాలు విజయాలు చూడండి. సంపూర్ణంగా ఆర్థిక విధానంలో సోషలిస్టు విధానం నిర్మించుట. నూతన టెక్నిక్‌తో పరిశ్రమ వ్యవసాయం పూర్తిగా పునర్నిర్మించుట. అనుకున్న కాలానికి ముందుగానే రెండవ పంచవర్ష ప్రణాళికను పూర్తిచేయుట. 70.000 లక్షల పూడ్ల వరకు ధాన్యపుపంట పెంపొందించుట, నిరుద్యోగం దారిద్ర్యం నిర్మూలించుట, ప్రజల భౌతిక వైజ్ఞానిక జీవిత పరిమాణాన్ని హెచ్చించుట.

ఈ విధంగా విజయపరంపరలు కురుస్తుంటే మన పార్టీ విధానాన్ని వ్యతిరేకించే అన్నివిధాల 'లెఫ్టిస్టులు' 'రైటిస్టులూ' ట్రాట్కీ, ప్యాటకావ్, బుఖారిన్, రైకావ్ మొదలగు నైతిక పతితులంతా తోకముడుచుకొని, వెనుకడుగిడి దాక్కోవలసివచ్చింది. ప్రజాభిప్రాయానికి లొంగిపోయే మానవత్వం లేక మెన్షివిక్కులతోను, సోషలిస్టు రివల్యూషనరీలతోను. ఫేసిస్టులతోను కలసిపోవడం మంచిదనీ. విదేశ కుట్రదారుల చేతిలో కీలుబొమ్మలై. గూఢచారులుగా అమ్ముడుపోయి. సోవియట్ యూనియన్ శత్రువులకు సహాయంచేసి, మన దేశాన్ని రద్దుచేసి, కేపిటలిస్టు బానిసత్వాన్ని మళ్లా పునరుద్ధరింపడం మంచిదనీ - ఇలా తయారయ్యారు.

మనపార్టీ విధానాన్ని వ్యతిరేకించినవారు ప్రజా శత్రువులుగా మారిపోయారు. ఇలా వారి అవమానకర పాత్ర ముగిసింది.

ప్రజా శత్రువులను నాశనం చేశాక. పార్టీ నుండి కుళ్లను తొలగించాక, నైతిక పతితుల సంఘాలను రద్దుచేశాక, మనపార్టీ రాజకీయంగాను, సంఘటనలోను ఇంకా బాగా ఐక్యతను కల్గి బలపడింది; పార్టీ, దాని సెంట్రల్ కమిటీ చుట్టూ చాలాఐక్యతతో పెనవేసికొంది. (చప్పట్ల వర్షం. ప్రతినిధులందరూ లేచి అధ్యక్షునికి హర్షధ్వానాలు తెల్పుతారు. "కామ్రేడ్ స్టాలిన్‌కు విజయమ్మగుగాక, కామ్రేడ్ స్టాలిన్ చిరస్థాయి యగుగాక, సెంట్రల్ కమిటీకి విజయమగుగాక" అని హర్షధ్వానాలు )

పార్టీ యొక్క అంతరంగిక జీవితాన్ని వాస్తవిక విషయాలను పరిశీలిద్దాం. ఈ 5 ఏండ్లలో సంఘటనకు, ప్రచారానికీ సంబంధించిన పనిని గూడా పరిశీలించుదాం.

### పార్టీ నిర్మాణాన్ని అభివృద్ధిచేసే విధానం.

★

### సంఘ విభజన

★

### క్రింది సంఘాల పనులకూ నాయకత్వం వహించిన సంఘాలకూ దగ్గర సంబంధం.

పార్టీని, పార్టీయొక్క ముఖ్య అంగాలను బలపరచుట రెండు విధానాల ద్వారా జరిగింది: పార్టీయొక్క నిర్మాణాన్ని రెగ్యులేట్‌చేయుట ద్వారా; నమ్మదగనివారిని తొలగించుట ద్వారా; మంచివారిని ఏరుకొనుటద్వారా; సంఘాలను విభజించి. వాటిని పరిమితిలో తగ్గించుటద్వారా; క్రింది సంఘాల దైనందిన, నిర్ణీత కార్యంతో నాయకత్వం వహించిన సంఘాలను చాల సన్నిహితంగా లాక్కొని వచ్చుటద్వారా; మన పార్టీని బలపరచాం.

17 వ పార్టీ కాంగ్రెసుకు (గతసమావేశం) లో 1,874,488 పార్టీమెంబర్లు ప్రతినిధులుగా హాజరయ్యారు. అంతకుపూర్వం జరిగిన కాంగ్రెసుకు అంటే 16 వ కాంగ్రెసుకు హాజరయిన వారితో ఈ సంఖ్యపోలిస్తే ఈరెండు కాంగ్రెసుల జరిగిన మధ్యకాలంలో 600,000 మంది క్రొత్తమెంబర్లు పార్టీలో చేరారని బోధపడుతుంది. 1930-33 సంవత్సరాలలోనున్న పరిస్థితుల ననుసరించి ఆవిధంగా ప్రజాప్రవాహం పార్టీలోచేరటం. వాంఛనీయమైందికాదు. క్షేమకరమైనదికాదు. అని పార్టీభావించక తప్పినది కాదు. గౌరవనీయులు, పార్టీఅంటే భక్తికలవాడూ మాత్రమేగాక, తమ వ్యక్తిగత లాభాల కొరకు పార్టీటిక్కెట్టును ఉపయోగించదలచిన కెరియరిస్టులు పార్టీలో చేరారని పార్టీకి తెలుసు. పార్టీ సంఖ్యను బట్టిగాక ముఖ్యంగా పార్టీమెంబర్ల గుణాలనుబట్టే, పార్టీబలముంటుందని పార్టీ గ్రహించక తప్పిందికాదు. ఇది పార్టీని 'రెగ్యులేట్' చేయవలసిన ఆవశ్యకతనుగూర్చిన ప్రశ్న లేవనెత్తింది. పార్టీమెంబర్లను ఎన్నిక మెంబర్లను శుద్ధిచేయడానికి 1933 లో ప్రారంభించాము, శుద్ధి 1935 మే వరకు కొనసాగింది. ఇంతేగాక క్రొత్తమెంబర్లను చేర్చుకోగూడదనికూడ నిశ్చయింపబడింది. 1936 సెప్టెంబరువరకు క్రొత్తమెంబర్లను చేర్చుకోడంకూడ ఆపివేయబడింది. 1936 నవంబరునుండినే మళ్ళా క్రొత్త మెంబర్లను చేర్చుకోవడం ప్రారంభమయింది. కామ్రేడ్ కిరావ్‌ను దారుణంగా హత్యగావించిన తర్వాత అనుమానాస్పదులగు వారలు పార్టీలో చాలమంది ఉన్నారని తేలింది. దానితోపార్టీమెంబర్ల రికార్డు సమన్వయించుకూడదమూ క్రొత్తవాటికి బదులు పాతపార్టీకార్డులను మార్చడమూజరిగింది ఇవికూడా 1936 సెప్టెంబరువరకూఉన్నాయి. ఇది జరిగాకే తిరిగి క్రొత్త పార్టీలో సభ్యులను ఎన్నిక సభ్యులను జేర్చుకోవడం ప్రారంభమయింది. ఈ పనులన్నీ గావించడం వలన, "పాసివ్, ఛాన్సు, కెరియరిస్టు" సభ్యులనూ, విరోధ సభ్యులనూ తరిమి, మంచి గట్టి సభ్యులను పొందగలిగాము. శుద్ధిచేయడములో గొప్ప పొరపాట్లు ఏమీ జరగలేదని చెప్పము. నిస్సందేహంగా, మనమనుకొన్న దానికంటె ఎక్కువ పొరపాట్లు జరిగాయి. మళ్లా ఈ శుద్ధిని వందలకొలది చేయవలసిన ఆవశ్యకత ఇపుడు లేదు. 1933-36 లో శుద్ధి తప్పనిసరి. దాని ఫలితం మొత్తంమీద లాభదాయకం. ఈ 18 వ కాంగ్రెసుకు ప్రాతినిధ్యం 1,600,000 మంది అంటే 17 వ కాంగ్రెసు ప్రతినిధులకంటె 270,000 మంది తక్కువ అన్నమాట. దాంట్లో తప్పేమీ లేదు. పైగా ఇదంతా మంచికే పార్టీ అనుచరులలో కుళ్లను తుడిచివేయడంవలన పార్టీ బలపడుతుంది. మన పార్టీ ఇపుడు కొంచెం సంఖ్యలో తక్కువేగాని గుణంలో చూస్తే చాలా మంచిది.

ఇది ఒక గొప్ప విజయం.

క్రింది సంఘాల పనితో దగ్గర సంబంధం కల్గించుటద్వారాను, పనిని విస్పష్టపరచుట ద్వారాను, పార్టీయొక్క దైనందిన నాయకత్వాన్ని వృద్ధిపరచుటను గురించి. పార్టీ ఈ క్రింది నిర్ణయాలకు వచ్చింది. సంఘాలను నడపాలంటే, నాయకత్వంలో జీవం గల్గాలంటే నాయకత్వం ఆచరణయోగ్యంగాను విస్పష్టంగానూ ఉండాలంటే, సంఘాలను ఇంకా విభజించి వాటి పరిమితిని తగ్గించాలి. ఇదే సులభమైన మార్గం. ఈవిధానం 'పీపుల్సు కమీసారియట్సు' విషయంలోనూ వివిధ పరిపాలనా సంఘాలలోను, యూనియన్ రిపబ్లికులలోనూ, రాష్ట్ర, జిల్లాలలోనూ అమలు పరచబడింది. దాని ఫలితంగా 7 యూనియన్ రిపబ్లిక్కులకు బదులుగా 11 ఏర్పడ్డాయి. 14 పీపుల్సు కమిస్సారియేట్సుకు బదులుగా 34 గురు ఏర్పడ్డారు. 70 దేశ, రాష్ట్ర విభాగాలకు బదులు 110 ఏర్పడ్డాయి. 2559 పట్టణ పల్లె జిల్లాలకు బదులు 3815 ఏర్పడ్డాయి. దీనితోపాటు నాయకత్వం వహించే పార్టీ సంఘ విధానపరిమితిలోనే. 11 సెంట్రల్ కమిటీలతో గూడిన సి. పి యస్. యు. (బి) [(బోల్షివిక్కు) కమ్యూనిస్టు పార్టీ ఆఫ్ సోవియట్ యూనియన్) యొక్క సెంట్రల్ కమిటీయు, 6 దేశీయ కమిటీలు, 104 రాష్ట్ర కమిటీలు, 30 ప్రదేశ కమిటీలు, 212 పట్టణ కమిటీలు, 336 పట్టణ జిల్లా కమిటీలు, 3479 పల్లె జిల్లాకమిటీలు, 113,060 సాధారణ (ప్రైమరీ) పార్టీ సంఘాలు మనం కల్గియున్నాం.

సంఘాలను విభజించడం ఇంకా పూర్తి అయిందని చెప్పలేం. ఇంకా ఇది కొనసాగవచ్చు. కాని ఒకసంగతి అపుడే తేలింది. మంచి ఫలితమే కల్గింది. దైనందిన నాయకత్వములో అభివృద్ధి, క్రింది సంఘాల విస్పష్ట కార్యక్రమంతో నాయకత్వం దగ్గరగాఉండటమూ జరిగింది. వందలకొలది ప్రజలను ఉన్నతాధికారాలకు ఈసంఘ విభజన లాగిందని వేరే చెప్పనక్కర లేదు.

ఇదికూడా ఒకగొప్ప విజయం.

### సాధారణ సభ్యులను (కేడర్సు)ను ఎన్నుకొనుట, ప్రమోట్ చేయుట, పని విభజించి అప్పజెప్పుట.

పార్టీనిర్మాణాన్ని "రెగ్యులేటు" చేయుట. సంఘాలకూ క్రింది సంఘాలకూ, దగ్గర సంబంధం ఏర్పరచుట, మాత్రమే పార్టీని పార్టీ నాయకత్వాన్ని బలపరచటంకాదు. ఈ 5 సంవత్సరాలలో పార్టీని బలపరచడానికి అవలంబించిన మరొకవిధానం ఉంది, అది సాధారణ సభ్యుల (కేడర్స్) కు ట్రైనింగు ఇచ్చుటలో తీవ్రమైన అభివృద్ధి. సాధారణ సభ్యులను (కేడర్సు) ఎన్నుకొనుట, ప్రమోట్‌చేయుట, పని విభజించి అప్పజెప్పుట, వారివారికి అప్పజెప్పిన పనిని సరిగా నిర్వర్తించుచున్నారోలేదో పరీక్షించుట- ఈ పద్ధతులలో తీవ్రమైన అభివృద్ధిజరిగింది.

పార్టీ సాధారణసభ్యులు (కేడర్స్) పార్టీ నాయకత్వం వహించుతారు, మనపార్టీ అధికారంలో ఉందిగనుక దేశంయొక్క ప్రధాన భాగాలను పరిపాలించువారుగా వారు మారుతారు. ఒక తిన్నని రాజకీయవిధానం అమలు జరిపాక, ఆచరణలో పరీక్షించి చూచాక, పార్టీసాధారణ సభ్యులు పార్టీని, దేశాన్ని, నడుపుటలో ఒక ప్రధానశక్తి యవుతారు. సరియైన రాజకీయ పంథా అనేది ప్రధానమైన చాలముఖ్యమైన విషయం. కాని అంతమాత్రాన చాలదు, ఒక సరియైన రాజకీయపంథా అంటే అది ఒక ప్రకటన మాత్రంగా ఉండేదికాదు. అది ప్రయోజనకారిగా ఆచరించడానికి వీలుగా ఉండాలి. ఒక సరియైన రాజకీయ పంథాను ఫలప్రదంగా అనుసరించాలంటే పార్టీ రాజకీయపంథాను అర్థంచేసుకునే ప్రజలు, సాధారణసభ్యులు (కేడర్స్). పార్టీపంథానేతమ పంథాగా అంగీకరించేవారు, పార్టీవిధానాన్ని ఫలప్రదం జేయడానికి తయారైనవారు, పార్టీవిధానాన్ని ఆచరణలో పెట్టడానికి శక్తిగలిగినవారు, పార్టీ విధానానికి జవాబుచెప్పగలవాళ్ళు, రక్షించేవాళ్ళు దానికొరకు పోరాడేవాళ్ళు మనకు కావాలి. ఇదే లేకపోతే ఒక సరియైన రాజకీయవిధానంకూడా నామమాత్రమే అవుతుంది.

ఇక్కడ మళ్లా మనకు, కేడర్స్(సాధారణ సభ్యులు) ను ఎన్నుకోవడంలో, తరబీయతు ఇవ్వడములో, పనిని విభజించి, వారి కిచ్చిన పని సరిగా నిర్వర్తించుచున్నారో లేదో కేడర్స్ (సాధారణ సభ్యులను) పరీక్షించుటలో, సరిగా ఉన్నామా అనే ప్రశ్న ఉదయించుతుంది.

కేడర్సును సరిగా ఎన్నుకోవడం అంటే ఏమిటి?

సరిగా ఎన్నుకోవడం అంటే, ఒకనిచుట్టూ, అసిస్టెంటులు సబ్ అసిస్టెంటులూ, చేరడము,



ఒక ఆఫీసు పెట్టి ఆర్డర్ తర్వాత ఆర్డర్ ను పంపడమూ కాదు (నవ్వు) లేక ఒకడు తన అధికారాన్ని దుర్వినియోగపరచి, వందలకొలది వేలకొలది ప్రజలను వరుసావళీ లేకుండా ఒకపని నుండి ఇంకో పనికి, వెనక్కి, ముందుకూ నెట్టి, అంతులేని 'పునర్నిర్మాణాలు' కావించడంగాదు (నవ్వు) సరిగా కేడర్స్ (సాధారణ సభ్యుల) ను ఎన్నుకోవడం అంటే :—

1. సాధారణ సభ్యులంటే పార్టీకి, ప్రభుత్వానికి బంగారు నిధులు గాయెంచి నిలవజేయడం, వారిని గౌరవించడం.

2. సాధారణ సభ్యుల తత్వాన్ని పరిశోధించి, వారి లోపాలు, గుణాలు అవగాహనం చేసికొని, ఏ పనిలో వారిని నియ్యమిస్తే వృద్ధి పొందుతారో తెలుసుకోవడం.

3. జాగ్రత్తగాసాధారణసభ్యుల్ని ప్రోత్సాహపరచి, అభివృద్ధికి రాగల వర్కర్లను ముందుకు పోవడానికి సహాయపడటం, కాలం ఖర్చవుతుందని 'బాధపడక' అలాంటి వర్కర్ల అభివృద్ధిని త్వరితంగా పెంపొందించడం.

4. తగు సమయంలో యువకులూ, క్రొత్తవారు అయినవారిని ధైర్యంగా ప్రోమోట్ చేయడం. అలా చేయడంవల్ల వాళ్ళు తమ పూర్వపు పదవులలో పాతబడి, వృద్ధికిరాకుండా నిలిచిపోవడం అనేది ఆగిపోతుంది.

5. ప్రతివాడూ తాను తగిన పదవిలో ఉన్నానని తలిచేటట్లు, ప్రతివాడూ తను ఎంత చేయగల్గడానికి వీలుంటుందో, అంత మన ఆశయాన్ని పూర్తి చేయడానికి సేవజేయాలని తలిచేటట్లు, పని విభజించి ఈయడం. పార్టీ రాజకీయ విధానాన్ని పూర్తిచేయడానికి అప్పజెప్పిన పని ననుసరించి. పార్టీ రాజకీయ విధానాన్ని పూర్తిగా నెరవేర్చగలిగే ధోరణిలో సభ్యులకు పని విభజించాలి.

ప్రత్యేకంగా ప్రాముఖ్యమైన విషయమేమంటే క్రొత్తవారినీ యువకులను, ధైర్యంగా తగుకాలములోప్రమోట్‌చేయడం. మనవాళ్ళకింకా ఈవిషయం బోధపడినట్లులేదు. కొంతమంది మనం ఎన్నుకోడంలో ప్రాతసభ్యుల (కేడర్సు) పైనే ముఖ్యంగా ఆధారపడివుండాలని అనుకొంటారు. మరి కొందరు దానికి విరుద్ధంగా ఒక్క యువకులపైననే ఆధారపడి ఉండాలని భావిస్తారు. ఇది నాకు ఇద్దరూ పొరబడ్డారని తోస్తుంది.

ప్రాతసభ్యులు పార్టీకి ప్రభుత్వానికి విలువగల ఆస్తి. యువకసభ్యులకు లేని విశేషం వీరికొకటి ఉన్నది అది నాయకత్వంలో అద్భుతమైన అనుభవము. మార్క్సిస్టు లెనినిస్టు సిద్ధాంతాలను బోధించగల శక్తి, పరిస్థితులను అవగాహనచేసికోడం, సిద్ధాంతాలకు భాష్యమొనరింపగలశక్తి. కాని మొదటివిషయం ఏమంటే తగినంతమంది పాతసభ్యులు లేరు, మనకు ఎంతమంది కావాలో అంతకు తక్కువవున్నారు, ప్రకృతి స్వభావం వలన చాలమంది పనిని నిర్వహించలేక పోతున్నారు. రెండవది ముసలవాళ్ళలో కొందరు గతంమీదనే ఎక్కువ మమతఉంచిపట్టుబడతారు, గతాన్నిబట్టుకొనేవ్రేలాడుతారు, పూర్వపు ప్రపంచంలోనే మునిగిపోయి, జీవితంలో నూతన తత్వాన్ని చూడలేక పోతున్నారు. దీనినే నూతన తత్వాన్ని గుర్తించలేకపోవడం అంటారు. ఇది చాలాతీవ్రమైన ప్రమాదమైన దోషము. యువకులకు ముసలివాళ్ళలాగా అనుభవము పరిజ్ఞానమూ పరిస్థితుల నెరిగియుండుట లేదన్నమాట నిజమే. కాని,

1. యువకులు అధిక సంఖ్యాకులు.

2. వారు యువకులు, పని నిర్వర్తించలేని అపాయానికి ఇంకా వారు గురి కాలేదు.

3. నూతనత్వాన్ని గ్రహించగల కావలసినంత ఆసక్తి ఉంది వారికి. ఇది ప్రతి బోల్షివిక్ వర్కరుకు చాలా విలువ అయినది. యువకులు త్వరగా జ్ఞానాన్ని సంపాదించుతారు. ఎపుడూ ముందుకే పోతూ, ప్రాతవారి స్థానాన్ని తీసుకోగల్గటమే గాక, వారితోపాటు ప్రక్కప్రక్కనే పని చేయగలిగే సమయం ఎంతో దూరాన లేదు. కాబట్టి, ప్రాతవారిపైనా, క్రొత్తవారిపైనా ఆధారపడటం అనునది ప్రశ్న కాదు. పార్టీయొక్క, ప్రభుత్వంయొక్క నాయకత్వంలో ఒక వరుసలో ముసలివారినీ, యువకులనూ కలిపిన ఒక ముఠాను తయారు చేయడమే నేటిపని (చాల సేపు చప్పట్లు)

ఇందుకోసమే మనం తగు సమయంలోనూ, ధైర్యంగానూ, యువకులను ప్రోమోట్ చేయాలి.

ఈ 5 ఏండ్లలో నాయకత్వాన్ని బలపఱచడానికి కేడర్సును(సాధారణ సభ్యులను)ఎన్నుకొనుటలో పైనుంచి క్రిందికి, ముసలివారినీ, యువకులనూ కలపడానికి ప్రయత్నించింది. ఇది విజయాలలో ఒకటి.

సెంట్రల్ కమిటీవద్ద నున్న లెక్కల ననుసరించి, ప్రభుత్వోద్యోగాలకు, పార్టీ పదవులకు 500,000 మంది యువక బోల్షివిక్కులను, పార్టీ మెంబర్లను, పార్టీకి సమీపంగా నున్న వారినీ ప్రమోట్ చేశాం. అందులో నూటికి 20 మంది స్త్రీలు.

ఇప్పుడు మన కర్తవ్యం ఏమిటి? నఖశిఖ పర్యంతం కేడర్సును (సాధారణ సభ్యులు) ఎన్నుకొనుటలో మనం పని కేంద్రీకరించడం. ఒక సంఘం చేతిలోపెట్టి దానిని సరియైన సైంటిఫిక్ బోల్షివిక్ స్థాయికి తీసుకురావడం.

అంటే పరిశీలించడం, వృద్ధిచేయడం, వివిధ శాఖలోకి ఎన్నుకోడం, మొదలైన పనులతో విభజన లేకుండా ఒకేసంఘంలో కేంద్రీకరించడం అన్నమాట.

ఈసంఘం సోవియట్ యూనియన్ కమ్యూనిస్టు పార్టీ (బోల్షివిక్) సెంట్రల్ కమిటీ యొక్క పరిపాలనా సభ్యులు (కేడర్స్)న్నూ, ప్రతి రిపబ్లిక్ దేశ, రాష్ట్ర పార్టీ సంఘాలలో నున్న సభ్యులున్నూ, అన్నమాట.

### పార్టీ ప్రచారం.

★

### పార్టీ మెంబర్లకు, కేడర్సుకు మార్క్సిస్టు లెనినిస్టు తర్ఫీదు.

పార్టీపనియొక్క కర్తవ్యం మరొకటిఉంది. అది చాలా ముఖ్యమైనది బాధ్యతగలది. గత 5 ఏండ్లలో, ఈపని పార్టీని, దాని ప్రధాన సంఘాలను బలపరచింది ఆపని ఏమిటంటే, పార్టీ పచారము, వ్రాతపూర్వకంగాగాని ఉపన్యాసాల ద్వారాగాని ఆందోళన, పార్టీ మెంబర్లను కేడర్సును మార్క్సిజం, లెనినిజం అనుసరించి తర్ఫీదు చేయడం, పార్టీయొక్క వర్కర్ల యొక్క రాజకీయ సైద్ధాంతికస్థాయిని హెచ్చించడము.

పార్టీ ప్రచారాన్ని గురించీ, మార్క్సిస్టు, లెనినిస్టు తర్ఫీదును మన ప్రజల కివ్వడానికి సంబంధించిన అత్యంత ప్రాముఖ్యతమగూర్చి నేను వేరే చెప్పనవసరంలేదు. నేను ఒక్క పార్టీని గురించే చెప్పడంలేదు. యంగ్ కమ్యూనిస్టులీగ్, ట్రేడ్‌యూనియన్, ట్రేడ్ కోపరేటివ్,ఆర్థిక, ప్రభుత్వ, విద్యా,నైనిక(మొదలగు) సంఘాలను గురించికూడా మాట్లాడుతున్నాను. పార్టీ నిర్మాణాన్ని రెగ్యులేట్ చేయవచ్చు, నాయకత్వంవహించే సంఘాలు క్రింది సంఘాలతో సంతృప్తికరంగా దగ్గర సంబంధం పెట్టుకోవచ్చు; కాని ఇవన్నీ ఉండినా, మనపార్టీ ప్రచారం ఏకారణంవల్లనైనా కుంటువడితే: మన కేడర్సుకు మార్క్సిస్టు—లెనినిస్టు తర్ఫీదు గనుక వెనుకబడితే; ఈకేడర్సుకు రాజకీయ, సైద్ధాంతికస్థాయి నశించిపోతే;వీరివల్ల కేడర్సుకు మన భవిష్యదభివృద్ధిలో అభివృద్ధియే గన్పించకపోతే; మన ధ్యేయంయొక్క సత్యాన్నే వారు గ్రహించలేకపోతే, ఎట్టి దృక్పధంలేని మందమతులుగా తయారయి పైనుంచివచ్చే ఆర్డర్లను గ్రుడ్డిగాను, మెకానికల్‌గాను అమలుపరిచే వారిగా తయారయితే—మన ప్రభుత్వమూ పార్టీపనీ తప్పక బలహీనపడుతుంది.

ప్రభుత్వపనిలోగాని, పార్టీ పనిలోగాని, ఏ శాఖలోనైనా పనిచేసే వర్కర్లకు మార్క్సిస్టు లెనినిస్టు చైతన్యం, రాజకీయ పరిజ్ఞానస్థాయి ఎంత హెచ్చితే అంతమంచిదని, పని చాలా ఫలప్రదంగా జరుగుతుందని, ఫలితాలు జయప్రదంగా వస్తాయని, ఒప్పుకు తీరాలి. అదే విధంగా మార్క్సిస్టు లెనినిస్టు చైతన్యం ఎంత తగ్గితే, రాజకీయ పరిజ్ఞాన స్థాయి ఎంత తగ్గితే అంతగా పనిలో అపజయమూ, వినాశనమూ హెచ్చుతుంది. వర్కర్లలో బుద్ధి మాంద్యం హెచ్చి పట్టి మందమతులుగా తయారవుతారు నైతిక పతనంకూడా సంభవిస్తుంది.

మన పనియొక్క అన్ని శాఖలలోను కేడర్సుకు సిద్ధాంతంలో తర్ఫీదు నీయాలి. రాజకీయముగా ప్రబోధించాలి. జాతీయ, అంతర్జాతీయ పరిస్థితులలో తమంత తామే దృక్పధము నీయగలవారిగా తయారు జేశామని చెప్పుకొనేంత జయప్రదంగా ఆ తర్ఫీదు, ఆ ప్రబోధమూ ఉండాలి; గొప్ప తప్పిదమేమీ చేయకుండా దేశాన్ని నడుపుటలో సంభవించే సమస్యలను పరిష్కరించగల మార్క్సిస్టు, లెనినిస్టులుగా వారిని తయారు చేయాలి; పైవిధంగా తయారుచేయగల్గితే ఇదివరకే పదింట తొమ్మిదిపాళ్లు పరిష్కరింపబడ్డ సమస్యలను ఆలోచించడానికి తప్పకుండా కారణముండేది. తప్పకుండా దీనిని పూర్తి చేయగలం. ఎందువలన అంటే, మన కలాచేయడానికి అన్ని సాధనాలూ, అవకాశాలూ ఉన్నాయి.

సాధారణంగా యువకుల్ని తర్ఫీదు చేయడం, ఒక ప్రత్యేక సైన్సులోగాని, టెక్నాలజీలోగాని స్పెషలైజ్ (ప్రత్యేకప్రావీణ్యం సంపాదించుట) చేయుటద్వారా జరుగుతున్నది. ఇది అవసరమే. కొందగినదే. ఒకరు వైద్యంలో స్పెషలైజు చేస్తున్నపుడు, ఆయనే అదే కాలంలో ఫిజిక్సులోనూ, బోటనీలోనూ, స్పెషలైజ్ చేయవలసిన అవసరం ఏమిటి? సైన్సులోని అన్నిశాఖలకు సంబంధించిన బోల్షివిక్కులందరూ నేర్చుకోవలసిన మరొక సైన్సు శాఖ ఉంది. అది మార్క్సిస్టు—లెనినిస్టు సాంఘిక శాస్త్రం. సాంఘికపరివర్తనంయొక్క సూత్రాలు, ప్రొలిటేరియన్ విప్లవముయొక్క అభివృద్ధి సూత్రాలు, సోషలిస్టునిర్మాణంయొక్క అభివృద్ధి సూత్రాలు, కమ్యూనిజంయొక్క సూత్రాలు. లెనినిస్టు అని చెప్పుకొనేవాడు తాను "స్పెషలైజు చేసిన విషయంలోగాక ఇతరతావిమీ చూడకుంటా తప్పుమూసుకుంటే అతడు నిజమైన లెనినిస్టు కానేకాడు.ఒక ప్రత్యేకశాస్త్రంలో ప్రత్యేకత సంపాదించినంత మాత్రాన లెనినిస్టు కాజాలడు అతడు రాజకీయ సాంఘిక సేవకుడు కావాలి, అతడు తన దేశంయొక్క ఆశయాలలో పూర్తిగా ఆసక్తి గలిగియుండాలి, సాంఘికాభివృద్ధి సూత్రాలను తెలుసుకొని వాటిని అమలులో పెట్టగలిగివుండాలి. తనదేశ రాజకీయాలని నడపటంలో పాల్గొనటానికి చురుకుగా ప్రయత్నించాలి. ఇదంతా బోల్షివిక్కులై ఒక ప్రత్యేకశాస్త్రంలో కృషిచేస్తున్న స్పెషలిస్టులకు భారమన్నమాట నిజమే. భారం ఎక్కువయినా వచ్చేఫలితాలు మంచివిగాబట్టి భరించాలి.

పార్టీ ప్రచారం చేయడం, కేడర్సుకు మార్క్సిస్టు – లెనినిస్టు తర్ఫీదును ఈయడం, మార్క్సిస్టు లెనినిస్టు సాంఘిక అభివృద్ధి సూత్రాలలో క్షుణ్ణంగా తయారయిన వారిగా అన్ని శాలలోని మన కేడర్సును తయారు చేయడం అన్నమాట.

* * *

### థీరీ (సిద్ధాంతం)నిగురించి కొన్నిప్రశ్నలు

అతి ప్రాముఖ్యమైన కొన్ని విషయాలకు సంబంధించిన సిద్ధాంత సమస్యలలో మన కామ్రేడ్స్‌కు విశదీకరణశక్తి లేకపోవడం, ఈ సమస్యలపై ఎక్కువ గందరగోళం పడటం, ఈ రెండూ మన ప్రచారానికి, సిద్ధాంతానికి సంబంధించిన పనిలోని లోపాలు. నేను చెప్పేది, ప్రభుత్వాన్ని గురించి, ముఖ్యంగా సోషలిస్టు ప్రభుత్వాన్ని గురించి, మన సోవియట్ మేధావి వర్గాన్ని (ఇంటలిజెంటీషియా) గురించి.

ఒక్కొకపుడు అడుగుతూ ఉంటారు: "దోపిడీచేసే వర్గాలను మనం రద్దుచేశాం; దేశములో ఇపుడు శత్రువర్గం లేదు; మనం అణచవలసినవారెవరూ లేరు; కాబట్టి ప్రభుత్వం యొక్క ఆవశ్యకత లేదు; ప్రభుత్వం రద్దు కావాలి. కాబట్టి మనం సోషలిస్టు ప్రభుత్వాన్ని ఎందుకు రద్దు చేయకూడదు? మనం దానిని నిర్మూలించడానికి ఎందుకు పూనుకోరాదు? ఈ ప్రభుత్వమూ- ఈ మట్టి మశానమూ - తుడిచి వేయడానికి ఇది సమయముకాదా?" అని ప్రశ్నిస్తారు.

ఇంకా "మనదేశములో దోపిడీవర్గాలు రద్దు చేయబడినాయి; సోషలిజం ముఖ్యంగా నిర్మింపబడింది; మనం కమ్యూనిజంవైపుకు పోతున్నాం. మార్క్సిస్టు సిద్ధాంతం ప్రకారం కమ్యూనిజం క్రింద ప్రభుత్వంఅనేది ఉండరాదు కదా. కాబట్టి సోషలిస్టు ప్రభుత్వాన్ని రద్దుచేయడానికి మనం ఎందుకు సహాయపడరాదు? ప్రభుత్వాన్ని పురాతన వస్తువుల్ని ప్రదర్శించే మ్యూజియంలోకి ఎందుకు పంపగూడదు" అని ప్రశ్నిస్తారు.

దీనినిబట్టి ఈప్రశ్నలడిగేవారు, మార్క్సు ఎంగిల్సుల "ప్రభుత్వాన్ని" (State) గురించి వ్రాసినసిద్ధాంతాలలో కొన్నిభాగాల్నిబట్టీ పట్టారని తెలియజేస్తుంది. కాని ఇవే ఆసిద్ధాంతాల అంతరంగిక అర్థాన్ని తెలిసికోలేకపోయారని కూడా తెలియజేస్తుంది. ఏ చారిత్రిక పరిస్థితులలో ఈ సిద్ధాంతంయొక్క వివిధ సూచనలు విశదీకరింపబడ్డవో వీరు గ్రహించలేకపోయారు; ఇంతేగాదు, నేటి అంతర్జాతీయ పరిస్థితులను వారర్థం చేసికోలేదు; మనచుట్టూ మూగిన కేపిటలిస్టు దేశాలూ, సోషలిస్టుదేశానికి అవిచేసే హానులూ వారు నిర్లక్ష్యపరచారు. చుట్టూనున్న కేపిటలిస్టు దేశాల బలాన్ని, బూర్జువా దేశాల ప్రాముఖ్యతనూ, మనదేశంలోకి గూఢచారులను వినాశకారులను, హత్యల సలిపేవారిని పంపే టటువంటి బూర్జువా (మిగతా 20 వ పేజీలో)

## స్పైన్ దురవస్థను తెల్పే కళాసంశోభిత చిత్రాలు

★  ★







స్పైన్‌లో ప్రజాస్వామ్య రక్షణార్థం ప్రపంచమందలి అన్ని దేశాల నుండి సోషలిస్టులు కమ్యూనిస్టులు వెళ్లి, 'ఇంటర్నేషనల్ బ్రిగేడ్' ఆధ్వర్యాన పోరాడి, అద్భుత సాహస త్యాగాల్ని ప్రదర్శించారు.

"NATIONAL FRONT"



(1) 1870 జులైలో ఫ్రెంచి బూర్జువా వర్గం ప్రష్యాతో యుద్ధం ప్రారంభించింది. ప్రభుత్వంలో, సైన్యోద్యోగులలో అవినీతి ఎక్కువ. చాలా అపజయాలు సంభవించాయి. చివరకు సెప్టెంబరులో 80,000 మంది సైన్యం లొంగిపోయింది, సరియైన ఆయుధాలు లేని వారవడం



(2) ప్రష్యా యుద్ధ సైన్యం ముందుకు త్రోసారు. ఫ్రెంచి వారు ఓడిపోయారు. మూడవ నెపోలియన్, అతని సైన్యంలో దాదాపు సగం మంది పట్టు బడ్డారు. ప్రష్యనులు పారిస్ మీదకు దాడి వెడలారు.




(3) కాని పట్టణ ప్రజలు 'నేషనల్ గార్డు'ను సంఘటన పఱచారు. అప్పటికే రొండి సరిపోవడం లేదు. ఆకలితో బాధ పడుతూ రొట్టెల దుకాణాలవద్ద బారులుతీర్చి నిలబడ్డారు. కాని వారికి తుపాకుల నిచ్చారు పారిస్‌ను రక్షించమని.



(4) ధనవంతులు దీనిలో ప్రష్యన్లకేగాక ముఖ్యంగా తమకే అపాయం కల్గుతుందని కనిపెట్టారు. ప్రజాసామాన్యంలో విప్లవోద్రేకం హెచ్చింది. బయట శత్రువులనే గాక లోపల బూర్జువానుకూడ ఎదుర్కొ డానికి వారి తుపాకులు ఎగరవచ్చు. వారి వద్దనుండి తుపాకులను లాగుకొనేందుకు ప్రయత్నం జరిగింది. పట్టణమంతా ఈ భయం వ్యాపించింది. పట్టణంలోని కార్మికులు—స్త్రీ పురుషులు—తమ రక్షణకు సంసిద్ధులయ్యారు. ప్రభుత్వ సైనికులు వారిని ఎదుర్కొనేందుకుబదులు సౌభ్రాతృత్వం చూపారు.



(5) మార్చి 18 వ తేదీన 'కమ్యూన్' ప్రకటించబడింది. ప్రభుత్వం తన సైన్యాలతోసహా "వర్సైల్సు"కు పారిపోయింది. ఆ సైన్యాలను జయించటం సులభమే అయినా, పారిస్ నుంచి పారిపోయిన ధనికులను 'హాస్టేజెస్' క్రింద అట్టిపెట్టుకొనేందుకు అవకాశమున్నా కమ్యూనార్డులు వారిని పోనిచ్చారు.



(6) బజార్లలో గుంపులలో క్రొత్త రాజ్యం యొక్క ప్రకటనలు చదువ సాగారు. "రాత్రిళ్లు పని చేయనవసరం లేదు రొట్టెల దుకాణాలలో. ఓడలు వస్తువులు చెల్లించనక్కరలేదు. మత గురువుల అరెస్టు. కట్టివేసిన ఫ్యాక్టరీలు మళ్లీ తెరువబడినయి. కార్మికులపై విధించిన జరిమానాల రద్దు." ఇవన్ని ప్రకటనలలో ఉన్నాయి.



(7) పట్టణం 'అరాండిస్మెంటు' (జిల్లాల) క్రింద విభజింపబడి కమ్యూనార్డుల ఆధ్వర్యం క్రిందికి వచ్చాయి. వారిలో స్త్రీలు, పురుషులు, కార్మికులు, మేధావులూ ఉన్నారు. లెనిన్ చెప్పినట్లు వీరు "క్రొత్తరకపు రాజ్యాన్ని—కార్మిక రాజ్యాన్ని" సృష్టించుచున్నారు.



(8) ఈలోగా వెర్సైల్సులో ప్రభుత్వము, ప్రష్యన్ ఆఫీసర్ల సహాయంతో 'పారిస్ కమ్యూన్'పై దాడిసలుప, ప్లానులు వేశారు. పట్టుకోబడిన వేలకొలది ఫ్రెంచి సైనికులను వదిలివేసి, కమ్యూన్‌పై దాడి సల్పడానికి సాయుధులను గావించుకున్నారు. ఇక్కడ కమ్యూనార్డులుకూడా తయారవుతున్నారు.





(9) "బారికేడ్ల"ను కట్టారు కష్టపడి. కాని పట్టణమంతా రక్షణకు కట్టుదిట్టాలు చేసుకోలేక పోయారు. పారిస్‌లో నున్న బూర్జువా, శత్రువులకు బలహీన ప్రదేశాలు తెలిపాయి. మే 22 నుండి 28 వరకు సైన్యాలు పట్టణంలో ప్రవేశించాయి.




(10) వేలకొలది అక్కడక్కడ చనిపోయారు. వేలకొలది పిల్లలనూ—ముదుసలులనూ—రోగపీడితులను సైతం ఒకచోటకు చేర్చి కాల్చారు. సానుభూతికలదని అనుమానించినవారి నందరినీ చంపారు. కమ్యూన్ రక్తస్రవంతులలో తేలిపోయింది.



(14) కమ్యూన్ తిరిగి బ్రతికింది. 1917 అక్టోబరు (నవంబరు)లో పారిస్ కమ్యూన్ జరిగిన 46 ఏండ్లకు, రష్యన్ కార్మికులు బోల్షివిక్ పార్టి నాయకత్వాన, లెనిన్ ఆధ్వర్యాన మొట్టమొదటి కార్మిక రాజ్యం స్థాపించారు. ఈ "కమ్యూనార్డీలు" స్మోల్నీనుండి లెనిన్ డైరెక్షన్ క్రింద ఫ్యాక్టరీల నుండి, అరోరోనుండి కార్మిక సైన్యాలు



(11) దౌర్జన్యాలకు అంతులేదు. పెరెలా షైజ్ సిమెంటరీ వద్ద, మరొక డజను ప్రదేశాలలో "కమ్యూనార్డల"ను గుంపులుగాచేర్చి కాల్చారు. జనరల్ గాల్లిఫెట్—హంతకుడు — సైనికులు కాల్చుతుంటే ప్రక్కనుండి చూస్తూ నిలబడ్డాడు. చస్తూకూడ వారుధిక్కరించారు. "కమ్యూనార్డుల గోడ"లోని ఒకభాగం ఇంకాఉంది. కమ్యూన్‌వీరుల స్మృతి చిహ్నం అది.




(15, 16) నేవావద్ద గుమిగూడాయి. సైనికులు, నావికులు కార్మిక విప్లవంలో చేరారు. "అధికారమంతా సోవియట్లకే" అనే నినాదంతో బూర్జువా గవర్నమెంటును అణచివేశారు.

లెనిన్ "పారిస్‌కమ్యూన్ మొదటిమెట్టు. సోషలిస్టు సంస్థ సోవియటు యూనియన్‌లో నేడు నిర్మింపబడుతున్నది. ఇది ప్రపంచ కార్మిక కమ్యూన్ కదలికకు ప్రారంభం." అన్నాడు.



(12) జాగ్రత్తగా కారల్‌మార్క్సు కమ్యూన్ పరిస్థితులను పరిశీలించాడు. కమ్యూన్ పడిపోగానే, అది నేర్పిన పాఠాన్ని ప్రపంచ కార్మికులకు తెలియజేశాడు.

"పారిస్ కమ్యూన్, మహోత్కృష్టమగు నూతన సమాజానికి త్రోవదీసినదిగా యెంచి ఉత్సవం జరపాలి." అని అన్నాడు.



(13) మార్చి 18—పారిస్ కమ్యూన్ దినం. కార్మికాభివృద్ధికి ఒకమెట్టు. 1871 నుండి ప్రతిసంవత్సరం ఆదినోత్సవం చేస్తున్నారు.



*Vive la Commune!*

# మన పార్టీని ఏవిధంగా బలపరచాలి?

(13 వ పేజీ తరువాయి)సంఘాలను, సాయుధ సైనికులతో దెబ్బగొట్టడానికి అవకాశంకోసం ఎదురుచూచుచున్న బూర్జువా ప్రభుత్వాలను వారు గుర్తించలేము అని ఈప్రశ్నలు చెబ్బుతున్నాయి. విదేశీదాడినుండి; సోషలిస్టుదేశాన్ని కాపాడుకొనేందుకు అవసరమయిన సైనిక, ప్యూనిటివ్, గూఢచారి శాఖలయొక్క ప్రాముఖ్యతను సోషలిస్టు ప్రభుత్వంయొక్క పాత్రనూ కూడా గుర్తించలేదు. ఇలా గుర్తించకపోవడంలో పైన ఉదహరించిన కామ్రేడ్స్ మాత్రమే గాదు పొరపాటుబడింది. ఈవిషయంలో, బోల్షివిక్కులందరూ, ఎవరినీ మినహాయించకుండా మనలో అందరూ, కొంతవరకు తప్పు (పాపం) చేశామని చెప్పాలి. ట్రాట్స్కీవైట్, బుఖారినైట్ నాయకుల కుట్రలను — అసలీ పెద్దమనుష్యులు అక్టోబర్ విప్లవం నాటినుండే కుట్రకార్యాలు చేస్తున్నారని, విదేశపుగూఢచారి సంఘ సేవలో పనిచేస్తున్నారని సాక్ష్యంవల్ల తేలింది— మనం 1937—38 లోనే తెలిసికోగలిగామంటే ఆశ్చర్యంలేదు. అలాంటి ప్రమాదకరమైన విషయాన్ని మనం ఎలా గుర్తించకుండా ఉండిగలిగినాం? ఈ తప్పిదాన్ని గురించి మన మేం జవాబు చెబుతాం?

ముందుగా చుట్టూయున్న బూర్జువాప్రభుత్వాల బలాన్ని ప్రమాదాన్ని గుర్తించకపోవడము వల్ల ఈప్రమాదం జరిగింది. బూర్జువాప్రభుత్వాలు ప్రజల బలహీనతల్ని, గర్వాన్ని, మనోస్థైర్యం లేనప్పుడు గమనించి వారిని తమ కుట్రల వలలోకి లాగి ... ప్రభుత్వాన్ని ముట్టడించడానికి ఉపయోగించుకోడానికి చేసిన ప్రయత్నాన్ని గుర్తించలేదు. ఇంతేగాదు. సోషలిస్టు ప్రభుత్వంయొక్క ప్రాముఖ్యత గూడా గుర్తించలేదు. గూఢచారుల ప్రాముఖ్యతనుగూడ గుర్తించలేదు. గూఢచారుల ఆవశ్యకతను గుర్తించకపోవడం వలన సోవియట్ ప్రభుత్వంలో గూఢచారుల అనవసరమని, సోవియట్ ప్రభుత్వాన్ని గూఢచారుల శాఖను మ్యూజియంలో పెట్టవచ్చునని చెప్పే వ్యక్తుల సంగతే మనము యున్నదని గుర్తించలేకుండా (అండర్ ఎస్టిమేట్) చేసింది.

ఇలా గుర్తించలేకపోవడానికి కారణమేమై వుంటుంది?

రాజ్యాంగ యంత్రాన్ని గురించిన మార్క్సు సూచించిన కొన్ని సాధారణ సిద్ధాంతాలు అన్ని పరిస్థితులకూ సరిపోనందువల్లనే ఇలా గుర్తింపలేకపోయాం. రాజ్యాంగ యంత్రాన్నిగురించిన సిద్ధాంతాన్ని గురించి మనం చెప్పుకుంటూవున్న నిర్లక్ష్యభావం క్షంతవ్యమైనదికాదు. ఈ సమస్యనుగురించి మనకు 20 సంవత్సరాల అనుభవం ఉన్నప్పటికీ, ఈ వ్యవధిలో సిద్ధాంతాలను గురించి సాధారణ సూత్రాలు ఎన్నో నేర్చుకోడానికి ఎంతో అవకాశమున్నప్పటికీ, ఈ కొరతను తీర్చుకొనేటందుకవకాశాలున్నప్పటికీ, వైవిధంగా జరగడం తటస్థించలేదు. సిద్ధాంతరీత్యా రష్యన్ మార్క్సిస్టులు నెరవేర్చవలసిన విధులనుగురించి లెనిన్ ఇచ్చిన ఆజ్ఞను మనము పూర్తిగా మరచిపోయాం. మార్క్సిస్టు సిద్ధాంతాన్ని ఎప్పటికప్పుడు అభివృద్ధిపరచవలసిన విధి రష్యన్ మార్క్సిస్టులదని అతడు అనేక ... చెప్పాడు. ఈ సందర్భంలో లెనిన్ ... క్రిందివాక్యాలు గమనించతగ్గవి.

...స్టు సిద్ధాంతం ఇదివరకే పరిపూర్ణ..., అభివృద్ధిపరిస్తే గాడుపడుతుం...

దని భావించరాదు. సోషలిస్టులు యదార్థ పరిస్థితుల కనుగుణ్యంగా ముందుకు అడుగువేస్తూ అన్ని మార్గాలా ముందుకు పోవాలంటే, ఎట్టి శాస్త్రజ్ఞానం అవసరమో, అట్టి శాస్త్రముయొక్క ప్రధానసూత్రాలనే మార్క్సిస్టుసిద్ధాంతం మనకు అందజేసిందని మనము గ్రహించ గలిగాము. రష్యా సోషలిస్టులు మార్క్సిస్టు సిద్ధాంతాన్ని స్వతంత్రంగా విశాల పరచడం చాలాఅవసరం. ఎందువల్లనంటే మార్క్సిస్టు సిద్ధాంతము మనకు మార్గ దర్శకంగా ఉపయోగించే కొన్ని సూత్రాలను మాత్రమే ఇస్తుంది. ఈ సూత్రాలు ప్రత్యేక సందర్భాలలో ఇంగ్లండులో వర్తించినట్లు ఫ్రాంసులో వర్తించవు. ఫ్రాంసులో వర్తించినట్లు జర్మనీలో వర్తించవు జర్మనీలో వలె రష్యాలో వర్తించవు."

ఉదాహరణకు సోషలిస్టు రాజ్యాంగ యంత్రంయొక్క అభివృద్ధిని గురించి ఎంగిల్సు చేసిన సిద్ధాంత నిర్ణయనాన్ని పరిశీలించుదాం:

"సమాజంలో అణచబడే వర్గాలు లేకుండా ఎప్పుడైతే చేయగలుగుతామో: ఒకవర్గం మీద మరొకవర్గం అధికారం చెలాయించే పద్ధతి, పూర్వపు ఉత్పత్తి విధానంలోఉండే అవకతవకలవల్ల వ్యక్తులు తమ జీవనోపాధికొరకుచేసే పోరాటం—యివి ఎప్పుడైతే మాయమౌతాయో; వీటితోపాటు పరస్పర స్పర్థలు, వైషమ్యాలు ఎప్పుడు నాశనమవుతాయో-అప్పుడు ఎవరినీ చేసి అణచియుంచవలసిన అగత్యం ఉండదు. అప్పుడు రాజ్యాంగ యంత్రం అనే నిరంకుశ సంస్థయొక్క అవసరం పోతుంది. ఎప్పుడైతే రాజ్యాంగా యంత్రం ఉత్పత్తి సాధనాలన్నిం టినీ సమాజం తరఫున స్వాధీనం చేసుకుంటుందో, అప్పుడు ఆరాజ్యాంగ యంత్రము సమాజమంతటికీ నిజమైన ప్రతినిధి సంస్థ అనిపించుకొంటుంది అందుకు రాజ్యాంగ యంత్రం స్వతంత్రించిచేసే పనులలో యిదే మొదటిది; యిదే చివరది. సమాజంయొక్క పరస్పర సంబంధాలలో రాజ్యాంగ యంత్రము జోక్యం కలిగించుకో నవసరం యికఉండదు. ఒకశాఖ తర్వాత మరొకశాఖలో జోక్యం కలిగించుకోవడం వ్యర్థం అవుతుంది. ప్రజల్ని పరిపాలించే విధానంపోయి, దానిస్థానే వ్యవహారాలను నిర్వహించే పద్ధతి వస్తుంది. ఉత్పత్తి విధానాన్ని నడపడమే అప్పటిపనవుతుంది. రాజ్యాంగ యంత్రం నిర్మూలించబడ నవసరం లేకుండా క్రమక్రమంగా వాడిపోతుంది" (Withers away)—["ఆంటీ డూరింగ్" ఇంగ్లీషు ప్రచురణ 315 వ పుట.]

ఎంగిల్సుచెప్పిన యీ నిర్వచనం సరియైనదేనా?

ఔను, సరియైనదే కాని, యీక్రింది రెండు షరతులలో ఏదో ఒకటి జరగాలి. 1. అంతర్జాతీయ పరిస్థితుల్ని పరిశీలించకుండా దేశాన్ని రాజ్యాంగ యంత్రాన్ని అంతర్జాతీయ స్థితిగతుల నుండి వేరుచేసి, దేశంయొక్క ప్రత్యేకాభివృద్ధి మాత్రమే దృష్టిలో ఉంచుకొని సోషలిస్టు రాజ్యాంగ యంత్రాన్ని పరిశీలిస్తే పైసూత్రం నిజం అవుతుంది. లేదా (2) ప్రపంచంయొక్క అన్నిదేశాలలోగాని, అధికసంఖ్య దేశాలలోగాని సోషలిజం వచ్చేసి ఉండాలి. మనచుట్టూ పెట్టుబడిదారీ దేశాలుకాక సోషలిస్టు దేశాలే, ఉన్నట్లు ఊహించుకోవాలి. విదేశ ప్రభుత్వాల దాడినుండి భయపడనవసరం లేకుండా ఉన్నాం అనుకోవాలి. సైన్యాన్ని రాజ్యాంగ యంత్రాన్నీ యిక బలపరచుకో నవసరంలేదని భావించుకోవాలి.

కాని సోషలిజం ఒక్కదేశంలోదే జయమొందినది. అందువల్ల అంతర్జాతీయ పరిస్థితులకు దూరంగా ఉండడం సాధ్యంకాదు. అట్టి పరిస్థితులలో మనకర్తవ్యం ఏమిటి? ఈప్రశ్నకు ఎంగిల్సు సిద్ధాంతం సమాధానమీయలేదు. నిజం చెప్పవలసివస్తే ఎంగిల్సును యీప్రశ్న ఎదుర్కొనేలేదు, కాబట్టి ఆప్రశ్నకతడు జవాబు ఏవిధంగా చెప్పగలడు, అన్నిదేశాలలోనూ, లేదా ఎక్కువ దేశాలలో సోషలిజం ఒకేసారి స్థాపించబడినట్లు అతడు ఊహించుకొని తరవాత ఏమిజరిగేదీ తెలియజేశాడు. కనుక ఎంగిల్సు యే ఒక సోషలిస్టు దేశాన్ని గురించిగాని యే ఒక సోషలిస్టు రాజ్యాంగ యంత్రాన్ని గురించిగాని పరిశోధనచేయలేదు. సర్వసాధారణంగా సోషలిస్టు రాజ్యాంగ యంత్రం ఏవిధంగా అభివృద్ధి పొందుతుందో మాత్రమే ఎంగిల్సు తెలియజేశాడు. సమస్యయొక్క సాధారణ స్వభావాన్ని మాత్రమే అతడు పరిశీలిస్తున్నప్పుడు అంతర్జాతీయ పరిస్థితులకు పూర్తిగా దూరంగా ఉండవలసివచ్చింది.

కాని దీనినిబట్టి తెలిసేది ఏమంటే, సోషలిస్టు రాజ్యాంగ యంత్రాన్నిగురించి ఎంగిల్సుచే చెప్పబడిన సాధారణ సిద్ధాంతం సోషలిజము జయమొందిన ఒకేదేశానికి వర్తించదు. పెట్టుబడిదారీ దేశాలమధ్య యిరుక్కొని, విదేశ రాజ్యాలదాడికి గురిఅయిన ఏ సోషలిస్టుప్రభుత్వం అంతర్జాతీయ పరిస్థితులను నిర్లక్ష్యం చేయజాలదు. చక్కని తరిఫీదు పొందిన సైన్యం, నేరస్థుల్ని శిక్షించడానికి వేర్వేరు సంస్థలు, నైపుణ్యంతో గూడిన రహస్య పోలీసుశాఖ చాలా అవసరం కాబట్టి జయప్రదంగా స్థాపించబడిన సోషలిజాన్ని విదేశ రాజ్యాలదాడినుండి రక్షించడానికి ప్రత్యేక రాజ్యాంగ యంత్రము అవసరంకాక తప్పదు.

మనకంటె 45 లేక 55 సంవత్సరాలకు పూర్వం నివసించిన సుప్రసిద్ధ మార్క్సిస్టు రచయితలందరూ, ఒక్కొక్క దేశంయొక్క చరిత్రలో జరిగే ప్రతి చిన్నఘటన ఎప్పుడు ఏవిధంగా వస్తుందో జ్యోతిషం చెప్పుతారని మనం ఆశించడం పొరపాటు. తాము గతించిన 50 లేక 100 సంవత్సరాల అనంతరం ప్రతి సిద్ధాంత సమస్యకు జవాబు సిద్ధపరచి మన ఉపయోగంకోసం స్పష్టీకరించి, వారి శిష్యులమైన మనం ఒలిచిపెట్టి నోటి కందించబడిన ఆ అరటిపండును సుఖంగా తింటూ ఉండవచ్చునని ఆశించడం ఎంత హాస్యాస్పదం! (అందరూ నవ్వు) కాబట్టి నేటి మార్క్సిస్టు-లెనినిస్టులు సాధారణ సూత్రాలను మాత్రము కంఠతా పట్టించి ఊరుకోనకూడదు. మార్క్సిజముయొక్క సారాంశాన్ని వారు తర్జన భర్జన చేయవలసి యుంటుంది. మనదేశములో స్థాపించబడిన సోషలిస్టు రాజ్యాంగ యంత్రము గత 20 సంవత్సరాలలో గడించిన అనుభవాన్ని మనము జాగ్రత్తతో పరిశీలించవలసి యుంటుంది ఈ అనుభవాన్నీ, మార్క్సిజంయొక్క ప్రధాన సూత్రాలను, ఆధారంగా తీసుకొని ఒక్కొక్క సమస్యను పరిష్కరించడానికి ఆసూత్రాలను ఏవిధంగా ఆచరణలో పెట్టాలో గ్రహించవలసి యుంటుంది. అవసరమైనప్పుడు వాటిని స్పష్టీకరించడం, విపులపరచడం కూడా చేయవలసి యుంటుంది. లెనిన్ అక్టోబరు విప్లవానికీ, సోవియట్ ప్రభుత్వ స్థాపనకూ, కొద్దిమాసాలకు ముందు, 1917 ఆగస్టు లో 'రాజ్యాంగ యంత్రము—విప్లవం" అనే గ్రంధము రచించాడు. రాజ్యాంగ యంత్రాన్ని గురించి మార్క్సు, ఎంగిల్సు చెప్పిన పై ప్రధాన సిద్ధాంతాన్ని బలపరచడానికీ, అవకాశవాదుల తప్పుడు వ్యాఖ్యానాలను ఖండించడానికీ, ముఖ్యముగా లెనిన్ పైగ్రంధము వ్రాశాడు. 1905, 1917 రష్యన్ విప్లవాల అనుభవ ఫలితాలను క్రోడీకరిస్తూ రెండవ సంపుటముకూడా అతడు వ్రాయడానికి పూనుకున్నాడు. మనదేశములో సోవియట్ అధికారము స్థాపించబడినప్పటినుంచీ గడించిన అనుభవాలను అధారముగా తీసుకొని, రాజ్యాంగ యంత్రానికి సంబంధించిన ప్రధాన సిద్ధాంతాన్ని ఆగ్రంధములో విపులపరచి స్పష్టీకరించడమే లెనిన్‌యొక్క ఉద్దేశము. కాని, యీ కర్తవ్యాన్ని నెరవేర్చక ముందు మృత్యుదేవత అతనిని లాక్కుపోయింది. కాని, అతడు సాధించలేని పనిని ఆతని శిష్యులు నెరవేర్చవలసి యుంటుంది. (కరతాళ ధ్వనులు)

మానవ సమాజం రెండు పరస్పర వ్యతిరేక వర్గాలుగా చీలిపోవడం వల్లను దోపిడిచేసే కొద్దిమందికి లాభం చేకూర్చి దోపిడి చేయబడే అధిక సంఖ్యాక ప్రజల్ని అణచియుంచడానికినీ రాజ్యాంగయంత్రం పుట్టింది. ఈ ఉద్దేశము నెరవేరడానికి సైన్యం, జైళ్ళు, కోర్టులు, రహస్యపోలీసుశాఖ, రాజ్యాంగ యంత్రానికి సాధనాలుగా ఉపయోగిస్తూ వచ్చాయి. రాజ్యాంగ యంత్రం చేసేపనులు రెండే. (1) ఒక్కొక్క దేశములో దోపిడీ చేయబడే అధిక సంఖ్యాకప్రజల్ని అణచిపెట్టి యుంచటం (ఇది ప్రధానమైనది.) (2) ఇతర రాజ్యాలకు నష్టం వాటిల్లినప్పటికీ దోపిడిచేసే వర్గముయొక్క భూభాగాన్ని ఎక్కువ చేయడం అనగా అన్యదేశాక్రమణచేయడము లేక యిదివరకే సంపాదించిన విదేశాలను కాపాడడానికి కట్టుదిట్టాలు చేయడం (ఇది ప్రధానమైన పనికాదు.) బానిస పద్ధతిలోను సామంతయుగంలోను, జరిగింది, యిదే. పెట్టుబడిదారీ విధానములోకూడా జరుగుతున్నది యిదే.

పెట్టుబడిదారీ విధానాన్ని నిర్మూలించాలంటే అధికారంలో ఉన్న పెట్టుబడిదారీ వర్గాన్ని పదచ్యుతిజేయడము మాత్రమే చాలదు. దోపిడీగాళ్ళను నిర్మూలించడంతో మన కర్తవ్యము నెరవేరదు. పెట్టుబడిదారీ వర్గముయొక్క రాజ్యాంగ యంత్రాన్ని దానికి సాధనాలుగా ఉపయోగపడే సైన్యాన్ని నిరంకుశాధికారుల్ని పోలీసుదళాన్ని, పూర్తిగా విచ్ఛిన్నముచేసి, ఒక కొత్త రాజ్యాంగ యంత్రాన్ని అనగా సోషలిస్టు రాజ్యాంగ యంత్రాన్ని సృష్టించవలసి యుంటుంది. బోల్షివిక్కులు చేసినది యిదే. ఈవిషయం మన అందరికీ తెలుసు. కాని, యీకొత్త శ్రామిక రాజ్యాంగ యంత్రము పూర్వపు రాజ్యాంగయంత్రముచేసిన పనులలో కొన్ని చేయక తప్పిందికాదు. అట్లు చేయక పోవడము అసంభవము. నూతన ప్రభుత్వానికి కావలసిన అవసరాలు నెరవేర్చితీరాలి. కాని, మన సోషలిస్టు రాజ్యాంగయంత్రము ఎప్పుడూ ఒకే స్వరూపాన్ని కలిగియుంటుందని కాని దాని పనులు ఎప్పుడూ ఒకే స్వభావాన్ని కలిగియుంటాయనిగాని అనుకోవడం పొరబాటు. యథార్థము చెప్పవలసివస్తే మనదేశము నానాటికి పొందుతూన్న అభివృద్ధికీ, అంతర్జాతీయ పరిస్థితుల మార్పుకు, అనుగుణ్యముగా మన రాజ్యాంగ యంత్రముయొక్క స్వరూపం మారుతూన్నట్లు చూస్తూనే ఉన్నాము.



లెనిన్ వ్రాసిన యీ క్రిందివాక్యాలు ముమ్మాటికీ యదార్థము.

బూర్జువా రాజ్యాంగ యంత్రపు స్వరూపము ఒక్కొక్క దేశములో ఒక్కొక్క మాదిరిగా ఉంటుంది. కాని ప్రధాన స్వరూపము మాత్రము ఒక్కటే, అంత్య పరిశీలనలో యీరాజ్యాంగ యంత్రాలన్నీ ఏదో ఒక రకమైన పెట్టుబడిదారీ వర్గపు నియంతృత్వాలే. పెట్టుబడిదారీ విధానాన్ని నిర్మూలించి కమ్యూనిజాన్ని చేరడానికి మనము గడపవలసిన మధ్యకాలంలో రాజ్యాంగయంత్రము ఏన్నెన్నో రకాలుగా మార్పుచెందక తప్పదు. కాని దాని ప్రధాన స్వరూపములో మాత్రము మార్పు ఉండదు. అదే శ్రామికవర్గ నియంతృత్వము (రాజ్యాంగయంత్రము — విప్లవము)

అక్టోబరు విప్లవం తరువాత, మన సోషలిస్టు రాజ్యాంగ యంత్రము రెండు ప్రధాన దశలగుండా అభివృద్ధి చెందింది.

మొదటిదశ అక్టోబరు విప్లవముతో ప్రారంభమయి, దోపిడీచేసే వర్గాలను నిర్మూలించడముతో పూర్తిఅయింది. ఆదశలో మనము నిర్వర్తించిన ప్రధాన కర్తవ్యం ఓడించబడ్డ వర్గాలు తిరుగుబాట్లు చేస్తూంటే వాటిని అణచడము; విదేశ ప్రభుత్వాల దండయాత్రల నుండి దేశాన్ని కాపాడుకోవడానికి నిర్మాణ సహితమైన రక్షణకు కట్టుదిట్టాలు చేసుకోవడము; దేశీయ పరిశ్రమలను, వ్యవసాయాన్ని పూర్వపు స్థితికి తీసుకురావడము; పెట్టుబడిదారీ పరిస్థితులు పూర్తిగా నిర్మూలన కావడానికి తగిన వాతావరణము సృష్టించుకోవడము. వీటి కనుగుణ్యముగా మన రాజ్యాంగ యంత్రము మొదటిదశలో రెండు ప్రధాన విషయాలలో శ్రద్ధ వహించి పనిచేసింది. మొదటిపని ఓడిపోయిన వర్గాలను అణచిపెట్టి యుంచడము. ఈవిషయములో మన రాజ్యాంగ యంత్రానికి, పూర్వపు రాజ్యాంగ యంత్రాలకూ, పైకి మాత్రము ఎట్టిభేదములేదు. పూర్వపు రాజ్యాంగ యంత్రాలుకూడా తిరుగుబాటువార్లను అణచిపెట్టి యుంచేవి. కాని, రెండిటికీ మధ్య ప్రధానమైన తారతమ్యము ఒకటిఉంది. మనరాజ్యాంగ యంత్రము అధిక సంఖ్యాకులైన కార్మిక—కర్షకుల ఉపయోగార్థము, అల్పసంఖ్యాకులైన దోపిడీగాండ్రను అణచియుంచుతూంది; పూర్వపు రాజ్యాంగ యంత్రాలు అల్పసంఖ్యాకులైన దోపిడీవర్గాల ప్రయోజనముకొరకు, అధిక సంఖ్యాకులైన ప్రజాసామాన్యాన్ని అణచియుంచేది. మనము నెరవేర్చిన రెండవపని: విదేశ రాజ్యాలదాడులనుండి దేశాన్ని రక్షించడము. ఈవిషయములో కూడా పూర్వపు రాజ్యాంగ యంత్రాలతో పైచూపులకు మాత్రము పోలిక కనపడుతుంది. తమ తమ దేశాలను ఇతర దేశాల దాడులనుండి కాపాడటానికి ఆరాజ్యాంగ యంత్రాలు కూడా కృషి చేశాయి. కాని, రెండింటికీ ప్రధాన తారతమ్యం ఏమంటే, అధిక సంఖ్యాకులైన మన శ్రామికవర్గానికి లభించిన హక్కుల్ని విదేశ రాజ్యాలు అపహరించ పూనుకొన్నప్పుడు మన రాజ్యాంగ యంత్రం వాటిని రక్షించి, కాపాడింది; పూర్వపు రాజ్యాంగ యంత్రాలు దోపిడీ చేసే అల్ప సంఖ్యాక వర్గాల ఆస్తుల్నీ, హక్కుల్నీ రక్షించాయి. మన రాజ్యాంగ యంత్రం నెరవేర్చిన మూడవ పని, క్రొత్తగా స్థాపించబడ్డ ఆర్థిక విధానం యొక్క వేరు వేరు శాఖలను అభివృద్ధి పరచడానికే, ప్రజలకు సోషలిస్టు సూత్రాల కనుగుణ్యమైన విద్యను తిరిగి ప్రచారం చేయడానికీ, రాజ్యాంగ యంత్రం ఆర్థిక నిర్మాణం విషయంలోను, వైజ్ఞానికాభివృద్ధి విషయంలోను, శ్రద్ధ వహించింది. కాని ఈ దశలో వీటి అభివృద్ధి అంత ఎక్కువ లేదు.

రెండవదశ, పట్టణాలలోను పల్లెలలోనుఉన్న పెట్టుబడిదారీ శక్తుల్ని నిర్మూలించడముతో ప్రారంభమై సోషలిస్టు ఉత్పత్తివిధానం పూర్తిగా జయముందడంతోను, నూతన రాజ్యాంగచట్టం ప్యాసుకావడంతోను అంతమొందింది. ఈదశలో మనం నెరవేర్చిన ప్రధాన కర్తవ్యం ఏమంటే సోషలిస్టు ఆర్థిక విధానాన్ని దేశము అంతటా సుస్థిరంగా స్థాపించి, మిగిలిపోయిన పెట్టుబడిదారీశక్తుల్ని నిర్మూలించడం; ప్రజల వైజ్ఞానిక జీవితంలో పూర్తిగా మార్పు తీసుకొని రావడం దేశాన్ని రక్షించడానికి పూర్తిగా ఆధునిక పద్ధతులమీద సైనిక నిర్మాణం గావించడము. ఈ కర్తవ్యాన్ని కనుగుణ్యంగా మన సోషలిస్టు రాజ్యాంగ యంత్రము మార్పు చెందవలసి వచ్చింది. దేశంలో తిరుగుబాటు శక్తులను అణచి యుంచవలసిన అగత్యం పోయింది. ఎందువల్లనంటే దోపిడీ విధానం నాశనం చేయబడింది; దోపిడీచేసే వారెవరూలేరు; కాబట్టి అణచిపెట్టి యుంచడానికి కూడా ఎవరూలేరు. కాని దానిస్థానే రాజ్యాంగ యంత్రం నెరవేర్పవలసిన ప్రధాన కర్తవ్యం ఒకటి ఏర్పడింది. ప్రజల సమిష్టిఆస్తిని దొంగిలించడానికి వచ్చిన దొంగలనుండి ఆ ఆస్తిని కాపాడాలి. విదేశ రాజ్యాలదాడిని ఎదుర్కొవలసిన అవసరము పూర్వం మాదిరిగానే ఇప్పుడూఉంది. కాబట్టి కమ్యూనిస్టు సైనికదళం, నౌకాదళం, కోర్టులు, జైళ్లు, రహస్య పోలీసుశాఖ ఇవన్నీ నేడు కూడా అవసరం. మనదేశానికి విదేశప్రభుత్వాల చేత రహస్యంగా పంపబడ్డ గూఢచారుల్నీ, హంతకుల్నీ, ఇతర దుర్మార్గుల్నీ తగినవిధముగా శిక్షించడానికి ఇవన్నీ చాలా అవసరం. ఆర్థిక నిర్మాణం విషయంలోను, వైజ్ఞానికాభివృద్ధి విషయంలోను, రాజ్యాంగ యంత్రము యొక్క వేరువేరు శాఖలు చేయవలసిన విధులు ఈరెండవ దశలో చక్కనిఅభివృద్ధిని పొందాయి. ఇప్పుడు మన దేశంలో రాజ్యాంగ యంత్రము నిర్వర్తించవలసిన ముఖ్యమైన విధి ఆర్థిక నిర్మాణము, వైజ్ఞానికాభివృద్ధి వీటిని ఇంకా ఎక్కువగా అభివృద్ధిపరచాలి. సైన్యం, కోర్టులు, జైళ్ళు, రహస్య పోలీసుశాఖ వీటిని విదేశీయులమీద యిప్పుడు ప్రయోగించ నవసరములేదు. దేశము బయటవున్న శత్రువుల నెదుర్కొడానికే వాటిని ఉపయోగించాలి.

నేడు మన దేశంలో ఒక అపూర్వమైన క్రొత్త సోషలిస్టు రాజ్యాంగయంత్రాన్ని చూస్తున్నాము. మానవ చరిత్రలో యెప్పుడూ యెక్కడా, ఇట్టిది స్థాపించబడి యుండలేదు. దీనిస్వరూపం, దీనివిధులు మొట్టమొదటి దశలో మాదిరిగా, యిప్పుడు లేవు.

కాని, అభివృద్ధి ఇక్కడ ఆగిపోదు. రోజురోజుకీ మనం ముందడుగువేస్తూ, కమ్యూనిజం వైపుకు నడుస్తున్నాము. కమ్యూనిజం వచ్చాక కూడ ఈరాజ్యాంగ యంత్రం ఉండవలసిందేనా ఈప్రశ్నకు మనం జవాబు యివ్వవలసి యుంది.

మనం పెట్టుబడిదారీ ప్రభుత్వాల మధ్య ఇరుక్కొని ఉన్నంతకాలం, విదేశరాజ్యాల దాడికి అవకాశం ఉన్నంతకాలం, రాజ్యాంగ యంత్రం ఉండి తీరవలసిందే. దానిస్వరూపం మాత్రం దేశీయ, అంతర్జాతీయ, పరిస్థితుల కనుగుణ్యంగా మారుతూ ఉండాలి.

మనం ఆలోచించవలసి రెండోప్రశ్న మన సోవియట్ విద్యాధికుల్ని గురించి.

ఈసమస్యను గురించికూడా పార్టీ సభ్యులలో అస్పష్టమైన భావాలు, తప్పుడు అభిప్రాయాలు, వ్యాపించి యున్నవి.

సోవియట్ విద్యాధికుల సమస్యపై మన పార్టీ తీసుకొన్న దృక్పథం చాలా స్పష్టంగా ఉన్నప్పటికీ, పార్టీలో వారిని గురించి ప్రతికూల భావాలు నేటికికూడా కనపడుతున్నాయి పార్టీ తీర్మానానికి విరుద్ధముగా కొందరు సభ్యులు సోవియట్ విద్యాధికుల్ని ద్వేషభావంతోను, విదేశస్థుల మాదిరిగాను. కార్మిక కర్షకుల శత్రువులు మాదిరిగాను; చూస్తున్నారు. సోవియట్ ప్రభుత్వం అభివృద్ధి చెందుతూన్న దశలో మన విద్యాధికులు తీవ్రమైన మార్పు చెందారు, వారి దృక్పధం, వర్గస్వభావం పూర్తిగా మార్పు చెందింది. పూర్వంకంటె వారు ప్రజలకు దగ్గరకు వచ్చారు. ప్రజలుగావిస్తున్న ప్రయత్నాలలో వారు పూర్తిగా సహకారము చేస్తున్నారు. ఈ విషయంలో వారికి పూర్వపు బూర్జువా విధాన మందలి. విద్యాధికులకు, కావలసినంత తారతమ్యంకనిపిస్తూంది కాని ఈతారతమ్యాన్ని ఇట్టి సభ్యులు గుర్తించడం లేదు. పూర్వపు ధోరణిలోనే యిప్పుడుకూడ వీరు ఆలోచిస్తున్నారు. జమీందార్లకు, పెట్టుబడివార్లకు వారు సేవచేసే పూర్వపు రోజుల్లో ఏ విధంగా వారిని చూచామో ఆ విధముగానే ఇప్పుడుకూడా చూడ్డం పొరపాటు.

పెట్టుబడిదారీ విధానం అమల్లో ఉన్నరోజులలో, అనగా విప్లవానికి పూర్వం, ధనిక వర్గానికి చెందిన పారిశ్రామిక యజమానులు, వ్యాపారస్థులు, భూస్వాములు, ప్రభువులు వీరిలోనే ప్రధానంగా విద్యాధికులు ఉండేవారు. కొందరు క్రింది తరగతుల విద్యాధికులూ ఉన్నారు. కాని మొత్తంమీద యీవిద్యాధికులందరూ, ధనికవర్గంమీదనే అధారపడి జీవించేవారు, వారికే సేవచేసేవారు. ఈపరిస్థితులలో, ఇప్పటి విద్యాధికులు విప్లవశక్తులు, ముఖ్యంగా కార్మికవర్గం, అపనమ్మకంతోను, శతృభావంతోను, చూడబడడం ఆశ్చర్యంకాదు. కొద్దిమంది వ్యక్తులు కార్మిక వర్గంతో పూర్తిగా కలిసిపోయి, వారి దృక్పధాన్నే కలిగియున్నమాట వాస్తవం. కాని, అట్టివారు చాలా కొద్దిమంది. ఇతర విద్యాధికుల వైఖరిని వారే మాత్రం మార్చగలిగి యుండేవారు.

కాబట్టి, యీరోజున మనదేశంలో క్రొత్తరకమైన విద్యాధికుల్ని చూస్తున్నాం. వీరు సోవియట్ విధానానికి అన్నివిధాలా తోడ్పడుతున్నారు. ప్రజలకూ, వీరికీ చాలా దగ్గర సంబంధం ఏర్పడింది. భక్తి విశ్వాసాలతో వీరు ప్రజాసేవ చేస్తున్నారు.

విద్యాధికు లందర్నీ అపనమ్మకముతోను, శతృభావంతోను, చూడాలి అనేది పాతసిద్ధాంతము. ఈరోజున మాత్రము అది తప్పు సిద్ధాంతము. క్రొత్తగా యేర్పడిన సోవియట్ విద్యాధికులకది వర్తించదు.

ముగింపు

కామ్రేడ్స్! చివరకు మనం గ్రహించవలసిన ప్రధాన విషయం ఏమంటే, మన కార్మిక వర్గము ఒక మనుష్యుని మరొక మనుష్యుడు దోచుకొనే పద్ధతిని నిర్మూలించి, సోషలిస్టు విధానాన్ని దేశంలో సుస్థిరంగా స్థాపించి తన ఆదర్శం ఏవిధంగా సరియైనదో ప్రపంచానికి రుజువు చేయుగల్గింది. ఈ విజయంవల్ల కార్మికుల శక్తిలో మనకుగల విశ్వాసం ఎక్కువౌతోంది. ఎప్పటికైనా కార్మికులు తమఆదర్శాన్ని చేరుకొనగలరు గదా — అనే ఆశ మనలో ఎప్పుడూ ఉంటుంది.

పెట్టుబడిదార్లు, జమీందార్లు, వ్యాపారస్థులు, భూస్వాములు లేకుండా ప్రజలు దేనినీ సాధించలేరని అన్నిదేశాల పెట్టుబడివార్లు వాదేవారు. కాని, మన దేశములో దోపిడీగాండ్రు లేకుండానే ప్రజలు ఏవిధంగా తమ గమ్యస్థానాన్ని చేరుకున్నారో నేడు రుజువుచేస్తున్నారు.

పెట్టుబడిదారీ విధానాన్ని కార్మికులు నాశనముచేస్తే, దానిస్థానాన్ని ఆక్రమించే మరొక విధానములేదని సమస్తదేశ పెట్టుబడిదార్లు సవాలు చేసేవారు. కాని, మన దేశములో కార్మిక వర్గం పెట్టుబడిదారీ విధానాన్ని నాశనము చేయడమే కాకుండా, దానిస్థానే అంతకంటె మంచి విధానాన్ని-సోషలిస్టు విధానాన్ని-ఆర్థిక క్షోభలు, నిరుద్యోగ సమస్య ఎరుగని కొత్త విధానాన్ని—సృష్టించుకొన గలిగారు. ఏవిధముగా యిది సాధ్యమో క్రియలో నిరూపించారు.

రైతులు సోషలిజాన్ని అంగీకరించలేరని సమస్త దేశాల పెట్టుబడిదార్లు పలికేవారు. కాని మనదేశపు సమిష్టి వ్యవసాయ రైతులు జయప్రదముగా సోషలిస్టు మార్గాన నడిచి, ఆమార్గమే సరియైనదని ప్రపంచానికి రుజువు చేశారు.

కార్మికవర్గంలో ఆత్మశక్తిని, ఎప్పటికైన తమవర్గం జయమొంది తీరాలి అనే ఆత్మవిశ్వాసాన్ని, నశింపజేసి వానిపెట్టుబడివార్ల బానిసత్వంలో పడతోయడానికి అన్నిదేశాలలోను పెట్టుబడిదార్లు వారిఏజంట్లు, తీవ్రముగా ప్రయత్నిస్తున్నారు నేటికిహూడా పెట్టుబడిదారీ విధానము యితరదేశాలలో నిర్మూలించబడలేదంటే దానికి కారణము తమ చాకచక్యము కానేకాదు. కార్మికులు ఎప్పటికైనా జయమొంది తీరాలి అనే ఆత్మవిశ్వాసము వారిలో యింకా లేకపోవడమే, ఈవిషయము పెట్టుబడిదారులకు చక్కగాతెలుసు. తమ ఉద్దేశము నెరవేర్చుకొనేటందుకు పెట్టుబడిదారులు చేస్తూన్న ప్రయత్నాలు పూర్తిగా విఫలమౌతున్నాయనడానికి వీల్లేదు. వీరూ; వీరిఏజంట్లు, కార్మికుల్లో అనుమానాలు, శంకలుఅనే విషబీజాలు చల్లి, కొంతవరకు సఫలీకృతులౌతున్నారని అంగీకరించక తప్పదు. కాని, మనదేశములో కార్మికులకు లభించిన దిగ్విజయము పెట్టుబడిదారీ దేశాల కార్మికులలో ఉత్తేజము కలిగించి, పోరాటంద్వారా తాముహూడా జయమొందవచ్చుననే విశ్వాసము కలిగితే, మనపార్టి చేసినకృషి వ్యర్థముకాలేదని చెప్పుకోవచ్చును. ఈవిధముగా జరిగి తీరుతుందనడానికి సందేహం ఏమాత్రములేదు (మిన్నుముట్టే కరతాళధ్వనులు.)

దిగ్విజయమొందిన మన కార్మికవర్గం చిరస్థాయి అగుగాక! (కరతాళ ధ్వనులు)

దిగ్విజయమొందిన మన సమిష్టి వ్యవసాయ రైతాంగం చిరస్థాయి అగుగాక! (కరతాళ ధ్వనులు)

మన సోషలిస్టు విద్యాధికులు చిరస్థాయి అగుగాక! (కరతాళధ్వనులు)

మన దేశంయొక్క వివిధ జాతుల మధ్య మిత్రభావం వర్ధిల్లుగాక! (కరతాళధ్వనులు)

సోవియట్ యూనియన్ యొక్క కమ్యూనిస్టు పార్టి (బోల్షివిక్) చిరస్థాయి అగుగాక! (కరతాళ ధ్వనులు)

# స్పానిష్ రిపబ్లిక్ ఎట్లు విచ్ఛిన్నమైంది?

కామ్రేడ్ కొండేపూడి లక్ష్మీనారాయణ

"మాడ్రిడ్ ఫ్రాంకో వశమైందని వినేసరికి ఛాంబర్లేన్ కంపెనీ కార్చిన మొసలి కన్నీళ్ళకు అంతులేదు. లండన్‌లో స్లేట్ స్ట్రీట్ మురుగు కాల్వలన్నీ ఈ నీళ్ళతోనే ప్రవహించాయి" అన్నాడొక లండన్ విలేఖరి. కాని మొత్తంమీద 'టైమ్సు' పత్రిక మాత్రం ఫ్రాంకో విజయంపట్ల తన సంతోషాన్ని వెలిబుచ్చకుండా ఉండలేక పోయింది. "ఫ్రాంకోకు చేకూరిన ఈ అఖండ విజయంవలన యూరప్ అంతటా ఉపశమనం కలిగింది........ఇంగ్లండు ఇప్పుడు సక్రమంగా కలుగజేసుకోవానికి యిది సమయం" అని వ్రాసింది. బ్రిటిష్ ప్రభుత్వ దృక్పథాన్ని ఎప్పటికప్పుడు ప్రతిబింబింపజేసే 'టైమ్సు' చెప్పినట్లు, స్పానిష్ ప్రజాస్వామ్య పతనం వలన ఫ్రాంకోకు అఖండ విజయమయితే, దానివలన యూరపుకు ఉపశమనమే అయితే ఛాంబర్లేన్ తటస్థ విధానంలోని అంతరార్థం స్పష్టమైందన్నమాట. ఐతే 'టైమ్సు' పత్రికను ఒకందుకు మాత్రం అభినందించాలి. ఇంగ్లండు ఇప్పుడు సక్రమంగా కలుగజేసుకోవచ్చునంటోంది. అంటే ఇంతవరకు చేసినదంతా అక్రమమేనని ఒప్పుకుంటోందన్నమాట: నిజానికి ఛాంబర్లేను ప్రభుత్వము అవలంబించిన తటస్థ విధానము.—ఫ్రాంకోకు ఇటలీ జర్మనీలు ఆయుధాలు, సైన్యాలు సప్లయి చేస్తూంటే చూస్తూ వూరుకొని, స్పెయిన్ ప్రజలను ఆయుధాలు సరేకదా ఆహార పదార్థాలైనా కొనుక్కోకుండ నిరోధించిన తటస్థ విధానము — వల్లనే కదా నేడు స్పెయిన్ ప్రజాస్వామ్యానికి యీ గతి పట్టింది? స్పెయిన్ ప్రజలు స్వాతంత్ర్యము రక్షించుకోడానికి ఆయుధాలు లేకపోయినా, ఆహారము చాలకపోయినా రెండున్నర సంవత్సరాలు పోరాడారు. ప్రపంచ చరిత్రలో ఎక్కడా లేని ధైర్య సాహసాలు ప్రదర్శించారు. మహా యుద్ధాలు నడిపిన మిలిటరీ వేత్తలకు దిగ్భ్రమ కలిగించారు—

బ్రిటను ఫ్రాంసులు అవలంబించిన తటస్థ విధానముతోపాటు స్వాతంత్ర్య పోరాటాన్ని నడుపుతూ వచ్చిన నాయకులలోగూడ కొందరు తుది సమయములో మోసము చేయడమువల్లకూడా స్పెయిన్ ప్రజాస్వామ్యము అనుకోనంత త్వరలో పతనము కావలసి వచ్చింది. మొదట్లో ఏడు పర్యాయాలు ముట్టడించినా, కొరకుపడని మాడ్రిడ్ చివరకు పోరాటములేకుండా ఫ్రాంకో వశముకావలసి వచ్చింది. స్పానిష్ ప్రధాని నెగ్రిన్, విదేశమంత్రి డెల్‌వయో అంచనా ప్రకారము, కనీసము ఇంకొక మూడునాలుగు నెలలైనా పోరాటం సాగించవచ్చును. ఈ వ్యవధిలో ప్రపంచ పరిస్థితులు అనేక విధాలుగా మారవచ్చును. 'సందో రాజా భవిష్యతి' అయితే, ఇంత అత్యల్పకాలములోనే స్పానిష్ ప్రజాతంత్ర ప్రభుత్వము ఎందుకు పతనమైంది? అంత ధైర్యమున్న నెగ్రిన్ ప్రభుత్వం ఎట్లు విచ్ఛిన్నమైంది?

## తుదివరకు పోరాటం

ఫిబ్రవరి 10 వ తేదీన నెగ్రిన్, డెల్‌వయోలు, సెంట్రల్ స్పానిష్‌జోన్‌లో ఫ్రాంకో దాడిని ఏవిధంగా ఆపగలరో పరిశీలించడానికి ఫ్రాన్సునుండి తిరిగి వచ్చారు. ఏవిధమైన షరతులు లేకుండా ఫ్రాంకోవశం కావడమంటే 20 వేల ప్రాణాలు ఫ్రాంకోకు వృథాగా బలి ఇవ్వడమే అవుతుందని నా అభిప్రాయం. ఒక కొంత కాకపోతే కొంత అయినా అడ్డు తగలకుండా లొంగిపోయామంటే ఈ సెంట్రల్ స్పెయిన్‌లో, కాటలోనియాలోవలె తప్పించుకు పారిపోవడానికి కూడా అవకాశాలు తక్కువ. తరువాత, ప్రభుత్వ అధీనంలో వున్న ప్రాంతాలలో ఈ సెంట్రల్ జోన్ మాత్రమే కొంచెం బలమైనది. అందుచేత కొన్ని నెలలపాటైనా ఎదుర్కో గలిగితే ఫ్రాంకోను తప్పక కొన్ని షరతులకు లోబడేటట్లు చేయవచ్చు. ఈలోపుగా చాలామందిని బయటికి దాటించవచ్చు. అంతేగాని, తుదివరకు ఈపోరాటం సాగించడం వలన, పోయిన ప్రాంతాలు తిరిగి సంపాదించుకో వచ్చుననిగాని బర్గోస్ మీదికి దాడి సాగించ వచ్చుననిగాని బార్సిలోనాను స్వాధీనం చేసుకో వచ్చుననిగాని నెగ్రిన్ వూహించాడనుకోడము పొరపాటు. సైనికులలోను ప్రజలలోను ఉన్న ఉత్సాహము, పట్టుదల చూచి తమ ఎత్తు కొనసాగుతుందనే ఆశించారు నెగ్రిన్, డెల్‌వయోలు. వారిరాకకూడ చాలమందిలో నూతనోత్సాహాన్ని కలుగ జేసింది.

## ఆటంకాలు

కాని నెగ్రిన్ ప్రభుత్వము చాల తీవ్రమైన (Set backs నష్టాలకు గురికావలసి వచ్చింది. మొట్టమొదటిది ప్రెసిడెంటు అజానా రాజీనామా నివ్వడం. దీనిని పట్టుకొని మాడ్రిడ్‌లో కొందరు ఇంక ఎట్టి శాసనాలు చేయడానికి ప్రభుత్వానికి అధికారం లేదని దుష్ప్రచారం చేయడం ప్రారంభించారు. రెండవది బ్రిటిష్, ఫ్రెంచి ప్రభుత్వాలు ఫ్రాంకో ప్రభుత్వాన్ని గుర్తించడంలో చూపిన ఆత్రుత. ఎన్ని జరిగినా పోరాటము ఇంకా కొంత కాలము సాగించ వచ్చునని, కొన్నివేలమంది ప్రాణాలు రక్షించ వచ్చునని నెగ్రిన్ ఆశ. ఇందుకు మాడ్రిడ్ రంగములోని సైనికులకు, ప్రజలకు ఎక్కువ ప్రోత్సాహ మివ్వబడింది. ఈఎత్తును విజయవంతముగా సాగించవచ్చుననే ఉత్సాహంతోనే ఫ్రాన్సుకు వెళ్ళిపోయిన సైనికులు కూడా కొందరు యుద్ధరంగానికి తిరిగి వచ్చారు.

మూడవది ఓటన్నిటికి మించిన హృదయ విదారక సంఘటనలు కొన్ని జరిగాయి. నెగ్రిన్ నమ్మి పెద్ద పదవులిచ్చిన వారే కొందరు మోసము చేయ సమకట్టారు. కుట్రలు చేయడం మొదలు పెట్టారు. ఈ నాయకుల కుట్రలు ముఖ్యంగా బార్సిలోనా పతన మప్పటినుండి ప్రారంభమైనాయి. కలనల్ కసాడో దీనికి నాయకుడు. ఇతనిని రిపబ్లికన్ ప్రభుత్వం విశ్వసించి జనరల్ పదవి వరకు ప్రమోషన్ చేసింది. కాటలోనియా ఓడిపోయిన తరువాత, నెగ్రిన్ అవలంబించుచున్న తుదివరకు పోరాటం సాగించాలన్న విధానాన్ని అరికట్టాలనే సేనానాయకులు కూడా కొందరు బయలుదేరారు. నాయకత్వం వహించి పోరాటం నడిపే వారిలో నమ్మదగిన వారి సంఖ్య తగ్గిపోతూ వచ్చింది. కమ్యూనిస్టులైన లిస్టర్, మోడెస్టో, గాలన్, మెండియోలా మొదలైన వారు, ఇంకా ఇతరులు ఎక్కువ విశ్వాసంతోను, పట్టుదలతోను పోరాడుతూ వచ్చారు. నెగ్రిన్ వీరిని ముఖ్యమైన స్థానాలలో వుంచుతూ వచ్చాడు.

## కసాడో కుట్ర

నెగ్రిన్, డెల్‌వయోలు తమ ఆఫీసును ఆలికంటికి 20 మైళ్ల దూరంలో వున్న ఒక పల్లెటూళ్లో అన్ని రంగాలకు అందుబాటులో వున్న ఒక పల్లెటూళ్లో పెట్టుకున్నారు. ఇది అన్ని రంగాలకు అందుబాటులోవున్న కేంద్రం. శుక్రవారం...........39 వింతగొల్పే వార్త ఒకటి వారికి చేరింది. కార్తజీనాలో కోటను కాపలాకాసే రెజిమెంటు తిరుగుబాటు చేసిందని నావికా సైనికులను కూడా తమతో కలవమని ప్రబోధిస్తున్నారని ఆ వార్త. నెగ్రిన్ వెంటనే జనరల్ గాలన్ (కమ్యూనిస్టు) ను కార్తజీనాకు పంపాడు. గాలన్ ఈ తిరుగుబాటును కొద్దిగంటల కాలములోనే అణచివేయగలిగాడు. ఈసంగతి మాడ్రిడ్‌లోనున్న కుట్రదార్ల నాయకులకు ఆశ్చర్యం కల్గించింది. నెగ్రిన్ ప్రభుత్వం ఇంత చురుకుగా పని చేస్తుందని వారనుకోలేదు.

కుట్రదార్లు ఇంకా దారుణ కృత్యాలు చేయడానికి ప్రయత్నించారు. సోమవారము నెగ్రిన్ ఇవ్వబోయే బ్రాడ్‌కాస్టు ఉపన్యాసము జరగకుండా చేయడానికి నిశ్చయించారు. ఉపన్యాసము ఇవ్వడానికి పూర్వము (ఆదివారము) వివిధ రంగాలలో నాయకత్వము వహించిన జనరల్సు అందరితోతూ సంప్రదించడానికి, వారిని తనవద్దకు ఒకసారి రావలసినదిగా ఆహ్వానాలు పంపాడు. కుట్రనాయకుడు కాసడో ఏవేవో వంకలు చెప్పుతూ, మాడ్రిడ్‌నుండి కదలిరాలేదు. కార్తజీనా తిరుగుబాటు అణచివేయబడింది గాని మాడ్రిడ్‌లో మాత్రము నెగ్రిన్ ప్రభుత్వాన్ని దూషిస్తూ కొన్ని బ్రాడ్‌కాస్టు ఉపన్యాసాలు ఇవ్వబడ్డాయి. ఈ సంగతి నెగ్రిన్ విన్నాడు: కాసడోకు వెంటనే టెలిఫోన్ చేశాడు. కాని అప్పటికప్పుడే పరిస్థితి శృతిమించిపోయింది. కాసడోరాలేదు సరికదా తానుకూడ నెగ్రిన్ ప్రభుత్వానికి వ్యతిరేకమేనంటూ సమాధానం చెప్పాడు. అంతేకాదు. కాసడో తలపెట్టిన ఘాతుక కృత్యాలు ఇంకా బైట పడ్డాయి. మంత్రివర్గ సమావేశము మాడ్రిడులో పిలిచి నెగ్రిన్ మొదలైన వారినందరిని కూడ ఆరెస్టు చేయడానికి ప్రయత్నించాడు. కాని ఇది కొనసాగలేదు. ఆ రెండు రోజులలోను మిలిటరీ కమాండర్లు చాలచోట్ల తిరుగుబాటు చేసినట్లు నెగ్రిన్‌కు తెలియవచ్చింది. కమ్యూనిస్టులు నాయకత్వంలో ఉన్న చోట్ల తప్ప మిగతా మిలిటరీ కేంద్రాలన్నిటిలో కాసడో కుట్రలు ఫలించాయి. మొదట మాడ్రిడ్డును కాపాడి ప్రపంచ విఖ్యాతి గాంచిన జనరల్ మియాజా కొద్ది రోజులవరకు ఈ కుట్రలో కలవలేదు. మౌనముగానే వుంటూ వచ్చాడు.

ఆయితే నెగ్రిన్ ప్రభుత్వంపై ఈకుట్రలు సాగించడానికి కారణము ఏమిటి? వీరందరు మొదటినుంచీ రిపబ్లిక్ రక్షణార్థం పోరాడుతూనే వచ్చారుకదా? అని సందేహం కలుగవచ్చు. ఔను. మొదటినుంచీ పోరాడుతూనేవచ్చారు. కాని కాటలోనియాలోని ఈపతనముతో వీరిలో నిరుత్సాహం, నిస్పృహ ప్రబలిపోయాయి. గౌరవప్రదంగా ఫ్రాంకోకు లొంగిపోవాలనే అభిప్రాయము ఏర్పడ జొచ్చింది. వీరిలో కొందరు ఫ్రాంకోతో రహస్య రాయబారాలు కూడా సాగించారు. తమ విధానానికి ఇష్టపడని, తమ్ము నమ్మిన నెగ్రిన్‌పై కుట్రలు సాగించి ఫ్రాంకోకంటె ఎక్కువ దేశద్రోహంలవడానికి ఒడిగట్టారు. యువకులైన ఆఫీసర్లకు సైనికులకు, ద్రోహచర్యలు నచ్చలేదు. అయినా కుట్రదారులే జయించారు. నెగ్రిన్, డెల్‌వాయోలు ఫ్రాంసుకు పారిపోవలసి వచ్చింది, పోరాటం లేకుండా మాడ్రిడ్ ఫ్రాంకో వశమైనది. రిపబ్లికన్ స్పెయిన్ అంతరించినది. ఛాంబర్లేన్ కుటిల రాజనీతి ఫలించినది. కాని ఫ్రాంకో విజయము బ్రిటన్‌కు మధ్యధరాసముద్రములో గొంతుక పట్టుకుంది.

ముస్సోలినీ రోమ్ నగరములో తన ఉపన్యాస వేదికపై నిలబడి గొంతుక చించుకొని ఉపన్యసించాడు, "బోల్షివిజం పరాజయము పొందడముతో స్పానిష్ యుద్ధము అంతమొందింది. మాడ్రిడులో ఫాసిజాన్ని పాతిపెడతామన్నారు, బోల్షివిజాన్నే పాతిపెట్టాము" అని గర్జనలు చేశాడు. వెనక, పారిస్ కమ్యూన్‌ను రక్తముతో ముంచెత్తినప్పుడు, థియర్సు కూడా ఇల్లాగే "ఇప్పుడు మనము సోషలిజాన్ని శాశ్వతముగా అణచివేశాము" అని గంతులు వేశాడు. కాని కాలక్రమేణ రష్యా లక్షమంది థియర్సులకు సమాధానము చెప్పింది. అల్లాగే కాలక్రమేణా పదిలక్షల ముస్సోలినీకికూడా తగిన సమాధానం రాకపోతుందా!



# ఆమెరికా ప్రభుత్వం — కార్మికోద్యమ విజృంభణ

ఎడ్విన్ యస్. స్మిత్

[ఎడ్విన్ యస్. స్మిత్ అమెరికా ప్రభుత్వంచే నియమించబడిన "నేషనల్ లేబర్ రిలేషన్సు బోర్డు"లో ఒక సభ్యుడు.]

కార్మికులు తమతమ సంఘాలలో సభ్యులుగా చేరి సంఘబలాన్ని పెంపొందించుకొనే హక్కు నేషనల్ లేబర్ రిలేషన్సు ఆక్టులో రక్షించబడిన మాదిరిగా ఏ పెట్టుబడిదారీ దేశాలలోను (ఒక్క మెక్సికోలో తప్ప) రక్షించబడలేదు. అనేక కారణాలవల్ల యిదొక అపూర్వ ఘటన అని చెప్పవచ్చును. అమెరికన్ పెట్టుబడిదారీ వర్గం మొదటినుంచీ కార్మిక సంఘాల యెడల ప్రతికూల వైఖరినే ప్రదర్శిస్తూ వచ్చింది. తమ యిష్టం వచ్చినప్పుడు కార్మికుల్ని పెట్టుకోడానికి; అక్కర లేనప్పుడు తొలగించడానికి; తమ యిష్టం వచ్చిన కూలి రేట్లు యివ్వడానికి పనిచేసే గంటల సంఖ్య, పనిచేసే పద్ధతి-యివి తమ యిష్టం ప్రకారమే నిర్ణయించడానికి అమెరికన్ పెట్టుబడి దార్లు మొదటి నుంచీ కార్మిక సంఘాలయెడ ప్రతికూల వైఖరినే ప్రదర్శిస్తూ వచ్చారు. ఈ ప్రతికూల వైఖరి చాలావరకు జయప్రద మయినదనడానికి ఋజువు లేకపోలేదు.

### రూజ్వెల్టు పరిపాలన

రూజ్వెల్టు అమెరికా అధ్యక్షుడుగా ఎన్నుకొనబడిన తరువాత, పరిస్థితులలో మార్పు వచ్చింది. పెట్టుబడిదార్ల లాభాలను ఎక్కువ చేయడానికి "నేషనల్ ఇండస్ట్రియల్ రికవరీ ఆక్టు" ప్యాసుచేయబడింది. దీని ప్రకారం, పెట్టుబడిదార్లు తమ సరకుల ధరల్ని నిర్ణయించుకోడానికి పోటీ పద్ధతిని తగ్గించి వేసుకోడానికీ, అధికారం పొందారు. కాని, ధరలు పెరగడంవల్ల కార్మికులకు నష్టం వచ్చింది. తమ వేతనాలు కూడా ధరల హెచ్చింపుతో బాటు ఏక్కువయితేగాని వీల్లేదని ఆందోళన చేశారు. నేషనల్ ఇండస్ట్రియల్ రికవరీ ఆక్టు" కార్మికులకు నిర్ణయించబడిన కనీసపు వేతనం, పనిచేసే గంటల పరిమితి యితర సౌకర్యాలు, ఏమాత్రమూ సరిపోవని ట్రేడ్ యూనియన్సు నాయకులు ప్రకటించారు. పెట్టుబడిదార్ల లాభాలను ఎక్కువ చేయడానికి వారిలో వారు సంఘాలుగా ఎర్పడి సమిష్టిపద్ధతి ప్రకారం వ్యాపారం సాగించడానికి అవకాశం యివ్వబడినప్పుడు కార్మికులకు మాత్రం అట్టి హక్కు ఎందుకీయరాదని ప్రశ్నింప సాగేరు.

### "నేషనల్ లేబర్ రిలేషన్సు ఆక్టు"

ఇట్టి పరిస్థితులలో "నేషనల్ లేబర్ రిలేషన్సు ఆక్టు" ప్యాసుచేయ బడవలసి వచ్చింది. దీనిప్రకారం: కార్మికులు తమతమ సంఘాలలో సభ్యులుగా చేరి, ఆ సంఘాల ద్వారా తమ హక్కులకై పోరాడే హక్కు గుర్తించబడింది. యజమానులెవరూ యీ హక్కును భగ్నం గావించకూడదు. కార్మికుడు ఏదైనా ఒక కార్మిక సంస్థలో సభ్యుడుగా ఉండి, దానితరఫున నిర్వర్తించే పనులకు యజమాని అతన్ని డిస్మిస్ చేయకూడదు. కార్మికులు ఒక కార్మిక సంఘాన్ని స్థాపించుకోవడానికి చేసే ప్రయత్నాలలో యజమాని జోక్యం కలిగించుకొనకూడదు. తాను స్వయంగా ఒక కార్మిక సంస్థను ఏర్పాటు చేయడంగాని, తన పలుకుబడిలో ఉన్న కార్మిక సంఘానికి ధనసహాయం చేయడంగాని, చట్టంప్రకారం నేరం. తనక్రింద పని చేసే కార్మికులలో అధిక సంఖ్య సభ్యులుగా ఉన్న ఒక ట్రేడ్‌యూనియన్‌ను యజమాని గుర్తించితీరాలి. అట్టి సంఘంతో సంప్రతింపులు చేయడానికి నిరాకరించకూడదు.

ఈ చట్టాన్ని మొదటినుంచి అమెరికను పెట్టుబడిదార్లు ఎదిరిస్తూనే వచ్చారు. దీన్ని సుప్రీమ్ కోర్టు అశాస్త్రీయచట్టం అని తీర్పుయిస్తుందని వీరి ఆశ. దీనికి ఫలితంగా, మొదటి 18 నెలలలోను నేషనల్ లేబర్ రిలేషన్సు బోర్డు (చట్టాన్ని ఆచరణలో పెట్టేటట్లు చూచే ప్రభుత్వోపసంఘం) అంతగా పనిచేయలేక పోయింది. ఆబోర్డు యెదుట ఎట్టి ఫిర్యాదులు చేయబడకూడదనీ; సాక్షులు సాక్ష్యం యివ్వకూడదనీ మొదలైన కంప్లెయింట్లు కోర్టులలో చేయబడ్డాయి. వాటికన్నింటికి యీబోర్డు జవాబు చెప్పవలసి వచ్చేది. 100 కి 100 ఫిర్యాదులు కొట్టివేయబడ్డాయి. చివరకు, ఏప్రిల్ 1937 లో సుప్రీమ్‌కోర్టు యొక్క తీర్పుకూడా వచ్చింది. ఆక్టు ఏవిధంగాను అశాస్త్రీయం కాదని జడ్జీలు నిర్ణయించారు. దీనికి కార్మికులు ఆశాపూరితులయారు.

### తగాదాల పరిష్కారం

ఏదైనా ఒక రాష్ట్రంలో "నేషనల్ లేబర్ రిలేషన్సు ఆక్టు"కు వ్యతిరేకంగా ఒక యజమాని ప్రవర్తిస్తే ఆ లేబర్‌యూనియన్ రాష్ట్రాధికారి (డైరెక్టరు) యెదుట ఫిర్యాదు చేయాలి. ఇట్టి ఫిర్యాదులకు తగిన ఆధారాలు, సాక్ష్యం ఉంటే, డైరెక్టరు వాటిని నేషనల్ లేబర్ రిలేషన్సు బోర్డుకు పంపుతాడు. అట్టి ఆధారాలు, సాక్ష్యం లేకపోతే, ఫిర్యాదును కొట్టివేస్తాడు. ఆక్టు అమలులో వున్న మొదటి మూడు సంవత్సరాలలో, అనగా 1938 జూలై 5 వ తేదీలోగా మొత్తం 22 రాష్ట్రీయ డైరెక్టర్ల వద్దకు వచ్చిన ఫిర్యాదులలో 100 కి 40 ఫిర్యాదులు నిరాకరించబడటమో, లేక ఉపసంహరించుకొనబడటమో, జరిగింది. కంప్లెయింట్లను డైరెక్టర్లు లేబర్ బోర్డుకు పంపకపూర్వం యజమానులతో సంప్రతించి, ఆక్టు యందలి షరతులకు వారు కట్టుబడేటట్లు చేయ ప్రయత్నిస్తారు. మొదటి 3 సంవత్సరాలలో 100 కి 55 కంప్లెయింట్లు యీ విధంగానే పరిష్కరించబడ్డాయి.

పరిష్కరించబడని కంప్లెయింట్లు ఒక విచారణాధికారి యెదుట పెట్టబడతాయి. ప్రభుత్వం యీతన్ని వాషింగ్టన్ పట్టణంనుండి పంపిస్తుంది. ప్రభుత్వం తరఫున ఒక పెర్మనెంటు వకీలు కేసులో వాదిస్తాడు. మొదట ప్రభుత్వం తరఫు సాక్షుల్ని విచారణచేసి, యజమాని తరఫు వకీలు వారిని క్రాస్‌పరీక్ష చేయుడము పూర్తి అయాక డిఫెన్సు సాక్షుల్ని విచారణ చేస్తారు. వారిని తిరిగి ప్రభుత్వం తరఫు వకీలు క్రాస్‌పరీక్ష చేస్తాడు. కేసు విచారణ పూర్తి అయాక, విచారణాధికారి తీర్పుయిస్తాడు. యజమాని నేరస్థుడని నిర్ణయించబడితే, చట్టము ప్రకారం కట్టుబడి ఉండడానికి అతడు ఏమి చేయాలోకూడా తీర్పులో విచారణాధికారి స్పష్టపరుస్తాడు. ఈ నిర్ణయానికి యజమానిగాని, కార్మిక సంఘంగాని, అంగీకరించకపోతే లేబర్ బోర్డు యెదుట కేసు అప్పీలుకు వస్తుంది. లేబర్‌బోర్డు కూడా యజమానిదే తప్పు అని తీర్పుయిస్తే, ఆక్టును అమలుపరచడానికి అతడు ఏయే చర్యలు తీసుకోవాలో ఉదహరిస్తుంది. దానికీ నిరాకరిస్తే, సర్క్యూట్‌కోర్టు జడ్జీ కేసును తిరిగి విచారించి తీర్పు యిస్తాడు. యజమాని ఆతీర్పును అమలు పరచకపోతే, అప్పుడు అతనికి శిక్ష విధించబడుతుంది.

కాని, మూడు సంవత్సరాలలో వచ్చిన కంప్లెయింట్ల (11,000) లో 100 కి 5 కంప్లెయింట్లు మాత్రమే పై దశలన్నీ దాటివచ్చాయి. మిగిలిన కేసులన్నీ మధ్యకాలంలోనే పరిష్కరించబడ్డాయి.

లేబర్‌బోర్డు యొక్క కృషికి ఫలితంగా, ట్రేడ్ యూనియన్ పనులలో పాల్గొన్నందుకు తొలగించబడిన 10,000 మంది కార్మికులకు తిరిగి ఉద్యోగాలు లభించాయి. సమ్మెలో పాల్గొన్నందుకు తొలగించబడిన 2 లక్షల మంది కార్మికులు తిరిగి ఆపనులలోనే చేర్చుకొనబడ్డారు. యజమానులచే సృష్టింపబడిన అక్రమ యూనియన్లు ఎన్నింటిపైనో ప్రభుత్వం ఆంక్ష విధించింది, 1676 సమ్మెలు కార్మికుల కనుకూలంగా పరిష్కరించబడ్డాయి. సమ్మెయొక్క అవసరం లేకుండా 580 తగాదాలు పరిష్కరించబడ్డాయి.

కార్మికుల సమ్మె హక్కును ఏ విధంగాను ఆక్టు అపహరించడం లేదు. ఆక్టులో ఈ క్రింది విధంగా స్పష్టపరచబడియుంది.

"సమ్మె హక్కు విషయంలో ఏ విధంగాను జోక్యం కలిగించుకోడానికి గాని, దాన్ని ఆటంకపరచడానికి గాని, దానిచుట్టూ హద్దులు నిర్ణయించడానికి గాని, ఆక్టు ప్రకారం వీలు లేదు."

### ట్రేడ్ యూనియన్ల అభివృద్ధి:

"నేషనల్ లేబర్ రిలేషన్సు ఆక్టు" ఫలితంగా ట్రేడ్ యూనియన్ల సంఖ్య, వాటిలో సభ్యుల సంఖ్య ఎక్కువగా వృద్ధి చెందింది. ఈ ఆక్టు ప్యాసు కాకపూర్వం అమెరికన్ ఫెడరేషన్ ఆఫ్ లేబర్; సి. ఐ. ఓ. అనే రెండు అమెరికన్ కార్మిక సంస్థలలోను మొత్తం 25 లక్షల మంది సభ్యులు ఉండేవారు 1938 లో యీ సంఖ్య 70 లక్షలకు పెరిగింది. ఇటీవల బయల్దేరిన క్రొత్త సంఘాలలో ఎక్కువ సంఖ్య ఉక్కు, మోటారు, పెట్రోలు పరిశ్రమలలో ఉంది. ఆక్టుకు పూర్వం ఈ పరిశ్రమలలో అసలు సంఘాలే లేవు.

### యజమానుల దుండగాలు

ఇటీవల కార్మికసంఘాలపైన, కార్మికనాయకులపైన, యజమానులు చేస్తున్న దుండగాలు ప్రతిమానవుని హృదయాన్ని కంపింపజేస్తాయి. అనేక మంది యూనియను నాయకులను తుంటర్లు యజమానుల ప్రత్యక్ష ప్రోత్సాహం వల్ల చిత్రవధ చేయుట, ఎత్తుకొనిపోవుట, జరుగుతున్నాయి. ఖూనీలు కూడా జరుగుతున్నాయి. యజమానులచే సృష్టించబడ్డ కార్మిక సంఘసభ్యులు ఏవిధంగా స్వతంత్ర భావాలుగల కార్మికుల్ని మేస్త్రీలయొక్క, మేనేజర్లయొక్క సమక్షంలో ఫ్యాక్టరీలనుండి తరిమివేశారో పలువురు లేబరుబోర్డు యెదుట ఇచ్చిన సాక్ష్యంలో వివరించ బడింది ఒక సందర్భంలో ఇట్టి దౌర్జన్యం జరుగుతూంటే, అక్కడే కాపలా ఉన్న పోలీసులు చూస్తూ వూరుకున్నారుట. సమ్మెలు జరుగుతూంటే, యజమానులు ఏజంట్లను పంపి సమ్మెదారులలో యూనియనుపై దుష్ప్రచారము చేయిస్తారు. సమ్మెను చీల్చడానికి ప్రత్యేక నైపుణ్యంగల తుంటరుల్ని పంపుతారు. సమ్మెదారులు దౌర్జన్యాలు చేస్తున్నారని ప్రజలలో అసత్యవార్తలు వ్యాపింప చేస్తారు. యజమాని తన ఫ్యాక్టరీని మరొక స్థలానికి తీసుకుపోతాడని సమ్మెదార్లను బెదరిస్తారు. కార్మిక సంఘాలు కార్మికనాయకులు కమ్యూనిస్టుల చేతుల్లో ఉన్నాయని ప్రజలలో దుష్ప్రచారం గావిస్తారు. కావలసి నన్ని కరపత్రాలు ప్రజలలో పంచిపెట్టిస్తారు. సమ్మెదార్లు పనిలోకి వెళ్లడానికి సిద్ధంగానే ఉన్నప్పటికీ వారి నాయకులు మాత్రం స్వలాభాపేక్షతో సమ్మెను సాగిస్తున్నారని యజమానులు తమ పలుకుబడిలో ఉన్న న్యాయ అధికారులచేత ప్రకటనలు చేయిస్తారు. స్థానిక వార్తాపత్రికలు వ్యాపారకారణాలవల్ల సర్వసాధారణంగా యజమానుల పక్షాన్ని బలపరుస్తాయి. కార్మికుల వాదనకు తగినంత ప్రాధాన్యత నీయవు. ఈకారణాలన్నింటివల్ల ప్రజలలో సమ్మెల యెడల విరోధభావం వ్యాపింపడం చూస్తున్నాము. అనేక మంది పెద్దమనుష్యులు ఇట్టివలలో చిక్కి యజమానులచే నియమించబడే రౌడీల ముఠాలతో కలిసి పోవడంకూడ సంభవిస్తోంది.

### ముగింపు.

"నేషనల్ లేబర్ రిలేషన్సు ఆక్టు" వల్ల అమెరికన్ కార్మికులకు వచ్చిన ముఖ్యప్రయోజనం ఏమంటే, తాము తమ వర్గసంఘాలలో సభ్యులుగాచేరి ఆసంఘాల ద్వారా యజమానులతో తమ హక్కులకై పోరాడేశక్తి ఎక్కువ కావడమే కాకుండా ట్రేడ్‌యూనియన్ ఉద్యమంలో వారు తీవ్రంగా పాల్గొనడంవల్ల రాజకీయ-ఆర్థిక చైతన్యము వృద్ధి పొందుతుంది. శాసనసభలలో కూడ తమ కనుకూలమైన చట్టాలు సులభంగా ప్యాస్ చేయించుకోడానికి అవకాశం కలుగుతుంది. క్లుప్తంగా చెప్పాలంటే: కార్మికోద్యమం బలపడితే ప్రజాతంత్ర శక్తులుకూడా బలపడతాయి.

నేటి ప్రపంచంలో ప్రజాతంత్ర శక్తులకు, ఫేసిస్టు శక్తులకు మధ్య తీవ్రమైన పోరాటాలు జరుగుతూన్నాయి. నాగరికత వృద్ధిపొందడమో లేక శాస్త్రాభివృద్ధి, కళానైపుణ్యము వీటితోబాటు మన రాజకీయ-ఆర్థిక జీవితం సర్వనాశనం కావడమో ఈ పోరాట ఫలితముపై ఆధారపడి వుంటుంది.

ప్రజాతంత్ర ప్రభుత్వము చాలావరకు కార్మికుల ఆర్థిక-రాజకీయ స్వాతంత్ర్యముపైనను జాతీయ, అంతర్జాతీయ విషయాలలో వారి భావప్రకటనపైననూ ఆధారపడి వుంటుంది. ఇట్టి దృక్పథంనుంచి చూస్తే "నేషనల్ లేబర్ రిలేషన్సు ఆక్టు" అమెరికా చరిత్రలో యితర చట్టాలకంటె ఎక్కువ ప్రాధాన్యతను కలిగి ఉంది.

చైనా కథ

# ★ నిష్క్రమణం ★

రచయిత: పూ యెన్

వాళ్ళ చిన్న తమ్ముడు, సియోసియో ప్రొద్దున్నే లేచి తన పుస్తకాలన్నీ ఒక సంచిలో కుక్కుకుని. "అక్కా! వేళయింది, పోదాంలే" అని కేకవేశాడు.

ఫీ ఫీ మాట్లాడలేదు- ఆమె ఏదో దీర్ఘాలోచనలో పడింది. అల్లాగే కూర్చుని వుంది.

'అక్కా!' అని మళ్ళీ పిలిచాడు.

అమె తలఎత్తి చూసింది. ఎదురుగా గోడమీద వ్రేలాడుతూన్న వాళ్ళ తండ్రి ఛాయాపటం ఆమె దృష్టి నాకర్షించింది. తదేక దృష్టితో కొంతసేపు ఆ బొమ్మ కేసి చూసింది. మా తండ్రే బ్రతికివుంటే నేనిల్లా, జపానువాళ్ళ అధికారముక్రింద నడపబడే బడిలో పంతులమ్మ పని చేయవలసిన గతి పట్టేది కాదుకదా, అనుకుంది. ఈ పాటికి ఏ యూనివర్సిటీలోనో కళాసాగా ఉన్నత విద్య నభ్యసిస్తో వుండేదాన్ని కదా అని తలపోసింది.

కాని, ఆరోజులు గతించాయి. సూచౌ పట్టణము కూడా జపాను దండయాత్రకు గురికావలసి వచ్చింది. వీళ్ళ కుటుంబము, తమ తాత ముత్తాతలు కట్టిన ఇల్లూ వాకిలీ వదలిపెట్టి పోవలసివచ్చింది. వాళ్ళకున్న డబ్బు దస్కం, ఆస్థి, అంతా జపాను సైనికులు కొల్లగొట్టేశారు. వీటన్నిటికి మించిన దుర్ఘటన ఒక జపాను బాంబు వాళ్ళ తండ్రినికూడా తన పొట్టను పెట్టుకుంది.

నడిబజారులో, రక్తంతో ముంచెత్తి ప్రాణాలు వదలిన తన తండ్రి మరణ దృశ్యాన్ని తలచుకొన్నప్పుడల్లా, ఆమెలో ఎక్కడలేని పౌరుషం వచ్చేది. కోపంతో ఆమెరక్తం సలసల క్రాగేది. పగతీర్చుకోడానికి. తానుకూడ సైన్యంలో చేరుదామని చాలా సార్లు ప్రయత్నించింది. కాని తన చిన్నితమ్ముని కోమల హస్తాలు, దుఃఖభారంతో క్రుంగిపోతూన్న ముదుసలి తల్లి కన్నీటి బిందువులు ఆమెను అడ్డుకుంటూ వచ్చాయి.

కొన్నాళ్లకు వాళ్లు తిరిగి ఇంటికివచ్చారు. ఇంటిలో నాలుగు గోడలు తప్ప ఏమీలేదు. సామానంతా దోచుకుపోయారు. ఎక్కడైనా పాతిపెట్టిన బాపతు ధనం దొరుకుతుందేమో నని ఇల్లంతా త్రవ్విపోశారు.

వారి కష్టదు జీవితమే దుర్భరమై పోయింది. చేతిలో దమ్మిడీలేదు. తినడానికి గింజలులేవు. తల్లి ఎల్లాగో కష్టపడి కూతురుకొక ఉద్యోగం సంపాదించి తెచ్చింది. అది, జపాను వారి తొత్తులు కొందరు "శాంతిస్థాపన సంఘమ"నే పేరుతో ఏర్పరచిన కమిటీ యాజమాన్యాన నడిపే బడిలో పంతులమ్మపని. నెలకు ఇరవై డాలర్లు జీతం.

మొదట్లో ఫీఫీ ఈ ఉద్యోగానికి ఒప్పుకోలేదు. కాని ఒకనాడు వాళ్ల అమ్మ "ఔను తల్లీ! అబాంబు ఏదో నానెత్తిమీదనే పడి వుంటే నీకీ అవస్థ వచ్చివుండేది కాదు కదా" అన్నమాటలు ఆమెకు చాల బాధ కలిగించాయి. విధిలేక ఉద్యోగాన్ని స్వీకరించింది.

చైనాపిల్లలకి జపాను వారి రాజ్యపాలన వలని లాభాలను గురించి చెప్పే అవమానాన్ని తప్పించుకోడానికి, లెక్కలు, చేతిపనులు చెప్పేతరగతి తీసుకుంది. కాని ఇక్కడకూడా ఆమె కదే స్ఫురణకు వస్తూండేది. ఒకనాడు మూడో తరగతి కుర్రవాడొకడు 802 కు 116 కలిపితే ఎంత అవుతుందని అడిగాడు. 918 అని చెపుతూ జపాను వాళ్లు ముక్‌డెన్‌ను వశపర్చుకున్నది ఈ నాటికి సరిగ్గా 9వ నెల 18వ రోజు అని చెప్పకుండా వుండలేక పోయింది. ఇంకొకసారి కుర్రాళ్లు అట్టలతో విమానాలు తయారు చేస్తున్నారు. ఒక చిన్న కుర్రాడువచ్చి. తన విమానంమీద సూర్యుడు బొమ్మ వేసుకుంటానని ఆమెను అడిగాడు. ఆమెకు తెలుసు, ఆకుర్రాడు అల్లా అడగడంలో, తమ జాతీయ పతాకంమీద వున్న సూర్యుడు బొమ్మను తన విమానంమీద కూడా చిత్రించుకోవా లనుకుంటున్నాడని. కొంత సేపటివరకు అమె అతనికేమీ సమాధానం చెప్పలేక పోయింది. నీకేది బాగుంటుందని తోస్తే అది వెయ్యి అన్నది.

కుర్రవాడు రంగు, కుంచి తీసుకుని అతి ఓపికతో చిత్రించి తీసుకువెళ్ళి ఆమెకు చూపాడు. ఆ చిత్రము, ఆ కుర్రవాడి సంతోషము చూసేసరికి ఆమెకుకూడా ఆనందము కలిగింది. దానివంక తదేక దృష్టితో కాసేపు చూసింది. వాడి బుగ్గపట్టుకొని "ఇల్లా ఎందుకు వేశావు?" అని అడిగింది. మొదట కుర్రవాడుకూడా బిత్తర పోయాడు. కాని వాళ్ళందరికి తెలుసు. ఈమె వాళ్ళ నెప్పుడూ శిక్షించదని. "నేను చైనా దేశీయుడ్ని కనక" అని సమాధానము చెప్పాడు. ఆమె మారు మాటాడలేక పోయింది. వాడ్ని దగ్గరకు లాక్కొని కౌగలించుకుంది.

ఆ బడిలో పాఠము అప్పజెప్పని కుర్రాళ్ళకు పదేసి పేకబెత్తం దెబ్బలు శిక్ష. పక్క తరగతి ఉపాధ్యాయుడు పిల్లల్ని నిర్దాక్షిణ్యంగా కొడుతూంటే ఈమెకు తనను కొడుతూన్నట్టుగా వుండేది. పిల్లల ఏడుపు విని లోలోన తానుకూడా కుమిలి కుమిలి ఏడ్చేది. ప్రతిరోజు ఉదయాన్నే లేచి ఈపాడు బడిలోకి వెళ్ళడమంటే ఆమె కెంతో భారంగా ఉండేది.

"ఏమే! ఫీఫీ! వేళ అయింది. తమ్ముడు పిలుస్తున్నాడు, వెళ్లూ!" అని వాళ్ళ అమ్మకూడా కేక వేసింది. వాళ్ల చిన్న తమ్ముడు తన పుస్తకాల సంచి, చంకక్రిందికి వచ్చేలాగ బుజానికి తగిలించుకుని రెడీగా నిలబడి వాళ్ళ అక్కయ్య లేచి రాగానే ఆమె చెయి పుచ్చుకుని ఏవేవో కబుర్లు చెబుతూ ఆమెతోకూడా బడిలోకి పోయాడు.

౨

ఒకనాడు ఉదయం. మందమారుతం మెల్లమెల్లగా వీస్తోంది. తన తమ్ముడ్ని వెంట బెట్టుకుని బడిలోకి బయలు దేరింది. చక్కని ఆ వసంత వాయువులను విషపూరితం చేస్తూ నల్లమందు వాసన గుప్పుమని కొట్టింది. ఆమె అప్పుడనుకుంది. "ఈ నల్లమందు లాగే నేనుకూడా నాదేశీయుల బానిసత్వానికి సహాయపడుతున్నాను. జపాను వారి ఆధ్వర్యంక్రింద నడపబడే స్కూలులో ఉపాధ్యాయిని పని చెయ్యడమంటే అంతకంటే వేరే ఏమౌతుంది? నల్లమందు కంటె నే నెక్కువ దేశద్రోహినికాదూ?" అని.

విశాలమైన ఆ నిర్మలాకాశములో స్వేచ్ఛావిహారము చేసే తెలిమబ్బులు సియోహృదయాన్ని వికసింప జేశాయి.

అకాశము కేసి వేలుచూపుతూ "చూడు! చూడు! అక్కా! ఆమేఘము ఎంత వేగముగా పరుగెత్తుతోందో! ఆపక్షిచూడు! బాణంలాగ పోతోంది!" అన్నాడు రెండో చేత్తో ఆమె చెయ్యిపట్టుకు లాగి.

వారిద్దరూ స్కూలు దగ్గరకు వెళ్లారు. స్కూలు ఎప్పుడూ లేనంత నిర్మలంగా వుంది. ఒక సేవకుడు అక్కడక్కడ వున్న కాగితం ముక్కల నన్నిటిని ఏరి శుభ్రం చేస్తున్నాడు. ఉపాధ్యాయులు విశ్రాంతి తీసుకునే గదిలోకూడ ఎవ్వరూలేరు. టేబిల్‌మీద వుండే సిరా మరకల గుడ్డ తీసివేయబడింది. దాని స్థానే తెల్లని పరిశుభ్రమైన గుడ్డ వేయబడింది. గది కూడా చక్కగా బాగుచేయబడివుంది. క్రొత్త క్రొత్త జపాను పుస్తకాలు బల్లమీద అమర్చబడి వున్నాయి. ఒక్కరోజులో ఇంతమార్పు ఎందుకురావలసి వచ్చింది?

ఆమె తిన్నగా వంటఇంటివద్దకు వెళ్ళింది. వంట ఇంటిలో మార్పు ఏమీ రాలేదు. రోజూకంటె మరింత చిందర వందరగా మాత్రము వుంది. వంటవాడు తీరుబడిగా కుర్చీ పీటమీద కూర్చుని పుస్తకాలన్నీ చింపి మంటలో పడవేస్తున్నాడు. ఫీఫీ వెళ్లేసరికి చైనా పటం మంటల కందిస్తున్నాడు.

"అవన్నీ తగలబెడుతున్నావెందుకు?" అని అడిగింది ఫీఫీ.

వంటవాడు సమాధానము చెప్పకుండా, చైనాదేశపు చరిత్ర పుస్తకాన్ని అమెకందిచ్చి. "ఇది నేను జాగ్రత్త చేయ దలచుకొన్నాను. ఇందులోని కాగితాలు బాగున్నాయి. పొట్లాలు కట్టుకోడానికి పనికివస్తాయి.... క్యాలెండరు వల్ల అపాయము ఏముంది?....ఏమో! హెడ్‌మాష్టరు అన్నీ తగలబెట్టు మన్నాడు." అంటూ ఒకదాని తరువాత ఒక్కొక్కటే మంటలో పడవేస్తున్నాడు.

"అయితే ఎవరైనా జపాన్ ఇనస్పెక్టరు వస్తాడా ఈవేళ?" అని అడిగింది ఆమె.

"నన్ను అవేమీ అడగవద్దు. ఈ పని నన్ను చెయ్యమన్నారు. నేను చేస్తున్నాను, అంతే. ఏజపాను దెయ్యం వస్తే ఎవడికి కావాలి?" అన్నాడు వంటవాడు.

ఇంతలో బైట పెద్దగోల వినవచ్చింది. సియో బైటకు వచ్చి పరుగెత్తి ఆ బడిపిల్లల గుంపులో తాను కూడా కలిశాడు. ఫీఫీ నవ్వుకుంటూ విశ్రాంతి గదిలోకి పోయింది.

"గుడ్‌మార్నింగ్! ఫీఫీ" అంటూ హెడ్‌మాస్టరు ఆహ్వానించాడు. హెడ్‌మాస్టరు ఎప్పుడూలేని గౌరవం చూపుతున్నాడంటే ఆమెకు ఆశ్చర్యం వేసింది. ఆమెకొక కుర్చీ చూపి తానొక (మిగతా 30 వ పేజీలో)



# నేటి అమెరికాలో కోటి మందికి కూడు లేదు!

కామ్రేడ్ ఎరల్ బ్రౌడర్

(అమెరికన్ కమ్యూనిస్టు పార్టీ కార్యదర్శి)

నేడు అమెరికా కార్మికులు ప్రపంచ సాంగ్రామానికి పూర్వంకంటె చాలా హీనస్థితిలో ఉన్నారు. 1929 లో కంటె కూడా అధమస్థితికి వచ్చారు. 1933 లో కంటె అనగా హూవర్ అధ్యక్షుని దుష్టపరిపాలనా విధానం అంత మొందిన సంవత్సరంనుంచి, కొంత మంచి స్థితికి వచ్చారని చెప్పవచ్చును.

## నిరుద్యోగ సమస్య

అమెరికాలో నేడు నిరుద్యోగ సమస్య భయంకర రూపాన్ని దాల్చిఉంది. కోటిమందికి పైగా కార్మికులు ఉద్యోగం లేక అల్లాడుతున్నారు వీరిలో 30 లక్షల మంది ప్రభుత్వంచే యేర్పాటు చేయబడిన రిలీఫ్‌పనులలో కూలికి పనిచేస్తున్నారు. కాని, ప్రైవేటు పరిశ్రమలలో యిచ్చే వేతనాలలో సగం మాత్రమే వీరికి యిస్తారు. మొత్తం నిరుద్యోగుల సంఖ్యకోటినుండి ఏమాత్రమూ తగ్గేసూచనలు కనపడవు. రూజ్వెల్టు అధ్యక్షునికి ప్రతికూలపక్షం వారందరికీ నేటి మాదిరిగానే యిక ముందుకూడా కాంగ్రెసులో మెజారిటీ ఉంటే, 30 లక్షల మందిలో 10 లక్షలమందికి యీసగం కూలి డబ్బులుకూడా యివ్వకుండా "రిలీఫ్ పనుల" నుండి తొలగించ బడతారు.

## కార్మికుల స్థితిగతులు

అమెరికన్ కార్మికుల యదార్థ స్థితిగతులను తెలుసుకోవడానికి సరియైన లెక్కలు లేవు. కార్మికుల కిచ్చే జీతాలు ప్రత్యేకంగా ఎక్కడా చూపబడవు. ఒక్కొక్క పారిశ్రామిక సంస్థను నడిపే ఉన్నతోద్యోగులకు ఏటేటా యిచ్చే జీతాలతోబాటు కార్మికుల కిచ్చే వేతనాలుకూడా కలిపి లెక్కలలో చూపుతారు. సహజంగా అమెరికాలో ఉన్నతోద్యోగులకిచ్చే జీతాలు చాలా హెచ్చు. కార్మికుల వేతనాలుకూడా వీటితో కలిపితే, వారికి యెక్కువ వేతనాలు యిస్తూన్నట్లు పైకి కనపడుతుంది. అయినప్పటికీ, యిప్పుడు అందుబాటులో ఉన్న లెక్కలు చూస్తే, అమెరికా కార్మికుని స్థితి ఏ విధంగా క్షీణించి పోయిందో తెలుసుకొనవచ్చు.

హూవర్ అధ్యక్షుడు నాలుగు సంవత్సరాలు, 1929 మొదలు 1932 వరకు, అమెరికాను పాలించాడు. ఈ నాలుగు సంవత్సరాలలో కార్మికులకూ—ఉన్నతోద్యోగులకూ, ప్రత్యేకించబడిన మొత్తపు నిధి (Compensation to employees) 100 కి 40 చొప్పున తగ్గిపోయింది. కాని, రూజ్వెల్టు అధ్యక్షుడుగా వచ్చిన మొదటి టరమ్‌లో యీ తగ్గుదల సగానికి హెచ్చింది, 1937 నాటికి ముప్పాతికవంతు హెచ్చింది. కాని, వెంటనే అమెరికాకు వాటిల్లిన నూతన ఆర్థిక మాంద్యం మూలంగా యీ క్రొత్త సదుపాయాలు పూర్తిగా మాయమయ్యాయి. 1938 లో కార్మికులకు తిరిగి యివ్వబడిన హెచ్చింపు జీతాలు 1937 లో కంటె చాలా తక్కువ. కార్మికుల సంఖ్య ఎక్కువ కావడం; జీవితావసరముల ధరలు పెరగడం; కంపెనీ అధికారుల జీతాలను ఎక్కువ చేయటం—యివన్నీ దృష్టిలో ఉంచుకొంటే, అమెరికా కార్మికుని జీవిత పరిమాణం 1929 లో కంటె బాగా పడిపోయిందని చెప్పవలసి యుంటుంది. ఇదిగాక, సరకుల చిల్లర అమ్మకాలనుబట్టికూడా కార్మికుల స్థితిగతులు బోధపడతాయి. 1929 లో కంటె 1937 లో చిల్లర అమ్మకాలు 100 కి 20 చొప్పున తగ్గిపోయాయి. 1938 లో ఇంకా తగ్గిపోయాయి. 1923-25 సంవత్సరాలలో ఫ్యాక్టరీ కార్మికుల సంఖ్య కంటె 1938 వరకూ పనిచేసిన ఫ్యాక్టరీ కార్మికుల సంఖ్య సగటున 100 కి 10 మొ॥ 20 వరకు తగ్గింది. ఒక్క 1938 లో సగటున 100 కి 15 చొప్పున తగ్గింది. కార్మికుల కిచ్చిన మొత్తపు వేతనాలు పరిశీలిస్తే, 1923—25 లో కంటె 1938 లో 100 కి 25 చొప్పున తగ్గిపోయాయి.

## రాజకీయ పార్టీలు

విదేశరాజ్యాంగ నీతివిషయంలోను. దేశీయసమస్యల పరిష్కారం విషయములోను, యీ సంవత్సరం ఆమెరికాలో రెండు వ్యతిరేక పక్షాలు ఏర్పడిపోయాయి. కాంగ్రెస్ (ప్రజాప్రతినిధులతో గూడిన క్రింది శాసన నిర్మాణసభ)లో కూడా యింతే. రూజ్వెల్టు (అమెరికా అధ్యక్షుడు) నాయకత్వాన ప్రోగ్రెసివ్ పక్షంవారు నేటి మాదిరిగానే 30 లక్షలమంది బీదకార్మికులకు ప్రభుత్వం రక్షణ యివ్వాలంటారు. ఈ స్కీం ప్రకారం, జూన్ నెలాఖరులోగా $87\frac{1}{2}$ కోట్లడాలర్లు (డాలర్ రు3-8-0) ప్రభుత్వం ఖర్చుచేయవలసి యుంటుందని రూజ్వెల్టు సిఫార్సుచేశాడు. కాని, కాంగ్రెస్ సభలో మెజారిటీగా ఉన్న రిపబ్లికన్‌పార్టీ వారు, టోరీ డెమాక్రటిక్ పక్షంవారు, పై మొత్తంకంటె 15 కోట్ల డాలర్లు తక్కువ శాంక్షన్ చేస్తున్నారు. అమెరికన్ కార్మికవర్గం, మ్యునిసిపల్ కార్యనిర్వాహకశాఖలు, పై $87\frac{1}{2}$ కోట్ల కంటె ఎక్కువ మొత్తం ప్రత్యేకించవలసిందని ఆందోళన చేసినప్పటికీ, కాంగ్రెస్ సభలో అభివృద్ధి నిరోధకులకే మెజారిటీ ఉండడంవల్ల రూజ్వెల్టుతో పూర్తి సహకారం చేస్తున్నారు. "రిలీఫ్ పనుల" విషయంలో కనీసం యిప్పటి మాదిరి అయినా నడపాలని వారు కోరుతున్నారు. ఇక విదేశరాజ్యాంగ నీతివిషయం: రూజ్వెల్టు నాయకత్వం క్రింద ప్రోగ్రెసివ్ పక్షంవారు అన్యదేశాక్రమణకు పూనుకొన్న ఫేసిస్టు రాజ్యాలను నిరోధించ డానికీ; అందుకు కావలసిన అయుద్ధ సన్నాహం గావించడానికీ - పూనుకున్నారు. రిపబ్లికన్ పక్షంవారు, టోరీ డెమాక్రట్లు దీనికి వ్యతిరేకం. ఇంగ్లండ్‌లో ఛాంబర్లేన్ అవలంబించే నీతినే వీరు అమెరికాలో అవలంబిస్తున్నారు. ఆయుధ సామగ్రిని ఏ మాత్రమూ ఎక్కువగా తయారు చేయనవసరం లేదంటారు. రూజ్వెల్టు విధానాన్ని వ్యతిరేకిస్తూ హిట్లరు - ముస్సోలినీలు చెప్పేవాదనలన్నీ వీరుకూడా అమెరికన్ సెనేటులోను, పత్రికలలోను. బహిరంగంగా చెబుతున్నారు.

ఈవిధంగా, అమెరికాలో రాజకీయ పార్టీలు ఫ్రాన్సు రాజకీయ పార్టీలతో పోలికను కలిగియున్నారు. ఇంతవరకూ యీభేదాలు చూచాయగా మాత్రమే కనపడేవి. ఇప్పుడు స్పష్టంగా తెలిసిపోతున్నాయి.

ఇటలీయొక్క పొలిమేర పెనామాకాలువ (ఉత్తర అమెరికాకు—దక్షిణ అమెరికాక్కుమధ్య) అని ముస్సోలినీ ప్రకటించాడు. దీనివల్ల, లీమా కాన్ఫరెన్సులో నేర్చుకొన్న పాఠాలు రుజువైనాయి. క్యూబా అధ్యక్షుడైన కలనల్ బాటిస్టా రూజ్వెల్టుతోను, మెక్సికో అధ్యక్షునితోను, జరుపుతూన్న సంప్రతింపుల అర్థంయేమో ఇప్పుడు బోధపడుతూంది. ఎవరెవరు ఫేసిస్టు రాజ్యాల దాడిని ఎదుర్కొని, పనామా కాలువను రక్షించ జూస్తున్నారో యిప్పుడు తెలుస్తోంది. ఈ మూడు రాజ్యాల ప్రతినిధులు అవలంబించ బోయే విధానానికి ఆయాదేశాల ప్రజాసామాన్యం పూర్తిగా సహాయపడుతుంది. రూజ్వెల్టుయొక్క ఈసంధాను రిపబ్లికన్‌లు, టోరీ డెమాక్రట్‌లు, అంతకంతకు ఎక్కువగా ఎదిరిస్తున్నారు. దక్షిణ అమెరికా దేశాలతో శతృభావం, జర్మనీ-ఇటలీ-జపాన్‌దేశాలతో స్నేహభావం, కావాలని ఒత్తిడి చేస్తున్నారు.

## కార్మికోద్యమం

అమెరికన్ ట్రేడ్ యూనియన్లు రెండుశాఖలుగా చీలిపోయినప్పటికీ, సంఘటిత కార్మికోద్యమం పూర్వం కంటె ఎక్కువ బలాన్ని కలిగి యుందని చెప్పాలి. 1936 లో కార్మిక సంఘసభ్యులసంఖ్య 40 లక్షలు మాత్రమే అయి ఉండగా, నేడు 85 లక్షలకు పెరిగింది. ఇదివరలో యీ ట్రేడ్‌యూనియన్లు రాజకీయాలలో అంతగా పాల్గొనేవికావు. ఇప్పుడు తీవ్రంగా పాల్గొని కావలసినంత రాజకీయానుభవాన్ని సంపాదిస్తున్నాయి. ఐనప్పటికీ, ట్రేడ్ యూనియన్ ఐక్యత అమెరికాలో నేడు అత్యవసరం. పెట్టుబడిదారుల యొక్క, అభివృద్ధి నిరోధకుల, దాడి నెదుర్కోవాలంటే ఒకే ట్రేడ్ యూనియన్ ఫెడరేషన్ ఉండాలి. అమెరికన్ ఫేడరేషన్ ఆఫ్ లేబర్ అనే ట్రేడ్‌యూనియన్ సంస్థయొక్క నాయకులు కార్మికుల్ని తప్పుడు మార్గాలలో నడిపి, రిపబ్లికన్ పార్టీకి సహాయపడుతున్నారు. అయితే, వారి అనుచరులు యిది గ్రహించి, ఎదురు తిరగడం కూడా ప్రారంభించారు. 22 సంవత్సరాల జైలుశిక్ష అనుభవించి, యీ మధ్యనే విడుదల అయిన "టాం మూని" ట్రేడ్‌యూనియన్ ఐక్యతకు తీవ్రంగా కృషిచేస్తున్నాడు.

అమెరికాలో నేడు ప్రజాభిప్రాయం ఏవిధంగా అభివృద్ధి శక్తుల్ని బలపరుస్తూందో తెలుసుకోవడానికి యీక్రింది వివరాలు ఉపయోగిస్తాయి. రిపబ్లికన్ పార్టీ పలుకుబడిలో ఉన్న ఒక సంస్థ ఒక్కొక్క అంశం మీద అమెరికన్ ప్రజల అభిప్రాయాన్ని (వోటింగు ద్వారా) తెలుసుకొంది. ఈక్రింది ఫలితాలు ప్రకటించబడ్డాయి. మొత్తం జనసంఖ్యలో 100 కి 55 గురు రూజ్వెల్టుయొక్క విధానానికి ఆమోదం తెలియజేశారు. ఒక్కొక్కవర్గం ఏలా వోటుచేసిందంటే: పై తరగతిలో 100 కి 34 గురు, మధ్యతరగతిలో 100 కి 51 మంది; క్రింది తరగతి 100 కి 71 రు. "రిలీఫ్" కార్మికులు 100 కి 84 గురు. యూదులమీద, క్యాథలిక్కులమీద, హిట్లరు సాగిస్తూన్న దండయాత్రను 100 కి 94 గురు ఖండించారు. (మిగతా 30వ పేజీలో)

# జయించిన చైనాలో జపానుచేసే రాక్షస కృత్యాలు

## ప్రజలతో నిత్య సంబంధం కల్గిన చైనావారి "న్యూఫోర్తు ఆర్మీ"

అగ్నీస్ స్మెడ్లీ

చైనాలో జపాన్ తన దండయాత్రను ఎలా సాగిస్తూంది? అనే ప్రశ్నకు జపాన్‌వారిచే ఆక్రమింపబడిన పారిశ్రామిక కేంద్రాలలో చాలామంది ప్రజలు ఆ ప్రాంతాల తరపున సమాధాన మిచ్చారు. ఇతర ప్రాంతాలలోని తబ్సీళ్లు చాలా తక్కువగా తెలుస్తున్నాయి. ఎందుచేతనంటే చీనాలోనుండి మిగతా దేశాల వ్యాపారస్తుల నందరినీ తరిమివేద్దామనే ఉద్దేశ్యముతో జపాన్ సేనలు, తమ వశమైన ప్రాంతాలలోను, యాంగిట్సీ పరిసరాలలోనూ, ఇతర దేశస్థులను తమ వ్యాపారాలను వృత్తులను తిరిగి సాగించుకోనీయడంలేదు.

ప్రస్తుతం నేను చైనా అంతర్భాగంలో ఉన్నాను. ఈ ప్రాంతం "పరుల వశమైనది" అని చీనా ప్రజలంతా అనుకుంటూ ఉంటారు కాని ఈ "న్యూ ఫోర్తు ఆర్మీ" (రెండవ చీనా కమ్యూనిస్టు గొరిల్లా సేన) మాత్రం, దీనిని యుద్ధ రంగం అంటూఉంటుంది. వీరు జపానువారి(రియర్)వెనుకభాగాన్ని, యుద్ధరంగంక్రింద మార్చి వేశారు. ఇది యాంగట్సీ నదిపొడ్డున "వుషీ" నుండి "టాటంగ్" వరకూ పొడుగునా కొన్నిచోట్ల 50 మైళ్లు, కొన్నిచోట్ల 150 మైళ్లువెడల్పు కలిగిఉంది.

నాన్‌కింగ్ పడిపోగానే యీప్రాంతంలో చీనా సేనలు కొంత కాలం పోట్లాడి తరువాత కాళీచేశాయి. అంత జపాన్‌వారు ముందుకు చొచ్చుకుపోయి రైల్వే లైనుకు ఎడాపెడా 3 మైళ్ళదూరం లోపలనుండే గ్రామాలన్నీ తగులబెట్టారు. తమకు ఆర్థికంగాను సైనిక వ్యవహారాలకోసం, సహాయపడతాయని నమ్మకమున్న ఏకొద్ది గ్రామాల జోలికోమాత్రం వెళ్ళలేదు. ఇదివ్రాస్తూ ఉన్నప్పుడు నాఎదుట ఒక జపాన్ సైనికునియొక్క డైరీ" ఉంది. ఆతని పేరు "టాకామాసుఎన్యూ". ఆతను 1937 సంవత్సరం డిశంబరు 13 తేదీ లగాయితు ఫిబ్రవరి 18 వ తేదీవరకు యిప్పుడు నేనున్న ప్రాంతంలో పున్నాడు. అతని అడ్రసు "హిరోషిమా, 214, పునాయరీ వీధి, జపాన్. "న్యూఫోర్తుఆర్మీ" యొక్క గొరిల్లా సేనలు అతనిని మొన్న నవంబరులో యాంగిట్సీ తీరాన పట్టుకొని చంపివేశాయి. అతను అతని దేశస్థులు టాన్‌యాంగ్‌లో గావించిన ఘాతుక చర్య ననుగురించి తెలిపే అతని డైరీలోనికొన్ని వివరాలను యీక్రింద ఇస్తున్నాను.(టాన్ యాంగ్ చింకియాంగ్‌కు దక్షిణంగా ఉన్న ఒక రైల్వేస్టేషన్.)

డిశంబరు 22. 1937:— బజారులో ధరలుకూడా మేము నిర్దేశించినట్లే ఉండాలి. షాహుకార్లు నిరాకరించారా, మేము బెదిరించేసరికల్లా వాళ్ళు దచ్చినట్లు ఒప్పుకు తీరవలసిందే.

డిశంబరు 31:— మరునాడు సంవత్సరాది పండుగ, మాంసము, చిక్కుడుగింజల రొట్టెలు, వశం చేసుకొనేటందుకు బజారుకు వెళ్ళాను.

జనవరి 6:— సరుకు, వస్తువులు, వశం చేసుకొనేటందుకు ఊళ్ళోకి పోయాను. ఒక చీనా వాని ఇంట్లో వట్టిగడ్డి తప్ప ఇంకేమీ దొరకలేదు. విషాదకరమైన దృశ్యము.

జనవరి 8:— వీధినుండి పోయే మార్గస్థులను కూలిపని చేయడానికి బలవంతముచేసి ఈడ్చుకువచ్చాం, పనిచేయించుకొని వారికిరెండు, మహా అయితే మూడు సిగరట్లు ఇచ్చా ఒక్కొక్కరికి. ఈసిగరెట్లుకూడ చీనాలోని అటువంటి మార్గస్థుల వద్దనుండి బలిమిని స్వాధీనం చేసుకున్నవే.

జనవరి 17:— వంట చెరకు తీసుకొని రావలసిందని చైనావారికి ఆజ్ఞ ఇచ్చాను. సారాస్వాధీనం చేసుకొని తనివితీరా త్రాగివేశాను. దర్జాగాటవున్‌లోకి వెళ్ళా. రెండు బీస్కు రొట్టెల పెట్టెలు కొన్నా. 60 సెంట్లు, బదులు, 30 మాత్రమే చెల్లించా, ఆదుకాణదారుడు నన్నొక సారాదుకాణం దగ్గరికి తీసుకొని వెళ్ళాడు. అక్కడ సారాఅంతా "కాన్ఫిస్కేట్" (స్వాధీనం) చేసివేశాను.



అగ్నీస్ స్మెడ్లీ

ఫిబ్రవరి 11:— ఫ్యాక్టరీ చుట్టుప్రక్కలనున్న చైనావారి నందరిని దోచుకోవలసిందని, చంపివేయవలసిందని ఆర్డరు వచ్చింది. వెళ్లిపోయా.......సాయంత్రము భోజనానంతరం 'హాయిగా' జూదం అడుకొన్నాం.

ఫిబ్రవరి 18:—విరోధుల వశమైన సేనలు కొన్ని తుపాకులతోసహా తిరిగి వచ్చాయి, మరికొన్ని చాలా రాత్రి అయేవరకు రాలేదు. ఓడిపోగా మిగిలిన వారు తిరుగబడి వాళ్ళనిఎదిరించారట. ఎట్టకేలకు అంతా చెల్లాచెదరై చాలా రాత్రి అయాక వచ్చారు,

జపాన్‌వారి దాడిలో వార ఎదుటనుండి ప్రజలంతా పారిపోయేవారుకారు, 'అక్షరాది ప్రజలకు తలదాచుకోడానికి కొంపలే లేవు, దరిద్రులు పాపం! ఎటొచ్చీ, వాళ్ళమీద బాంబులువేసి తరిమివేస్తే తప్ప వారెప్పుడూ అలాగే తిరుగుతూ ఉండేవారు-నాన్‌కింగ్ ప్రాంతాలలో యిలాంటివాళ్లెందరో పున్నారు. వీరికి పరిపాలకుల మధ్య నున్న తారతమ్యం ఏ మాత్రమూ కూడా తెలియదు. చైనా ప్రభుత్వం, కమ్యూనిస్టుల పలుకుబడికి జడిసి సుమారు 10 సంవత్సరాలు, ప్రజలలో ఇంచుకంతయైన రాజకీయ విద్యా ప్రచారాన్ని కలుగచేయలేదు. దాని స్థానే, జమీందారీ యుగానికి సంబంధించిన "పోషియా" విధానాన్ని నెలకొల్పింది. పెద్ద వర్తకులు, గొప్ప భూస్వాములు, మేజిస్ట్రేటులు యీ 'పోషియా' నాయకులుగా ఉండేవారు. జపాన్ సేనలు యీ ప్రాంతాలపై బడినపుడు వారిని ఆహ్వానించడానికి వీరిలో కొందరు పారిపోకుండా నిలబడే ఉండేవారు. జపాన్ పతాకంవద్దకు పరుగెత్తుకుంటూవెళ్ళి జపాన్‌వారి పాలనకు లొంగి ఉండవలసినదని ప్రజలను ప్రోత్సహించేవారు. మధ్యయుగపు శిక్షణ, విధేయతలలో తర్ఫీదుపొందిన ఆ ప్రజలు పాపం దానిని శిరసావహించేవారు! ఇట్టి ఘరానా మనుష్యుల సహాయంతో జపానువారు "వై-షీ-హ్యూల్" )లేక స్థానికంగా కీలుబొమ్మకమిటీలను) ఏర్పాటు చేసేవారు. జపానువారు నివసించేటందుకు ఇళ్లు, తిండి, ధనం స్త్రీలు, సప్లయిచేయడం, జపాను సరుకు అమ్మేనిమిత్తం బజారులో నుండి ఇతరదేశాల సామాగ్రిని రద్దుచేయించడం, మొదలగు పనులు చేయడం యీకమిటీల యొక్కపని. జపానువారు తమ దోపిడీని పూర్తిచేసిన తరువాత యీ కమీటీవారికి కూడా కొన్ని ఎంగిలి ముక్కలు దొరుకు తున్నాయి. ఇలాంటి ఎంగిలి ముక్కలవల్లనే కొందరు అప్పుడే ధనవంతులు కూడా అయిపోయారు.

యీ ప్రాంతాలలో జపానువారు ఏర్పాటు చేసిన సంస్థ ఇంకొకటివుంది. దీనిపేరు. "షూవా-ఫూ-పావా" దీనికి అర్థం, "సౌఖ్యం సమకూర్చే సంఘం" అని. దీనికి ఒక జపాన్‌వాడు పెద్ద. షాంగ్‌హైలోని రహస్యపు బందిపోటుగాండ్ర ముఠాయొక్క నమోనాలో ఏర్పాటు అయివుంది. ఆదోపిడీగాండ్రు చాలామంది ఈ సంఘంలో సభ్యులే. మంచూరియాలోను ఉత్తర చైనాలోను యిలాంటి సంఘాలనే ఉపయోగించారు. శిథిలమై నశించిపోతూన్న సాంఘిక వ్యవస్థలోని చెత్త అంతా, సహజంగా యిలాంటి సంఘాలచే ఆకర్షింపబడి దానిచుట్టూ చేరుతుంది. వీరు నల్లమందు మొదలగు నిషావస్తువుల వ్యాపారం చేసేవాళ్లు. దోపిడిగాండ్రు, హంతకులు, చిన్నచిన్న దొంగలు, సామాన్యపు రౌడీలు. మొదలయిన వారంతా ప్రపంచంలో అన్నిచోట్లా వుంటారే-వారు-దీనికి మద్దతు, వీళ్లకి ఏ విధమయిన విజ్ఞానంగాని, సాంఘిక చైతన్యంగాని శూన్యం. జపానువారు నిరాధారులయిన గతిలేని అమాయిక కుటుంబీకులను కూడా యీ సంఘంలో చేర్చుకున్నారు.

యీ సంఘం యొక్క కేంద్రము నానాకింగులో, శాఖలు తతిమా ప్రదేశాలలో చాలా వున్నాయి, దీనికి రహస్యపు పని, బహిరంగపు పనీ కూడా వున్నాయి, ఇందులోని రహస్యపు శాఖకు సంబంధించినవారు సామాన్య పౌరుల దుస్తులలోనే సంచరిస్తూ జపాన్ వ్యతిరేకులయొక్క, గొరిల్లా సేనల యొక్క ఆచోకీ తీస్తూంటారు, 'న్యూ ఫోర్తు ఆర్మీ'లో చేరేటందుకుకూడా వలంటీర్లుగా వీరుకొందరు వెళ్లారు. కాని వీళ్ళనందరినీ కనిపెట్టి పరీక్షించి గొరిల్లా సేనలు వారిని కాల్చివేశారు, వీరికి (మిగతా 28 వ పేజీలో)



# పరిణీత

శరశ్చంద్రచటర్జీ

విరచితం

★

"చక్రపాణి"

అనువాదం

అన్నాకాళి మిద్దెమీద వెన్నెల్లో కూర్చుని ఒక రాసి బంతిపూలు ముందువేసుకొని దండ గుచ్చుతూ ఉన్నది. లలిత ఆ పిల్లదగ్గరకు పోయి—"మంచులో కూర్చుని ఏమి చేస్తున్నావు కాళీ?" అని అడిగింది.

"దండ గుచ్చుతున్నాను. ఇవ్వాళ రాత్రికే మా అమ్మాయి పెళ్ళి!" అన్నది కాళి తలఎత్తకుండానే.

"ఏదీ, నాకు చెప్పలేదే?"

"ఇందాకటిదాకా స్థిరపడలేదు వదినా! ఇప్పుడే నాన్న పంచాంగం చూసి ఇవ్వాళ రాత్రికి తప్ప ఇక ఈ మాసంలో లగ్నమేలేదని చెప్పాడు. ఈడువచ్చిన పిల్ల. ఇక అట్టి పెట్టలేను. ఎలాగో ఒకలా సాగనంపుతున్నాను.—ఒదినా! నాకు రెండు రూపాయలుంటే ఇవ్వు. మిఠాయి తీసుకురావాలి!"

"డబ్బు కావల్సి వచ్చేవరకు వదినా? సరే పో. నా బాలీసుకింద ఉన్నాయి. తీసుకుపో!" అని కొంచెం ఆలోచించి—"ఏమే కాళీ, బంతి పూలతో పెళ్ళి అవుతుందటే?" అని నవ్వుతూ అడిగింది.

కాళి గంభీర భావంతో—"అవుతుంది! ఇతర పూవులేవీ దొరకక పోతే అవుతుంది! నేను ఎంతమంది పిల్లల్ని విరగడచేశాను వదినా, నాకంతా తెలుసు!" అని ఫలహారాలు తీసుకురావటానికి క్రిందకు వెళ్ళింది.

లలిత అక్కడే కూర్చుని దండగుచ్చుతూ ఉన్నది.

కాసేపటికి కాళి తిరిగివచ్చి—"అందరినీ పిలిచాను వదినా! ఒక్క శేఖరదాను మాత్రం పిలవలేదు. పోయి చెప్పివస్తాను—లేకపోతే వారికి కష్టంగా ఉంటుంది!" అని వెళ్ళిపోయింది.

కాళి పక్కా గృహిణి. ఆమె పనులన్నీ సక్రమంగా, ఏమీ పొల్లుపోకుండా చేస్తున్నది. శేఖరునికికూడా చెప్పి దిగివచ్చి—"వారికి ఒక దండ కావాలట వదినా, త్వరగాపోయి ఇచ్చిరారాదూ? అంతలోకి నేను మిగతా పనులన్నీ చూస్తాను. ఇక వ్యవధిలేదు—లగ్నం దగ్గరకు వచ్చింది" అన్నది.

"నావల్లకాదు కాళీ! నువ్వే ఇచ్చిరా!" అన్నది లలిత.

"సరే పోతాను. ఆ పెద్దదండ ఇలా ఇవ్వు" అని కాళి చేయి చాపింది.

లలిత దండ ఇవ్వబోయి మరల ఏదో ఆలోచించి—"సరే, నే నే ఇచ్చి వస్తాను!" అన్నది.

"అలాగే పో ఒదినా! నాకు బోలెడు పనులు—చావటానికికూడా తీరికలేదు!" అన్నది కాళి గంభీరంగా.

ఆ పిల్ల ముఖభంగిమా, మాటలతీరూ చూచేవరకు లలితకు నవ్వాగలేదు. "పెద్ద నాపసానివి!" అని నవ్వుతూ దండ తీసుకువెళ్ళి పోయింది. వాకిటిదగ్గరకువచ్చి చూసేవరకు శేఖరుడు మహాదానందంతో ఏదో ఉత్తరం వ్రాస్తున్నాడు. లలిత తలుపుతెరచుకొని వెనక్కువచ్చి నిల్లబడినా శేఖరుడు గమనించలేదు. లలిత ఒక్క క్షణంకాలం అలాగే నిశ్శబ్దంగా ఉండి, శేఖరుని చకితుని చేయాలనే అభిప్రాయంతో ఆ దండను జాగర్తగా—అతని తలకు తగులకుండా—మెడలోవేసి కుర్చీచాటున కూర్చున్నది.

శేఖరుడు మొదట చకితుడయి—"ఏమ్ కాళీ!" అని తర్వాత వెనక్కుతిరిగిచూసి మహా గంభీరంగా—"ఏమిటి నువ్వు చేసింది లలితా?" అన్నాడు.

లలిత లేచి నిలబడి శేఖరుని ముఖభంగిమచూసి శంకితురాలయి—"ఏది. ఏం చేశాను?" అన్నది.

శేఖరుడు గాంభీర్యాన్ని ఏమీ తగ్గనివ్వకుండా—"తెలియదా ఏమిటి? తెలియకపోతే కాళిని కనుక్కురా—ఇవ్వాళ రాత్రి మెడలో దండవేస్తే ఏమవుతుందో!" అన్నాడు.

లలిత తాను చేసిన పని ఏమిటో ఇప్పుడు తెలుసుకున్నది. కనురెప్ప పాటులో ఆమె ముఖమంతా లజ్జచే ఎర్రబడింది—"అదికాదు! ఎప్పటికి కాదు!" అంటూ బయటికి పరుగుపెట్టింది.

"పోబోకు లలితా. మాట—చాలా అవుసరమైన పని ఉంది." అని శేఖరుడు కేక వేశాడు.

శేఖరుని పిలుపు ఆమె చెవిని పడింది. కాని ఎందుకు వినిపించుకొంటుంది? ఎక్కడా ఆగకుండా తన గదిలోకి వెళ్లి పక్కమీద పండుకున్నది.

లలిత అయిదారు సంవత్సరాలనుంచి శేఖరుని సంరక్షణలోనే పెరిగింది. కాని. ఎప్పుడూ ఇలాంటి మాటలు వినలేదు! అసలు, గంభీర ప్రకృతికి చెందిన శేఖరుడు ఆమెను ఎన్నడూ పరిహాసం చేసేవాడు కాదు. చేసినాకూడా ఇంత లజ్జాకరమైనమాట అతని నోటనుంచి వెలువడుతుందని ఆమె ఊహించనేలేదు. ఆమె సిగ్గుతో సగంచచ్చి, కొంచెంసేపు అలానే పండుకొని తర్వాత లేచి శేఖరుని దగ్గరకు వెళ్ళదామా వద్దా అని ఆలోచిస్తున్నది. శేఖరుడంటే లలితకు తగనిభయం, చాలా అవుసరమైన పని ఉన్నదని పిలిచాడు. ఏంచేస్తుంది?

"లలితమ్మ ఎక్కడమ్మా, మాచినబాబుగారు పిలుస్తున్నారు." అంటూ దాసీవచ్చింది.

లలిత బయటకువచ్చి మృదుస్వరంతో—"నువ్వుపోవే, నేనువస్తున్నాను." అని శేఖరుని గదిదగ్గరకువచ్చి తలుపుసందులోనుంచి చూచింది. శేఖరుడు ఇంకా ఉత్తరం వ్రాస్తూనే ఉన్నాడు. కొంచెంసేపు అలానే నిలబడి "ఎందుకూ? పిల్చింది!" అని మెల్లగా అడిగింది.

"దగ్గరకురా చెప్తాను!" అన్నాడు శేఖరుడు వ్రాస్తూనే.

"కాదు! ఇక్కడే ఉంటాను. చెప్పండి."

శేఖరుడు లోలోన నవ్వుకొని "ఇవ్వాళ హఠాత్తుగా ఇంలాటిపని చేశావేం, లలితా?" అన్నాడు.

"ఫోండి—మళ్ళీ!" అన్నది లలిత అలిగినట్టుగా.

"నాతప్పేమున్నది? నువ్వే చేసిపోయావు." అన్నాడు శేఖరుడు లలిత వైపుకుతిరిగి.

"ఏమీ చేయలేదు. అదండ నాకుతిరిగివ్వండి."

"అందుకోసమే మళ్ళీ పిలిపించా లలితా! దగ్గరకురా ఇస్తాను. నువ్వుసగం క్రతువుజరిపి పోయావు. ఇలారా, మిగతా సగం నేనుపూర్తి చేస్తాను!"

లలిత తలుపుచాటునే ఒక్కక్షణం మౌనంగా ఉండి "నిజంగా చెప్తున్నాను. అలా ఎగతాళిచేస్తే ఇక మీదగ్గరికి ఎప్పుడూరాను. ఆదండ తిరిగివ్వండి" అన్నది.

శేఖరుడు మరల టేబులువంకకు తిరిగి దండపైకెత్తి "తీసుకపో!" అన్నాడు!

"అక్కడనుంచే విసిరివేయండి!"

శేఖరుడు తలతిప్పుతూ "ఊహు, దగ్గరకువస్తే ఇస్తాను. లేకపోతే ఇవ్వను" అన్నాడు.

"అయితే నాకక్కరలేదు" అని కోపంతో లలిత బయలుదేరింది.

"క్రతువు సగంలోనే ఆగిపోయింది." అని శేఖరుడు కేకవేశాడు.

"ఆగిపోతే పోనీండి" అని లలిత నిజంగా కోపంతోనే వెళ్ళిపోయింది.

వెళ్లిపోయిందేగాని క్రిందకు పోలేదు. మిద్దె తూర్పు వైపుకు పోయి పిట్టగోడ పట్టుకొని నిలబడింది. ఎదుట చంద్రుడు. చుట్టూ శరత్కాలపు వెన్నెలపిండి ఆరబోసినట్టుగా ఉన్నది. పైన నిర్మల నీలాకాశం. లలిత ఒకమాటు శేఖరుని గదివంక చూసి మరల ఆకాశం వంక చూస్తూ ఉండిపోయింది. కోపంతో కూడిన సిగ్గుతోనూ అభిమానంతోనూ ఆమె కళ్లు అశ్రుపూరితమైనవి. ఇప్పుడామె, ఈ మాటల తాత్పర్యం

తెలియనంత, బాలికకాదు. అయితే శేఖరుడు ఇవాళ ఇలాంటి నొచ్చే పరిహాసం ఎందుకు చేశాడు? తాను ఎంత తుచ్ఛురాలో, ఎంత హీనురాలో, ఇప్పుడిప్పుడే ఆమెక్కు తెలుస్తుంది. అసహాయ, అనాధ - అనే అభిప్రాయంతోనే ఆమెను అందరూ ఆదరిస్తున్నారు; శేఖరుడూ అదరిస్తున్నాడు; అతని తల్లి కూడా ఆదరిస్తున్నది; ఆమెకు నా అనేవారులేరు. నిజానికి, ఆమెబాధ్యత వహించిన వారు ఎవ్వరూ లేకపోవటం చేతనే. గిరీంద్రుడు తనకు సంబంధమేమీ లేకపోయినప్పటికి, ఆమెను ఉద్ధరించటానికి పూనుకున్నాడు.

లలితకళ్లు తుడుచుకొని మనస్సులో అనుకొన్నది:— ఈకలకత్తా సమాజంలో తన మామస్థితి శేఖరునితో పోలిస్తే ఎంతహీనం! అలాంటి మామకు తాను ఆశ్రితురాలు, గుదిబండ! ఇటు తనతో సమానుల ఇంట శేఖరుని వివాహప్రసంగం జరుగుతూ ఉన్నది ఇవ్వాళ కాకపోతే ఇంకా నాలుగురోజులున్నా కయినా ఆసంబంధమే స్థిరపడుతుంది. ఈ పెళ్లికి నవీనరాయ్ ఎంత డబ్బు వడుక్కుంటాడో - దాని పూర్తివివరాలు - లలిత శేఖరునితల్లి వద్ద వినిఉన్నది.

అయితే శేఖరుడివాళ హఠాత్తుగా ఆమెను ఎందుకవమానం చేశాడు; లలిత శూన్య దృక్కులతో ఎదురుగా చూస్తూ ఈ సంగతులన్నీ గాఢంగా ఆలోచిస్తున్నది.

పకపక నవ్వు విని చకితురాలయి లలిత వెనుకకు తిరిగి చూసింది- శేఖరుడు నవ్వుతూ ఉన్నాడు. ఇంతకు పూర్వం తాను ఏ ఉపాయంతో దండ శేఖరుని మెడలో వేసిందో, సరిగ్గా ఆ ఉపాయంతోనే అదే బంతిపూల దండ ఆమె మెడలోకి తిరిగి వచ్చింది. దుఃఖం ఆమె కంఠానికి అడ్డుపడినా, బలవంతాన—"ఎందుకు యిలా చేశారు?" అని వికృతస్వరంతో అడిగింది.

"నువ్వెందుకు చేశావు?"

"నేనేమీ చేయలేదు." అని దండను తెంచివేయబోయి, శేఖరుని కళ్ళవంకచూసి ఆగిపోయింది. తెంచివేసే సాహస మామెకు కలగలేదు. కాని—"నాకెవ్వరూ లేరనేగా, మీరు నన్నిలా అవమానం చేసింది!" అన్నది ఏడుస్తూ.

శేఖరుడు ఇంతవరకు ముసిముసి నవ్వులు నవ్వుతున్నాడు. ఇప్పుడు లలిత మాటలు విని స్తంభించి పోయాడు. ఇవి చిన్నపిల్ల మాటలు కావు!

"నేను నిన్ను అవమానం చేశానా లేక నువ్వే నన్ను అవమానం చేశావా?" అన్నాడు శేఖరుడు.

లలిత కళ్లు తుడుచుకుని—"మిమ్మల్ని నేనెందుకు అవమానము చేశాను?" అన్నది భయపడుతూ.

శేఖరుడు ఒక్క క్షణం ఆగి చాలా మామూలు ధోరణిలో— "కొంచెం ఆలోచించి చూస్తే తెలుస్తుంది. అయినా, ఇప్పుడు నువ్వు చాలా హద్దుమీరి పోతున్నావు లలితా! అందుకనే యాత్రకు పోకముందు నిన్నొక గిరిలో ఉంచి పోతున్నాను." అన్నాడు.

లలిత ఇక జవాబివ్వలేదు. తలవంచుకు నిలబడింది. పండు వెన్నెల్లో ఇద్దరూ నిశ్శబ్దంగా నిలబడి ఉన్నారు. అంతటా నిశ్శబ్దం. కూతురు పెళ్ళి చేసుకుంటూ కాళీ ఊదిన శంఖధ్వని మాత్రం, క్రింద నుంచి 'భోం భోం' అని వినపడసాగింది. కొంచెంసేపు మౌనంగా ఉండి శేఖరుడు—"ఇక మంచులో నిలబడకు, క్రిందకుపో!" అన్నాడు లలితతో.

"పోతున్నాను" అని లలిత ఇంతసేపటి తర్వాత అతని కాళ్ల ముందు మోకరిల్లి నమస్కరించి - లేచి - "నన్నేమి చేయమంటారో చెప్పిపొండి!" అన్నది మెల్లగా.

శేఖరుడు నవ్వాడు. మొదటి కొంచెం సందేహించి తర్వాత రెండుచేతులతో లలితను దగ్గరకు లాక్కొని ఆమె అధరాన్ని ఓష్ఠాధరాలతో స్పృశించి - "ఇంకేమీ చెప్పనక్కర్లేదు లలితా. ఇవ్వాళనుంచి నీకే తెలుస్తుంది!" అన్నాడు.

లలితశరీరమంతా రోమాంచితమై కంపించింది కొంచెం ఎడంగా పోయి నిలబడి - 'నేను మీమెళ్లో దండవేశాననేగా, ఇవ్వాళ మీరిలా చేసింది?" అని అడిగింది.

శేఖరుడు నవ్వుతూ తలత్రిప్పి - "కాదు! నేను చాలా రోజులనుంచీ అనుకొంటున్నాను. కాని స్థిరపరచుకోలేక పోయాను. ఇవ్వాళ స్థిరపడింది. ఎందుకంటే, నిన్ను వదలి ఉండలేనని నేనివాళే గ్రహించాను." అన్నాడు.

"కాని మీనాన్నగారు వింటే కోప్పడతారు. తల్లివింటే దుఃఖిస్తుంది, ఇది నెరవేరదు శేఖరదా".

"నాన్నవింటే కోప్పడేమాట నిజమే, కాని అమ్మ సంతోషిస్తుంది. సరే, తర్వాత ఏమైనా కానీయి, జరుగవలసిందేమో జరిగిపోయింది. ఇక నువ్వూ తప్పుకోలేవు, నేనూ తప్పుకోలేను! పద, క్రిందకు పోయి తల్లికి నమస్కరించు!"

## జపాను రాక్షస కృత్యాలు

(26 వ పేజీ తరువాయి) నెల 1కి 12 డాలర్లు జీతం. ఇదిగాక వీరు తీసుకొనివచ్చిన ప్రతి నిజమైన వార్తకీ, 5 డాలర్లు అదనంగా జపాన్‌వారు ఇస్తూన్నారు. వార్తలేమీ లేనపుడు, యీ ముఠాదారులు వాటిని సృష్టిస్తున్నారు. దానికి ఫలితంగా ఏ అభాగ్యుడో తన ప్రాణాలు కోల్పోతున్నాడు.

ఇంకొక జట్టులోనివారు బౌద్ధ సన్యాసులు. సన్యాసుల వేషమువేసుకొని పల్లెలలో సంచారం చేస్తూంటారు. కాని వీరు చేసే పని మాత్రం సైన్య సంబంధమైనది' వీరికి కొన్ని గుర్తులు, సాంకేతికపదాలు తెలుసును' చీనాలోని దేశ ద్రోహులకు వీరు మాటలు జేరవేస్తూ ఉంటారు.

"షూన్-ఫూ-పాన్"లోని బహిరంగశాఖపని యిది. వీరుచేతిలో తుపాకీ, జేబులో సంకెళ్లు పెట్టుకొని తిరుగుతూఉంటారు. వీరివల్ల ప్రజలుపడే బాధలు దుర్భరం. ప్రజలను వీళ్లు పరీక్షిస్తారు. ప్రతివాడికీ "మంచివాడు అని వ్రాసినబొడ్జి"పడేసి పెంట్లుకు ఒకటి చొప్పున అంటగట్టుతారు. ఇవి కొననివాడి పాట్లు ఇంక పెరుమాళ్లకే ఎరుక. వీరు జపాన్‌వారికంటె ముందుగా గ్రామాలకు పోయి "సౌఖ్యం సమకూర్చే సంఘా"ల సహాయంతో వెనుక సాగివచ్చే జపాన్ సేనలకు స్వాగతం ఏర్పాట్లు చేస్తూవుంటారు, చిన్న జపాన్ పతకాలు ప్రజలకు వీళ్లు అమ్ముతారు. అవి కొనని వాడిని "జపాన్ వ్యతిరేకి" అని నానాహింసలు పెట్టడం ప్రారంభిస్తారు.

జపాన్‌వారికి విందులు "సౌఖ్య సదనాలు" ఏర్పాటు చేస్తారు. ఈ "సౌఖ్యసౌధాల"లో చెరబట్టబడ్డ పడుచులను, సామాన్యప్రజల పడుచు భార్యలను ఉంచుతారు. వీటిపేరు "హేంగ్ - చున్ - వై - లో - సో." అనగా జపాన్ సామ్రాజ్యసైనికులకు సౌఖ్యసదనాలు అని అర్థం. షూన్-ఫూ-పాన్‌లోని మరికొందరు సైనిక దుస్తులలో జపాన్‌సేనల వెనుకనేవచ్చి, సైన్యాలు దోపిడి చేయగా మిగిలినవాటి దోచుకుపోతారు. ప్రతిచోటా పరిపరివిధాల ధనం ఆర్జిస్తూ ఉంటారు. ఒక ఇంట్లో ప్రవేశించడం "నీవు గొరిల్లా సైనికులకు చోటిస్తున్నావు. చూడు రిపోర్టుచేస్తాను. ఇంత సొమ్ము ఇస్తే నీజోలికిరాము" అని బెదరించి డబ్బు కాజేస్తూంటారు. జపాన్‌వారి వలెనే తమ ఇష్టం వచ్చిన దుకాణంలోకి వెళ్లడం తమకు కావలసిన సరుకంతా పట్టుకు చక్కాపోవడం. కలాలు, చాకులు, గడియారాలు మొదలయిన జపాన్ సరుకులు కూడా పట్టుకువెళ్లి వీధులలో ప్రజలను ఆపుచేసి, "ఈసరుకంతా కొనండి" అని బలవంతం చేయడం.... పాపం ప్రజలు విధిలేక. అవి కొనడం - ఇదీ వీరిపని.

ఈ ప్రాంతములో ఏ వర్తకుడుగాని, ఏ వ్యక్తిగాని జపాన్ సరుకు నిరాకరించేటందుకు, అమ్మనని చెప్పేటందుకుగాని వీలులేదు. నూటికి 60 లేక 70 వంతులు అన్ని దుకాణాలలోనూ జపాను సరుకే, మొదటివి బట్టలు, తరువాత అగ్గిపెట్టెలు, కాగితం, సిగరెట్లు, పింగాణీ సరుకు, గాజు సామాగ్రి, సాంబ్రాణి, గుగ్గిలం, కిరోసిరజ, కలాలు, గడియారాలు, టార్చిలైట్లు, దువ్వెనలు, మొదలగు సామాగ్రి అంతా 'ఉంతా ఉండి తీరవలసిందే. ఈ సరుకంతా స్టీమర్లమీద యాంగ్‌ట్సీ నదిగుండా పెద్ద పట్టణాలలోని జపాన్ వర్తకులకు వస్తుంది. వారు చిన్న పట్టణాలలోని వర్తకులకు, వారు పల్లెలలోని వర్తకులకు, వారు ప్రజలకు యీ విధంగా బలవంతముగా యీ సరుకంతా అంటగట్టుతారు. ఈ ప్రాంతములో జపాన్ సరుకు తప్ప మిగతా విదేశీ సరుకు ఏమీ కనపడనే కనపడదు. చైనా సరుకు మాత్రం నూటికి ఏ 30 లేక 40 వంతో ఇంకా ఉంది—

గత ఆగస్టు నెలలో జపాన్ కొత్త రాజకీయ ఎత్తుగడ మొదలు పెట్టింది. అప్పటికి 'న్యూ ఫోర్తు ఆర్మీ' అనే గొరిల్లా సేన తన పని ప్రారంభించి రెండు నెలలే అయింది. ఈ 'న్యూ ఫోర్తు ఆర్మీ'ని ఎలాగయిన ఒంటరిగా చేద్దామని జపాన్ విశ్వ ప్రయత్నాలు ప్రారంభించింది. అప్పటి కప్పుడే 'న్యూ ఫోర్తు ఆర్మీ' ప్రజలతో హత్తుకు పోయింది, పాపం, జపాన్ వారు ప్రకటనలు చేసేవారు. షూన్—ఫూ—పాన్‌వారిచేత 'జపాన్‌వారు కమ్యూనిస్టులతో తప్ప ఇంకెవ్వరితోనూ పోరాడరు' అని ప్రచారం ప్రకటనలు చేయించేవారు.

అందులో ఒక నినాదం చూడండి 'మేం సామాన్య దోపిడిగాండ్ర జోలికిపోము—కమ్యూనిస్టులతో మాత్రమే పోట్లాడుతాము' అని ఒకటి. ఈ రకమైన రాజకీయ పద్ధతులు ఒకనెల అంతా ప్రయోగించింది, ఫాలితపారలేదు. వెంటనే జపాన్ సేనలు గ్రామాలమీద పడ్డాయి. గ్రామాలకు గ్రామాలు తగులబెట్టాయి. కాని యీ పర్యాయము ప్రజలు తమ యావదాస్తిని తమతోపాటు తీసుకొని పారిపోవడం నేర్చుకున్నారు. ఏ కొద్దిమందికో మాత్రం గుండె నిబ్బరం పోయింది. అంతేగాని ప్రజలలో అత్యధిక సంఖ్యాకులు 'న్యూ ఫోర్తు ఆర్మీ' పట్ల విశ్వాసంతో ధైర్యంగా నిలబడి ఉన్నారు.

—మాంచెస్టర్ గార్డియన్ నుండి.



# సుభాసుబాబు రాజీనామా!

# రాజెన్ బాబుకు అధ్యక్షత!!

29-4-1939 వ తేదీని అఖిల భారత కాంగ్రెసు కమిటీ 5 గంటలకు కలకత్తాలో సమావేశమైనది. సుమారు 117 తీర్మానములు చర్చనిమిత్తము సమావేశమున కంపబడినవి. కాంగ్రెసులోఏర్పడిన సందిగ్ధావస్థను తొలగించుటకు గాను బోసు - గాంధీల మధ్య జరిగిన రాయబారములు సంప్రదింపులు వృధా అయినవి.

సుభాసుబోసు

సమావేశములో బోస్ తన అధ్యక్షపదవికి రాజీనామా నిచ్చుచు మహాత్ముని వద్దనుంచి తన కందిన లేఖను చదివి వినిపించి ఒకప్రకటన గావించెను.

## నేను తగను.

"కాంగ్రెసు వర్కింగుకమిటీని నియమించుటకు పేర్లు సూచించుటకు నేను తగను. ప్రధాన విషయములపై మీరేకీభవింపజాలనపుడు నేను పేర్లను సూచించినచో బలిమిని నీపై వాటిని రుద్దుటే యగును. మన సంప్రదింపుల ఫలితముగా నా భావము మారలేదు.

నీ కమిటీని నీవే వేసికొనుము, సాటి సభ్యులతో సంప్రదించినను సమాధానము సమకూరనందుల కెంతయు చింతించుచున్నాను." అని మహాత్ముడు బోసుకు జాబు వ్రాసెను.

## బోసు ప్రకటన.

"కాంగ్రెసు వర్కింగు కమిటీని నియమించుటనుగూర్చి త్రిపురీ తీర్మానము మీకు విదితమే. తదనుకూలముగా మహాత్మునితో సంప్రదింపతా నందుకు తగనని మహాత్ముడనెను. ఎందరితో సంప్రదించినను సమాధానము కుదరలేదు. వర్కింగు కమిటీని నియమింప లేకపోతిని. ప్రస్తుత సమస్యను పరిష్కరించుటకు నా అధ్యక్షతయే ఆటంకము. వేరొకనిని యెన్నుకొనుడు! నేను రాజీనామా నిచ్చుచున్నాను." అని బోస్ రాజీనామా నిచ్చెను.

## జవహర్ పండితుని రాజీసూచన.

అంత నెహ్రూలేచి ఇట్లుపన్యసించెను.

"ప్రస్తుత సమస్యలను పరిష్కరించనిదే మనము కలకత్తా వదలరాదు.

"త్రిపురీ తీర్మానము నమలు జరుపుటలో గాంధీ, బోసుల నెదుర్కొనిన చిక్కులు ఎల్లరకు విశదమే. ప్రతిష్ఠకు భంగములేక జరుగుసలహా నొకదానిని నేను సూచించుచున్నాను. బోసు తన రాజీనామా నుపసంహరించుకొని, పాత కమిటీ మెంబర్లనే వర్కింగు కమిటీలో వేసుకొని, అందు, అనారోగ్యమువల్లను, చెరసాలలో నుండుట వలనను పనిలో పాల్గొన జాలని దౌలత్‌రాం. బజాజ్‌గార్ల స్థానే, బోస్ తన కోరిన సభ్యులను వేసుకొనిన బాగుండును. తరువాత బోసు తన రాజీనామాను ఉపసంహరించుకొని పాతకమిటీ సభ్యులను వర్కింగు కమిటీలో వేసుకొనవలసినది" అని తీర్మానము ప్రతిపాదించెను.

ఫలహారానంతరము 7-30 కు తిరిగి సరోజినీదేవి అధ్యక్షతను సమావేశము ప్రారంభ మాయెను. రఫీ అహమ్మద్ కిద్వాయి నెహ్రూ తీర్మానమును బలపరచెను. జయప్రకాశ నారాయణ నెహ్రూ తీర్మానమును సమర్థించుచూ, "నేను నెహ్రూ సూచనతో పూర్తిగా యంగీకరించుచున్నాను. బోసు రాజీనామా నొసగినచో అది వినాశమునకు దారి తీసి కాంగ్రెస్‌లో చీలికలు కల్గించును. అందుచే బోసును రాజీనామా నుపసంహరించుకొండనికోరుచున్నాను. నేను, వర్కింగు కమిటీ నిర్మించుటలో సూచించిన పద్ధతిని అంగీకరించ బోయిననూ, వేరే దారిలేనపుడు గుడ్డిలో మెల్లయని, దీనినే బలపరచుచున్నాను." అని చెప్పెను. కొందరు సవరణలు తెచ్చిరి.

30 వ తేదీ మధ్యాహ్నం తిరిగి ప్రారంభమైన సమావేశములో తిరిగి నెహ్రూ తన అభిప్రాయాన్ని స్పష్టపరచెను.

దానిపై బోస్ "నెహ్రూ తీర్మానము గాంధీ మొదలగువారు సూచించినదానితో దాదాపు ఏకీభవించుచున్నది. కాంగ్రెసు నందున్న వివిధ రాజకీయాభిప్రాయములను కార్యవర్గము ప్రతిబింబించవలెను. క్లిష్టపరిస్థితు లాసన్నమైనపుడు అన్ని దేశములందును ఇట్టి ప్రభుత్వము లేర్పడు చుండుట కద్దు. గత అధ్యక్ష ఎన్నిక యందిమిడియున్న అర్థమును మనము గుర్తించి కాలాను గుణ్యముగ పోవలయును. నా అభిప్రాయములకు కొంచమైనను తావొసంగినచో నేనధ్యక్షుడుగా నుండదగను - లేనిచో నాకు శెలవొసంగుడు" అనెను.

రాజేంద్రప్రసాద్

నెహ్రూ సలహాను పాటించ వలసినదని బోస్‌ను సరోజినీదేవి కోరినది. అంత బోస్ "ఎ. ఐ. సి. సి. ఆమోదించు తీర్మానమును బట్టి నా యభిప్రాయముండును. నాకు ఐక్యత ఇష్టమే. కాని అది కార్యాచరణయందేగాని, నిలిచిపోవడము యందుకాదు." అని యనెను.

బోస్ ప్రకటనపై నెహ్రూ తన తీర్మానమును ఉపసంహరించు కొనెను.

నెహ్రూ సరోజినీల మాటను గైకొని రాజీనామా నుపసంహరించుకో వలసినదని దత్తు ముజుందారుకూడ బోస్‌ను కోరుతూ తీర్మానము ప్రతిపాదించి బోస్ నిరాకరించుటచే ఉపసంహరించు కొనెను.

తదనంతరము క్రొత్త అధ్యక్షుని ఎన్నుకొన వలసినదని సరోజినీ దేవి సూచించెను. ఇది అశాస్త్రీయమని నారిమన్ మొదలగు 30 మంది సభ్యులు తమ అభ్యంతరమును వెల్లడించిరి. సరోజినీదేవి వాటిని త్రోసిపుచ్చి క్రొత్త అధ్యక్షుని ఎన్నిక జరిపెను.

రాజేంద్రప్రసాద్ అధ్యక్షుడుగా ఎన్నుకొనబడెను. ఆ నాటి కాసభ ముగిసెను.

మే 1 వ తేదీ 1 గంటకు తిరిగి ఎ. ఐ. సి. సి. సమావేశమయ్యెను. బోస్, నెహ్రూలు వర్కింగు కమిటీలో నుండ నిరాకరించిరి. దిగువవారిని వర్కింగు కమిటీ సభ్యులుగా రాజెన్‌బాబు నియమించెను.

అబ్దుల్ కలాం అజాద్, సరోజినీదేవి, వల్లభాయి పటేల్, జమ్నాలాల్ బజాజ్, జయరాందాస్ దౌలత్‌రాం, ఖాన్ అబ్దుల్ గఫూర్‌ఖాన్, జె. బి. కృప్లాని, డాక్టర్, పట్టాభి, భుల్లాభాయి దేశాయి. శంకరరావుదేవ్, హరికృష్ణ మెహతాబ్, బిధన్ చంద్రరాయ్, ప్రఫుల్లచంద్ర ఘోష్.

అనంతరము యుద్ధ అపాయం, కాంగ్రెసు నిబంధనలలో మార్పు మొదలగు తీర్మానములు ఆమోదింప బడెను.

మిగిలిన విషయాలను చర్చించుటకు సభ జూన్ నెలకు వాయిదా వేయబడెను.



సంపాదకవర్గం:
మద్దుకూరి చంద్రశేఖరరావు (సంపాదకుడు)
కంభంపాటి సత్యనారాయణ
పుచ్చలపల్లి సుందరయ్య
తుమ్మల వెంకట రామయ్య

# నిష్క్రమణం

(24 వ పేజీ తరువాయి) కుర్చీలో కూలబడ్డాడు హెడ్‌మాస్టరు. అతని బరువుకు కుర్చీ కటకట లాడింది.

"నేనిప్పుడే విద్యార్థుల నందరిని సమావేశపరచి బోధించి వస్తున్నాను. నీకు తెలుసునుగా, శాంతి నెలకొల్పడానికి నేనెంత పనిచేస్తున్నానో. మనకి కావలసింది కార్యాచరణ. మన వాళ్లందరికి లాభకరమైనదే చెయ్యాలని నాపట్టుదల. అందుకనే నేనీ హెడ్‌మాస్టరు పదవి స్వీకరించాను. ఇంతవరకు స్కూలును జయప్రదంగానే నడుపుతూ వచ్చాను. మన పట్టణవాసులందరికీ నేచేసిన సేవకు నిజంగా నేను గర్వించాలి. ఇప్పుడు మన స్కూలును చూచి పోవడానికి పై అధికారులు వచ్చే గౌరవం కూడా మనకు లభిస్తోంది. మనం మంచి పేరు సంపాదించుకోవాలి. ఏమంటావు ఫీఫీ?" అని ఒక ఉపన్యాసం దంచాడు.

అంతావిని, "ఔనులెండి" అని మాత్రమే అనగలిగిందామె.

"అందుచేత మనస్కూలంతా ఆర్డరులో పెట్టాలి" అని మళ్లీ మొదలు పెట్టాడు. "కొన్ని కొన్ని విషయాలలో మనం ఇంకా అశ్రద్ధగానే వున్నాం. చైనా పటం, చైనా చరిత్ర పుస్తకం ఆ పంట ముండావాడు తగలబెట్టలేదు. నేను సమయానికి చూశాను కనక సరిపోయింది. లేకపోతే మన కెంత ఆపద వచ్చేదో చూడు! ...ఫీఫీ నీవుకూడా నీ టేబిల్‌లో అటువంటి ప్రమాదకరమైన వస్తువులేమైనా వున్నాయేమో మళ్లీ ఒకసారి అంతాచూడు" అని ఆమెను హెచ్చరించాడు.

ఫీఫీ తన తనక్లాసురూములోకి వెళ్ళింది. కాగితాలన్నీ చూసింది. 'ప్రమాదకరమైన' వేమీ ఆమెకు కనబడలేదు.

గంటమ్రోగింది. హెడ్‌మాస్టర్‌రు గబగబా వచ్చాడు. "నేచెప్పినవన్నీ చేశావుకదూ?" అని ప్రశ్నించాడు. "నేను చెప్పేది లెక్కలు, చేతి పరిశ్రమలు మాత్రమేగా. అందు ప్రస్తుత పరిస్థితులకు సంబంధించిన వేముంటాయి? అంతా సరిగానేవుంది" అన్నది ఆమె. హెడ్‌మాస్టరు ఇంకోక్లాసు రూమ్‌కి పోయాడు.

ఫీఫీ ఆరోజున పిల్లలకి పాఠం చెప్పడానికి ఎందుచేతనో తడబడుతోంది. పిల్లలు గోలచేస్తున్నారు. ఇంతలోకే ఇంకొక మేస్టారు వచ్చి ఫీఫీతో, "ఇప్పుడు వచ్చే పైఅధికార్లు, ఆడవాళ్ళు ఉపాధ్యాయులుగా వుండడమంటే ఇష్టపడరు. నీవువెళ్ళిపో. నీక్లాసు నేను తీసుకుంటాను" అన్నాడు. ఆమె ఒళ్ళు ఒక్కసారిగా భగ్గుమన్నట్లయింది. "అయ్యా! మీరునాకు చాలామంచి ఉపకారం చేస్తున్నారు." అని విశ్రాంతిగదిలోకి చక్కాపోయింది. ఏమేమో ఆలోచనలు పోయాయి.

ఇంటర్‌వెల్‌గంట మ్రోగింది. పకపక లాడుతూ మాస్టర్లంతా బిలబిలా విశ్రాంతి గదిలోకి వచ్చారు. ఫీఫీ మాత్రం ఒకమూలగా ఎవరితోనూ మాట్లాడకుండా కూర్చుంది. కొందరు హెడ్మాస్టరుగారి చాక చక్యాన్ని పొగుడుతున్నారు. కొందరు కొత్త కొత్త జపాను సమాచారాలు పిల్లలకు చెప్పడంలో తాము పడ్డకష్టాన్ని గొప్పగా చెప్పుకుంటున్నారు.

మరల గంట మ్రోగింది. వాలెవరూ పిలిపించుకున్నట్లులేదు. కొంతసేపటికి ఎవరి క్లాసుకువారు పోయారు. హెడ్‌మాస్టరు ఫీఫీ దగ్గరకు వచ్చి "నీకిప్పుడేమైనా క్లాసువుందా?" అని అడిగాడు. "లేదు" అని చెప్పింది.

"మంచిది. నీతో కొంచంసేపు మాట్లాడాలను కుంటున్నాను" అన్నాడు.

మాట్లాడవచ్చునన్నట్లుగా తలఊపింది. ఫీఫీ.

"నీతో నేను మొదటే చెప్పానుకాదూ, ఈపరిస్థితులలో మనం జాగ్రత్తగా వుండాలని.

"ఇతరుల కొలువులో వున్నప్పుడు అణగి మణగి వుండాలని సామెత. ఏమంటావ్ చెప్పు" అని ప్రారంభించాడు.

ఫీఫీ మాట్లాడలేదు.

"నీక్లాసులో కుర్రాళ్ళు చేసిన పనులుచూస్తే నాకు చాలా నిరుత్సాహం గలిగింది. 763 కి 50 కలిపితే 813 అని అంటే చాలదు. జపానువాళ్ళు షాంగేను వశపరచుకొన్నది 8 వ నెల 13 వ రోజుననే అని కూడా ఎందుకు చెప్పు? అన్నిటికంటె నాకాశ్చర్యం కలిగించిన విషయం ఇంకోటి. అట్ట విమానంమీద చైనా జాతీయ పతాకం ఎందుకు చిత్రించడం?" అన్నాడు.

"కుర్రాడు ఆబొమ్మ గీస్తానన్నాడు వద్దని నిరోధించడానికి తగిన కారణం నాకేమీ కనపడలేదు" అంది.

"ఎందుకు లేదు? అటువంటి పనులే కుర్రాళ్ళు చెయ్యకుండా మనం చూడాలి. పిల్లలు తప్పులు చేస్తే దిద్దడానికి కాదూ మనమిక్కడ వున్నది?" అని గద్దించాడు.

ఫీఫీ ఏమీ సమాధానం చెప్పలేదు. హెడ్‌మాస్టరు కూడా చాలాసేపటివరకు మాట్లాడలేదు. ఒకసిగరెట్టు మాత్రం తగలబెట్టాడు. సిగరెట్టు అయిపోగానే మళ్ళీ ప్రారంభించాడు.

"కొద్ది రోజులక్రితం నేనొక మిత్రుడ్ని కలుసుకున్నాను. అతడు హాంకో, కాంటన్, చంకింగ్ మొదలైన పట్టణాలన్నీ చూచివచ్చాడు. అక్కడి పరిస్థితులు చాల నిరుత్సాహకరంగా వున్నాయి. జంగ్‌కైషేక్ కమ్యూనిష్టులచే మోసంచేయ బడ్డాడు. చైనాకు ఇక లాభంలేదు. చదువుకున్నవాళ్లం, మనం ఈమాత్రపు పరిస్థితుల్ని కూడా అర్థం చేసుకోలేక పోతే ఎల్లాగ?" అన్నాడు.

ఆమె మాట్లాడలేదు.

"నీవు నన్నీపాటికి అర్థం చేసుకున్నా వనుకుంటాను. ఇక ముందునుంచి అయినా మనకి లేనిపోని చిక్కులు రాకుండా వుండేలాగ చూచు కోవాలి"

"మన దృక్పథం ఇల్లా వున్నంతకాలం, మనకు కష్టాలు తప్పుతాయని నేననుకోను" అంది మెల్లిగా.

హెడ్‌మాస్టరు మండిపడ్డాడు. "వేళాకోళం చేస్తున్నావ?....నీ ఉద్యోగానికి ఇదివరకే రెండు అప్లికేషన్లు వచ్చాయి ..పరిస్థితులు మారాయి. కొంచెం జాగ్రత్తగా ఆలోచించుకో" అంటూ అక్కడనుంచి చరచరా వెళ్లిపోయాడు.

౩

ఫీఫీకి తన కర్తవ్యం స్పష్టమై పోయింది. తెలిసో తెలియకనో ఈ ఉద్యోగంలో ప్రవేశించింది. ఇక ముందు తన జీవితంలో జపానువాళ్లకి సహాయం చేయకూడదని నిశ్చయించుకుంది. జాతీయ సైన్యాలకు రాజకీయ ప్రచారకులు చాలామంది అవసరం. తన తల్లిని తమ్ముడ్ని బంధువుల ఇంటికి పంపిచేయ డానికి నిశ్చయించింది.

మెల్లగా స్కూలు విడిచి ఇంటిదారి పట్టింది. ఆమె వెళ్లిపోతూండడం చూచిన ఒక చిన్నపిల్లవాడు క్లాసులోంచి పరుగెత్తుకు వచ్చాడు.

"ఫీఫీ, ఎక్కడికి వెళ్లుతున్నావు?" అని ఆమెను పట్టుకుని అడిగాడు.

"చాలా దూరం పోతున్నాను తండ్రీ.... చాలా దూరం...."

"ఎందుకు అంతదూరం వెళ్లడం" అని మళ్లీ ప్రశ్నించాడు.

వాడి ప్రశ్నలు చూస్తే ఆమెకు నవ్వు వచ్చింది. "మనమంతా సైనికులం కాదూ? దేశానికి సేవచేయ్యాలి నాయనా "అన్నది.

"అయితే నన్నుకూడా తీసుకెళ్లవూ" అని అడిగాడు.

తన యెడల వాడు చూపుతూన్న అవ్యాజ ప్రేమకు ఆమెకు ఒడలు గగుర్పొడిచింది. వాడ్ని ఎత్తుకుని కౌగలించుకుంది. ముద్దు పెట్టుకుంది. "నీవింకా చిన్నవాడివి నాయనా.... పెద్దవాడివయాక నీవుకూడా దేశానికి సేవ చేద్దువుగానిలే....మీ మేష్టారు కోప్పడతారు. క్లాసులోకి పో" అని బుజ్జగించి పంపివేసింది. కళ్లనీళ్లు తుడుచుకుంటూ పోతూన్న ఫీఫీని వెనక్కి వెనక్కి తిరిగి చూస్తూ కుర్రవాడు క్లాసులోకి పోయాడు.

# నేటి అమెరికాలో

(25 వ పేజీ తరువాయి) 6 గురు అంగీకరించారు. స్పెయిన్ దేశప్రజలకు అమెరికన్ ప్రభుత్వము సహాయంచేసి తీరాలని 100 కి 76 గురు వోటుచేశారు; జర్మనీ - సోవియట్ యూనియన్‌ల మధ్య యుద్ధం వస్తే, ఏపక్షానికి సానుభూతిని తెలియజేస్తారు అనే ప్రశ్నకు జవాబుగా 100 కి 83 రు అమెరికన్లు సోవియట్ యూనియన్‌కు అనుకూలంగా వోటుచేశారు.

ఈఫలితాలు అభివృద్ధి నిరోధక శక్తులను ప్రతిబింబించే రిపబ్లికన్‌పార్టీ తరపు సంస్థచే ప్రకటించబడ్డాయి. కాబట్టి అతిశయోక్తులు ఏమాత్రమూ ఉండడానికి అవకాశంలేదు.

# కమ్యూనిజం వ్యాప్తి

ఈవిధంగా రోజు రోజుకీ వృద్ధిచెందుతూన్న ప్రజాతంత్ర శక్తుల్ని చిందర చేయడానికి అభివృద్ధి నిరోధకులు కమ్యూనిస్టు ప్రతికూల ప్రచారాన్ని ఒక సాధనంగా ఉపయోగించు కొంటున్నారు. కమ్యూనిజం ఫేసిజం యొక్క మరొక స్వరూపం అని ప్రచారం చేస్తున్నారు. అమెరికన్ ప్రజాతంత్ర ప్రభుత్వాన్ని నాశనం గావించడానికి కమ్యూనిస్టులు కృషి చేస్తున్నట్లు అసత్యవార్తలు వ్యాపింపజేస్తున్నారు. అమెరికన్ కమ్యూనిస్టులు ఏవిధంగా ఫేసిజాన్ని ప్రతిఘటించి అమెరికన్ ప్రజాప్రభుత్వాన్ని రక్షించ పూనుకొన్నారో; ఏవిధంగా మెజారిటీ పరిపాలన కావాలని వారు వాంఛిస్తున్నారో; కుట్రలు-దౌర్జన్యాలు వీటికి కమ్యూనిస్టులు ఏవిధంగా వ్యతిరేకులో; దేశంలో ఉన్న ఫేసిస్టు ప్రతికూల శక్తులన్నింటితోను, ప్రజాతంత్ర శక్తులన్నింటితోను కమ్యూనిస్టులు కలిసి పనిచేస్తున్నారో - రుజువు చేయడానికి సుప్రీమ్‌కోర్టు (అమెరికా అంతటిలో పెద్దకోర్టుయిదే, యెదుట కమ్యూనిష్టుపార్టీ సాక్ష్యం యివ్వ బోతూంది.

అమెరికన్ కమ్యూనిస్టుపార్టీలో సభ్యులుగా చేరినవారు చాలా తక్కువమంది. కాని ఆపార్టీయొక్క రాజకీయ కార్యక్రమం అనేక లక్షలమంది ప్రజాసామాన్యాన్ని ఆకర్షిస్తోంది. పార్టీసభ్యులసంఖ్య 1 లక్షమాత్రమే. 25 వేల మంది యువకులుకూడా సభ్యులు తీవ్రంగాను, తెలివితేటలతోను, పాల్గొంటున్నారు. ప్రజాసామాన్యం తమ జీవితసమస్యను పరిష్కరించుకొనడంలో పార్టీసభ్యులు సహాయపడుతున్నారు. సోషలిస్టు సమాజ నిర్మాణము ఏవిధంగా శ్రమజీవుల విమోచనానికి మార్గమో బోధిస్తున్నారు.

